సచిత్ర విచిత్రం

# ఏనుగులకు చుట్టం



బొద్దుగా, ముద్దుగా ఉన్న వీటి పేరు 'మనాటీ'. గోరువెచ్చగా ఉండే నీళ్లలో బాగా అడుగుభాగం లో ఇవి జీవిస్తాయి. ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికా, తూర్పు ఆఫ్రికాల్లోని సముద్రతీరాల్లో ఇవి జీవిస్తున్నాయి.

వీటిని 'సముద్రపు ఆవులు' అనికూడా ముద్దుగా పిలుస్తారు. 9 నుంచి 13 అడుగులు పొడవు, 500 నుంచి 2000 పౌండ్లు బరువు వుండే ఇవి రోజుకు 30 నుంచి 100 పౌండ్ల ఆహారాన్ని భుజిస్తాయి. ఇవి శాకాహారులు. మరో విశేషం మనాటీలు మావటీల చేత నడపబడే ఏనుగులకు దగ్గర బంధువులు. ఈ అమాయక సాధు జంతువులను వీటి మాంసం, చర్మం కోసం వాటినుంచి లభించే నూనెకోసం మనుషులు నిర్దాక్షిణ్యంగా చంపుతుండడంతో ఈ జాతి అంతరించిపోయే స్థితికి వచ్చింది. ఇవి నీళ్లల్లో చేసే విన్యాసాలు, ఆటల తమాషాలు నిజంగా అద్భుత దృశ్యాలే.

# చతుర ప్రపంచం

## ఆకుపచ్చ శరీరం

1887లో స్పెయిన్‌లోని బెంజాస్ అనే ప్రాంతంలో ఇద్దరు విచిత్రమైన పిల్లలు కనిపించారు. ఆ సమయంలో పొలాల్లో వ్యవసాయదారులు పనులు చేసుకుంటున్నారు. అంతలో ఏవో పిల్లల చిత్రమైన కేకలు విని




పించినట్లయి ఆ శబ్దం వచ్చిన దిక్కుకు పరుగెత్తారు రైతులు.

ఒకమ్మాయి, ఒకబ్బాయి కొంచెం దూరంలో ఒణికిపోతూ నిలబడి కనిపించారు. వాళ్ళ వయసులు సుమారు 8, 10 సంవత్సరాలున్నట్టు కనిపిస్తున్నారు. వాళ్ళు అరిచిన కేకలుగానీ, మాటలుగానీ, స్పానిష్ భాషకు సంబంధించినవి కావని గ్రహించారు రైతులు. వాళ్లు ధరించిన దుస్తులు ఏదో లోహంతో తయారయినట్లుగా కనిపిస్తున్నాయి. అంతేకాకుండా మరో ఆశ్చర్యకరమైన విషయమేమంటే వారి శరీరవర్ణం ఆకుపచ్చగా వుంది.

వీళ్లిద్దరినీ ఆ ఊరిలోని ఓ పెద్దమనిషి వద్దకు తీసుకెళ్ళారు. పాలు, పళ్ళు, మంచి నీళ్లు ఏమిచ్చినా తీసుకోడానికి నిరాకరిస్తున్నారా పిల్లలు. వారెక్కడినుంచి ఊడిపడ్డారో, భాష ఏమిటో, ఆహారపు అలవాట్లు ఏమిటో గ్రహించలేకపోతున్నారు ప్రజలు. ఆ అయోమయ స్థితిలోనే రెండు రోజులు గడిచాయి. అంతలో ఆ పిల్లవాడు చనిపోయాడు. అమ్మాయి మాత్రం మెల్లిమెల్లిగా పచ్చికూరముక్కలు తినడం ప్రారంభించింది. పచ్చిబీన్స్ ఎక్కువగా తినేది. క్రమక్రమంగా కోలుకోసాగింది. అలా 5 సంవత్సరాలు గడిచాయి. శరీరవర్ణం కూడా మెల్లిగా మామూలు రంగుకు మారింది. కానీ ఆ అమ్మాయి పుట్టుపూర్వోత్తరాలు మాత్రం కొంత రహస్యంగానే వుండిపోయాయి.

ఆ అమ్మాయి చెప్పిన వివరాల ప్రకారం

ఆమె, చనిపోయిన ఆమె సోదరుడు సూర్యుడు కనిపించని ప్రాంతంనుండి వచ్చారు. వారి ప్రాంతంలోని ప్రజలందరూ ఆకుపచ్చ శరీరవర్ణాన్నే కలిగివుంటారని చెప్పింది. వాళ్ళిద్దరూ ఆ ప్రాంతానికి ఎలా వచ్చిందీ చెప్పమని అడిగితే ఏదో పెద్ద విస్ఫోటనంనుంచి వచ్చే శబ్దం వినిపించిందనీ, వెంటనే తామిద్దరూ ఈ ప్రాంతానికి తోయబడ్డామనీ సౌంజ్ఞలతోనూ, అర్థంకాని భాషలోనూ కొంత సమాచారాన్నివ్వగలిగిందా అమ్మాయి.

ఈ పిల్లల పోలికలు నీగ్రోలకు కొంచెం దగ్గరగా వున్నాయి. కళ్లు ఆల్మండ్ షేప్‌లో వున్నాయి. వాళ్ళున్న ప్రాంతం పేరేమిటని ఎన్నో విధాల అడగ్గా అర్థం చేసుకున్న ఆ అమ్మాయి 'సెయింట్ మార్టిన్స్‌లాండ్' అని చెప్పింది. తాము నివసించే ప్రాంతం చీకటిగా వుంటుందని, దూరంగా వెలుగులు జిమ్మే ప్రాంతం తమకు కనిపిస్తూ వుంటుందనీ బొమ్మవేసి చూపించింది. మరో 5 సంవత్సరాలకు ఆ అమ్మాయి కూడా అనారోగ్య కారణంగా మరణించింది. అయితే ఈ అయిదేళ్లూ శాస్త్రవేత్తల పరిశోధనలు మాత్రం ఓ కొలిక్కి రాకుండానే తెరపడింది. ఇప్పటికీ ఆ పిల్లలు ఏ ప్రాంతంనుంచి వచ్చారనే విషయం రహస్యంగానే వుండిపోయింది.

# భల్లూకాలు

ఏనాటినుంచో భల్లూకాలు జంతుజాలంలో వున్న ఒక జాతిప్రాణులని అందరికీ తెలిసిన విషయమే. అయితే ఎట్లా ఉద్భవించాయన్నది జంతుశాస్త్రంలో మొదటినుంచీ స్పష్టంగా తెలియని విషయం. యుగాలుగా ఇతిహాసకాలంలో అంటే రామాయణ, భాగవతకాలాల్లో వుండే భల్లూకరాజు మనకు సుపరిచితమే.

నేటి శాస్త్రపరిజ్ఞానం మేరకు 30, 40 మిలియన్ సంవత్సరాలకు పూర్వం చెట్లు ఎక్కే మాంసాహార జంతువులు పుట్టుకువచ్చాయి సృష్టిలో. అవి పాలిచ్చి పెంచే జంతువులు. వాటికి మాంసాహార భక్షణకు అనుకూలంగా వుండే చీరుడు పళ్లు, కొరుకుడు పళ్లు మొదలయినవి ప్రస్ఫుటమవుతూ వచ్చాయి. మయాసిడ్స్ అనబడే ఈ జంతుజాలం ఈనాటి 7 తెగల జంతు కుటుంబాలకు మూలం. వాటిలో 'ఉర్సిడే' కుటుంబానికి చెందినవి భల్లూకాలు.

మొదట భల్లూకాలు ఎలుగుబంటుల్లా వుండే కుక్కల తెగనుంచి వచ్చాయి. అవి 27 మిలియన్ సంవత్సరాలకు ముందు సృష్టిలో వుండేవి.

సుమారు రెండున్నర మిలియన్ సంవత్సరాలకు పూర్వం ఇప్పుడు భూగోళంలో నివశించే భల్లూకాల తెగ పుట్టింది. ఉర్సస్ అనే ఈ జాతి భల్లూకాలు క్రమంగా మూడు తెగలుగా విభజింపబడ్డాయి. వాటిలో రెండు తెగలు ఆసియా ఖండంలోను, ఒకటి ఐరోపా ఖండంలోను స్థిరపడ్డాయి. ఐరోపాలో వుండే భల్లూకాల్లో గుహల్లో నివశించే ఎలుగు, బుల్‌డాగ్ ఎలుగులు వుండేవి. కాని 1200 సంవత్సరాల క్రితమే అవి మటుమాయమయ్యాయి.

నేడు ఆస్ట్రేలియాలో వున్న 'కొయిలా' ఎలుగులు నిజం భల్లూకాలు కావు. అవి కంగారు జంతు కుటుంబానికి చెందినవి. చైనా దేశంలో వుండే పాండాలను పెద్ద పెద్ద కోతులుగా అనుకునేవారు. కానీ పెద్ద పాండాలన్నీ ఎలుగుబంట్లేనని ఇప్పుడు తేలిన విషయం.

నల్లఎలుగులు, పోలార్ ఎలుగులు, ఊదా రంగు ఎలుగులు అమెరికా ఖండంలో వున్నాయి. కెనడాదేశంలో 'ప్రిన్స్ ఎడ్వర్డ్ ఐలెండ్' రాష్ట్రంలో మాత్రం నల్ల ఎలుగులు లేవు. అమెరికాలో 32 రాష్ట్రాలలో ఇవి




ఉన్నాయి.

పెద్దగా పెరిగే ఊదారంగు ఎలుగులు అలాస్కా తీరంలోను, రష్యాలోని కాంచెట్కా లోనూ వున్నాయి. అవి సాలమన్ అనే చేపజాతి జలచరాలను తిని జీవిస్తాయి. వీటిని కోడియక్ బేర్స్ అని పిలుస్తారు. కుక్కల్లులాగే ఎలుగుబంటి ఒంటిమీది రోమాలు కూడా ప్రతి సంవత్సరం రాలి పోయి తిరిగి మొలుస్తూంటాయి.

అమెరికాలో కొన్నిచోట్ల తెల్ల ఎలుగు బంట్లు కనిపిస్తాయి. వీటిని కెర్మోడ్ బేర్స్ అంటారు. వీటి కళ్లు బ్రౌన్‌గాను, ముక్కు నల్లగాను వుంటుంది. పోలార్ బేర్స్, అమెరికన్ బ్లాక్ బేర్స్, ఏసియాటిక్ బేర్స్ మాత్రం ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి వలసపోతూవుంటాయి. మిగిలిన రకాల ఎలుగులు మాత్రం ఎక్కడివక్కడే వుంటాయి.

పోలార్ ఎలుగు చర్మం విపరీతమైన సూర్యకిరణాల వేడిని తట్టుకునేలా వుంటుంది. చాలామటుకు భల్లూకాలు సహజంగా కాక మనిషి చేతుల్లోనే చస్తూవుంటాయి. కొన్ని షాపులకి బయట ఎలుగు బంటి వేషంలో మనుషుల్ని పెట్టి వచ్చే కస్టమర్లకి, వారి పిల్లలకి సరదా కలిగించే ఏర్పాట్లు చేస్తూవుంటారు. పల్లెటూళ్లలో అక్కడక్కడ కొన్ని పండగరోజుల్లో ఎలుగుబంటి వేషంలో కొందరు భిక్షమెత్తుకోవడం కనిపిస్తుంది. ఒంటినిండా రోమాలున్న మనిషిని 'టెడ్డీబేర్' అని పిలవడం కూడా కద్దు.

ఏదిఏమయినా ఎలుగుబంటి ఆకారం, దాని చర్మంమీది రోమకళ చూపరులకు భయాన్ని, జుగుప్సని కలిగిస్తాయంటే ఆశ్చర్యం లేదు.

## తల్లిని వీడలేని తనయుడు

రక్త సంబంధాలన్నీ బొత్తి ఆర్థిక బంధాలయిపోయాయి ఈ రోజుల్లో. పూర్వం ఇష్టమున్నా లేకపోయినా కొట్టుకుంటూ, తిట్టుకుంటూనయినా ఉమ్మడి కుటుంబాలని కొనసాగించేవారు. అన్నదమ్ములందరూ తల్లితండ్రులతోను, తమ కుటుంబాలతోనూ కలిసివుండే వారు. ఇప్పుడు అన్నదమ్ములు విడివిడిగా వుండటమే కాదు, కొంతమంది తల్లితండ్రులు కూడా

పిల్లలతో వుండలేక విడిగావుంటున్నారు. మరీ వృద్ధాప్యం ముంచుకొచ్చి అనారోగ్యం పాలయినపుడు కొంతమంది పిల్లలు పేరెంట్స్‌ని ఆదుకుంటున్నారు. మరి కొంతమంది ఎంతమందినికన్నా వృద్ధాశ్రమాల్లో మగ్గుతున్నారు. ఇలాంటి రోజుల్లో తల్లిని విడిచిపెట్టి వుండలేని ఓ కొడుకు కథ ఆశ్చర్యం కలిగిస్తోంది.

అతడిది ఈ దేశంలోని సంగతికాదు. మిన్నాసోటాలోని బెమిడ్జ్ పట్టణంలో జరిగిన సంఘటన. స్టెల్లా అనే మహిళ 75 సంవత్సరాల వయసులో మరణించింది.




కానీ స్టెల్లా కొడుకు ఫ్లాయిడ్‌కు మాత్రం తల్లికి అప్పుడే నిండు నూరేళ్లు నిండాయన్న నిజం మింగుడు పడలేదు. ఆమె హటాన్మరణం అతన్ని విపరీతంగా కుంగదీసింది. ఇంత చిన్న వయసులోనే తల్లిని తనకు దూరంచేసిన భగవంతుడి మీద విపరీతమైన కోపం వచ్చింది.

మొత్తంమీద తననుతాను సంభాళించుకున్నాడు. ఎంత ఏడ్చినా తల్లి తిరిగి రాదనుకున్నాడు. అప్పుడు తల్లి రుణం తీర్చుకోవడమెలాగా అని ఆలోచించాడు ఫ్లాయిడ్. ఓ ఐడియా వచ్చింది. తల్లిని పూడ్చిపెట్టడానికి తవ్వే గొయ్యికి కూలీలను పిలవకూడదనీ, తనొక్కడే స్వయంగా గొయ్యి తవ్వి తల్లి భౌతికకాయాన్ని పూడ్చిపెట్టాలని నిర్ణయించుకున్నాడు అతడు. మొత్తంమీద ఫ్లాయిడ్‌కు తల్లిమీదున్న ప్రేమే గొయ్యి తీసే శక్తినిచ్చింది. అయితే అటు తల్లిపోయిందన్న మానసిక వ్యధతోపాటు, ఒక్కడే గొయ్యి తవ్వడంవల్ల అది పూర్తయ్యేసరికి అతనికి హార్ట్‌ఎటాక్ వచ్చి ఆ గొయ్యి పక్కనే కూలిపోయి మరణించాడు ఫ్లాయిడ్.

దాంతో స్టెల్లా శవం పక్కనే ఫ్లాయిడ్ శవాన్ని కూడా ఖననం చేశారు బంధువులు. ఇందుకు కూలీలను పెట్టకుండా వారే స్వయంగా తవ్వారట.

మిన్నిసోటాలో మాత్రం ఆ తల్లీకొడుకుల అనుబంధాన్ని, ఫ్లాయిడ్‌కు తల్లిమీదుండే ప్రేమగురించీ ఇంకా చెప్పుకుంటూనే వుంటారు.

# నయాగరా సాక్షిగా

ఈరోజుల్లో పెద్దలు కుదిర్చిన వివాహాల కంటే ప్రేమ వివాహాలు అధికమయిపోయాయి. కులాంతర, మతాంతర, జాత్యంతర వివాహాలు అన్నీ మామూలైపోయాయి. కొన్నిటికి తల్లిదండ్రులే గ్రీన్ సిగ్నలిస్తే, కొన్ని వారిని ఎదిరించిన సందర్భాలలో జరుగుతున్నాయి. ఏదిఏమయినా ఈ ప్రేమ వివాహాలు జరుపుకోవడంలో కూడా ఎన్నో కొత్త పద్ధతులు చోటుచేసుకుంటున్నాయని ఓ సర్వే ద్వారా తెలుస్తోంది. నయాగరా సాక్షిగా ఒకటవ్వాలనుకునే ప్రేమ జంటల సంఖ్య రోజురోజుకీ పెరుగుతోందని అనేక సర్వేలు తెలియజేస్తున్నాయి. అందుకే నయాగరా జలపాతాన్ని ముద్దుగా నవదంపతుల నయగారాల జలపాతమని పిలవడం పరిపాటవుతోంది. నయాగరా జలపాతపు హోరునే వేదమంత్రాలుగా, ఆ జలపాతమే సాక్షిగా తాము జీవితాంతమూ కలసి వుంటామని వాగ్దానాలు చేసుకుని ఒకటవుతున్నారు ప్రేమజంటలు. అయితే ఇక్కడ ఓ సమస్య వుంది. అక్కడ భార్యభర్తలు కావాలనుకునే దంపతులు 24 గంటల ముందుగా అక్కడి అధికారులకి చెప్పుకోవాలి. అయితే ఆ వ్యవధిని సడలించి, తగ్గించాలని కొంతమంది కోరుతున్నారు.

ఇలా వెయిటింగ్ లిస్ట్ ఇస్తుంటేనే సంవత్సరానికి ఏడువందలకు పైగా జంటలు ఏకమవుతున్నారు. మరి ఈ నిబంధన సడలిస్తే ఈ సంఖ్య గణనీయంగా పెరిగే అవకాశం ఉందని టూరిజం అధికారులు, చర్చి పెద్దలు అభిప్రాయపడుతున్నారు.




నయాగరా సాక్షిగా వివాహబంధంలో ముడిపడే జంటలు 'ఫాల్స్ వెడ్డింగ్ ఛానెల్' లో పెళ్లి ప్రమాణాలు చేస్తుంటారు.

ఏదిఏమైనా నయాగరా అందాన్ని మాత్రమే కాదు, అక్కడ పెళ్ళాడాలని, హనీమూన్ జరుపుకోవాలని, యవ్వనపు అనుభూతుల్ని నెమరేసుకోవాలని వచ్చే రొమాంటిక్ జంటల సంఖ్య నానాటికీ పెరుగుతోంది. కాబట్టే నయాగరాను అంతా శృంగార నయాగరా అని పిలుస్తున్నారు.

# ఏరినముత్యాలు

★ మొత్తం ప్రపంచం మనల్ని వదిలి దూరంగా పోయినపుడు మన దరిచేరేవాడే నిజమైన మిత్రుడు.

– జ్యోతిర్మయానంద

★ జీవితంలో మీకు సంభవించే విషయాల గురించి కాకుండా మీరు చేయగలిగిన విషయాల గురించే ఎక్కువగా ఆలోచించండి.

– లాంగ్‌ఫెలో

★ వజ్రకంటే కఠినమైనదీ, పువ్వుకంటే మృదువైనదీ సత్యం.

– మహాభారతం

★ సహనం, సహకారం రెండూ ఉన్నపుడే మానవత్వం రాణిస్తుంది.

– జవహర్‌లాల్ నెహ్రూ

★ తోటి జీవిని బాధించి, దేముడిని పూజించడం నిరర్థకం.

– బాబా

★ కృతజ్ఞత అనేది చేసిన మేలుకు చూపించే సుగుణం. క్షమాపణ అనేది చేసిన కీడుకు చూపించే ఔదార్యం.

– జాన్ ఎఫ్. కెన్నడీ

★ స్నానంతో దేహం శుభ్రపడుతుంది. జ్ఞానంతో బుద్ధి శుభ్రపడుతుంది. దానంతో ధనం పవిత్రమవుతుంది. ప్రేమతో హృదయం నిర్మలమవుతుంది.

– సంస్కృత సూక్తి

★ తెలుసుకున్న తప్పు సగం దిద్దుకున్నట్లవుతుంది.

– జాన్. హిచ్‌క్రో

★ మానవునికి తెలిసిన అన్ని రోగాల్లోనూ చికిత్సకు లొంగనిది అహంభావం.

– ఫ్రాయిడ్

★ సిద్ధాంత బలంగల ప్రతి పనీ అవహేళన, ప్రతిఘటన, ఆమోదం వంటి మూడు దశల గుండా పయనించాల్సిందే.

– వివేకానంద

★ నేను ఏథెన్స్ వాసినీ కాదు, గ్రీకు దేశస్థుడినీ కాదు. ప్రపంచ పౌరుడిని.

– సోక్రటీస్

★ ధనము చేత కాదు, సంతతి చేత కాదు, త్యాగము చేతనే ఎందరో అమృతత్వమును పొందిరి.

– ఉపనిషత్తు

సేకరణ: వి.వి.రమణకుమార్

# 'వీలునామా' పై సమీక్షలు

మార్చి చతురలో ప్రచురితమైన తంగెళ్ళ శ్రీదేవిరెడ్డి నవల 'వీలునామా' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## నాకు నచ్చిన పాత్ర

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

**డ**బ్బుకోసం మనుషులు ఎంత హేయమైన పనైనా చేయగలరు. డబ్బుమీది వ్యామోహం మానవత్వాన్ని భూస్థాపితం చేస్తుంది. డబ్బు సంబంధాలే కాని రక్తసంబంధాలకు ప్రాముఖ్యతనీయని నేటి ప్రపంచ పయనపు గమ్యం ఏమిటో, ఎంత దారుణంగా ఉంటుందో ఊహించటానికే భయంగా ఉంది!

ఒకస్థాయి దాటి వచ్చే డబ్బు రక్త సంబంధాల అస్తిత్వాన్ని ప్రశ్నిస్తుంది. అంతేకాదు, మానసిక ప్రశాంతతను దూరం చేస్తుంది. 'అతి సర్వత్రవర్జయేత్' అని పెద్దలన్నారు కదా.

డబ్బుకోసం మనుషులు చేసే అఘాయిత్యాలను కళ్ళకు కట్టినట్లు తంగెళ్ళ శ్రీదేవిరెడ్డి తమ 'వీలునామా' నవలలో చూపించారు. నేటి సమాజపు రీతికి ఇది ఒక నిలువుటద్దమే. అయితే పాత్రల చిత్రీకరణలో రచయిత్రి కృతకృత్యులు కాలేకపోయారు.

పరిమళ పాత్ర పరిశీలిస్తే తన ఆస్తికోసం మాత్రమే బంధువులు కపట ప్రేమను ఒలకపోస్తున్నారని తెలిసినా, వారితోనే ఉండవలసిన ఒంటరి జీవితం. తన చావుకోసం ఎదురు చూస్తున్నారని, ఆస్తి దక్కించుకోవటానికి కుట్రలు పన్నుతున్నారని తెలుసు. అయినా 'క్షమయా ధరిత్రి' అన్నట్లు వ్యవహరిస్తుంది. మంచితనం మనిషికి అవసరమే! కానీ అతి మంచితనం చేతకానితనం అవుతుంది. అవమానాల పాలు చేస్తుంది. దుఃఖ హేతువు కూడా! ఇది ఈ పాత్రలోని కొట్టొచ్చే లోపం.

ఒక ప్రౌఢగా పరిమళ పాఠకులకు పరిచయమవుతుంది. తన కన్న ఎక్కువ వయసు గల భర్తతో కాపురం ఆమెకు అసంతృప్తినే మిగిల్చింది. కొడుకును, కోడల్ని యాక్సిడెంట్‌లో కోల్పోయి గుండె రాయి చేసుకుని బతుకుతోంది. జీవితంలో ఎంతో విషాదాన్నే చూసిన ఆమె జీవితనేపథ్యం సహజంగా ఆమెను మానసిక పరిణితి చెందినదానిగా చెయ్యాలి. ధైర్యంతో, సంయమనంతో వ్యవహరించి ఆస్తిని నిలబెట్టుకుంది. ఒక రకమైన మొండితనం, రాక్షసత్వం లేనిదే ఇది సాధ్యం కాదు. లోకపు రీతిని... సునాయాసంగా అంచనావేసి అర్థం చేసుకోగలదు. అంతే కాదు. ఏ ఇబ్బందులూ ఎదురవకుండా జీవితాన్ని సజావుగా నడుపుకోగలదు. అవరోధాలను అధిగమించగలదు. ఈ లక్షణాన్ని పరిమళ పాత్రలో రచయిత్రి పూర్తిగా ప్రతిష్టింపచేయలేకపోయారు. అదే ఈ పాత్రలోని ఇంకో లోపం.

ఆ శక్తి పరిమళకు ఉన్నట్లు చూపించాలని రచయిత్రి ప్రయత్నించినా ఆమె మితిమీరిన క్షమాగుణం వల్ల, అది మబ్బులచాటున సూర్యుడే అయింది. ఈ లోపం లేకుంటే ఇది ఒక అద్భుత పాత్రే.

తన మనవడు శశాంకతో జరిపే సంభాషణలు ఆమె ధీశక్తికి, విజ్ఞతకు, అనుభవానికి తగినట్లుగా లేవు. పైగా శశాంక తన చిన్నాన్న, ఇతర బంధువుల నిజస్వభావాల్ని, కుత్సిత బుద్ధుల్ని విశ్లేషించి చెబుతున్నప్పుడు అతను చిన్నవాడని, లోకం తెలియనివాడని అంటుంది. ఒక అనుభవశాలి అనవలసిన మాటలు కావవి. కేవలం సందర్భానికి అను

గుణంగా పాత్రని మలిచారు. కాని పాత్రల అంతర్లీన స్వభావాన్ని మరచిపోతే అది పేలవమవుతుంది. పాత్ర ఔచిత్యం దెబ్బతింటుంది కూడా!

మిగిలిన పాత్రలు రొటీన్ పాత్రలే. అయితే బుచ్చమ్మ... పరిమళ పనిమనిషి పాత్రలో కన్‌సిస్టెన్సీ ఉంది. ఆ పాత్ర సహజంగా ఉంది. అందుకే ఆ పాత్ర నాకు నచ్చింది.

– చంద్రశేఖర మాధవరావు
విజయవాడ-10

## నిజజీవితాలే-కానీ...

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

హుందాతనం, మానవత్వం, స్వార్థం, ఆకతాయితనం, చేతకానితనం, దురుసుతనం మొదలైన విభిన్న మనస్తత్వాలు కలిగిన పాత్రలతో నవల సాగింది. ముఖ్యంగా వరప్రసాద్ తన వ్యక్తిత్వానికి విలువనీయని మనుషుల మధ్య తన జీవితం సాగినా, 'సమయం వచ్చినప్పుడు మాత్రం ధైర్యంగా నిలబడగలను, తను చనిపోయినా సాధించుకు తీరుతాను' అనే ఆత్మస్థైర్యం కలిగిన పాత్ర. తన కుమార్తెలకు ఆస్తి పంచి ఇచ్చే సమయంలో హుందాగా ప్రవర్తించాడు. నిజాన్ని నిర్భయంగా చెప్పగలిగాడు. పరిమళాదేవికి తన చెల్లెలు, ఆమె భర్త, వాళ్ళ కూతురు శకుంతల చెడ్డవారనీ, స్వార్థపరులు అని తెలిసినా తన కడుపు శోకానికి కారకులు అని ఊహించలేకపోయింది. అంత దుర్మార్గులని భావించలేకపోయింది. దుర్మార్గాన్ని ఒక పరిధి వరకే వూహించుకోగలిగిన పరిమళాదేవి, శకుంతల యొక్క పూర్తి నిజస్వరూపం తెలిస్తే... అప్పటి ఆమె ప్రవర్తన ఎలా వుండేది?

అయితే చివరలో తెలియనే తెలుస్తుంది. అప్పుడు కూడా ఆమె అంతరాత్మ శకుంతల తప్పుచేస్తే పిల్లలెందుకన్యాయం పాలవ్వాలి అని ఆలోచిస్తుంది. ఆ విధంగా రచయిత్రి ఆ పాత్ర ఔన్నత్యాన్ని చివరివరకు నిలిపారు.

అపకారం చేయబడిన పరిమళాదేవి నుండి ఉపకారం పొందడానికి అంగీకరించలేని ఆత్మాభిమానం కలిగిన వ్యక్తి వరప్రసాద్. నిజజీవితంలో ఎదురయ్యే పాత్రలు- శశాంక, బుచ్చమ్మలు సాధారణ పాత్రలు. ధనంజయ ప్రాముఖ్యత ఏమీలేదు. ఏదిఏమైనా చివరివరకూ చదివించగలిగిన నవల వీలునామా.

– సాయిప్రకాష్
విశాఖపట్నం-530 027

## బయోగ్రఫీ

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

మార్చి 2002 'చతుర'లో ప్రచురించబడిన తంగెళ్ళ శ్రీదేవిరెడ్డి రచన 'వీలునామా' నవల డబ్బులకోసం మనుషులు ఎంతకైనా దిగజారుతారని నిరూపించడంలో సఫలీకృతు అయింది. 'మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలే' అని మరోకోణంలో చాటింది.

కేవలం డబ్బుకోసం బంధువులు రాబందుల్లా పరిమళాదేవిని పలురకాలుగా హింసించడం చదువుతుంటే, ఇలాంటి సంఘటనలు గతంలో ఎక్కడో విన్నట్లుగానో, చూసినట్లుగానో అనిపిస్తాయి. కాకపోతే అన్ని సంఘటనలు ఒక్క పరిమళాదేవి పాత్రకే రచయిత్రి ఆపాదించేసరికి ఆ పాత్ర పట్ల పాఠకుల్లో సానుభూతి కలుగుతుంది. ఆమె కుటుంబ సభ్యులందరూ ప్రమాదవశాత్తూ ప్రాణాలు కోల్పోవడం యిందుకు మరింతగా దోహదం చేసింది. ఎన్ని యిబ్బందులు ఎదురైనా, సమస్యలు వచ్చినా 'మనిషి'గా నిలబడడానికి 'పరిమళాదేవి' చేసిన కృషి అద్భుతం. ఆ వ్యక్తిత్వ చిత్రీకరణలో రచయిత్రి మంచి ప్రతి

భను కనబర్చారు. అందుకు ఆమెకు అభినందనలు.

డబ్బూ, పేరు ప్రతిష్టలున్న వ్యక్తుల చుట్టూ ఎప్పుడూ ఒక కోట వుంటుంది. అందులో శకుంతల, జానకీదేవీ, సూర్యప్రకాశరావు లాంటి స్వార్థపరులే కాదు. బుచ్చమ్మ, వరప్రసాద్‌లాంటి మంచి మనుషులూ ఉంటారు. కాకపోతే ఎవరు, ఎలాంటి వారో గమనించి, ప్రవర్తించవల్సిన బాధ్యత మాత్రం 'పరిమళా దేవి' లాంటివారిదే! అయితే అన్నీ తెలిసి, అందరి నైజం తెలిసి కూడా ఏమీ తెలియనట్లు, ఏమీ జరగనట్లు ప్రవర్తించడం ఒక్క మహాత్ములకే చెల్లుతుంది. అలాంటి మహాత్ముల కోవకు చెందినదే పరిమళాదేవి. కానీ, మరీ ఇంత మంచితనం ఉంటుందా? అంతా 'సినిమా కష్టాల' మాదిరిగా ఉంది కదా?' అని సందేహపడితే అది పాఠకలోకం తప్పు కాదు. అన్నీ తెలిసిన తర్వాత కూడా పరిమళాదేవి ఆత్మహత్య చేసుకోవడం, కావేరి వివాహం తర్వాత కూడా శకుంతల డబ్బుల కోసం చేసిన ప్రయత్నం... అంతా అతిగా అనిపించక మానదు. ఒకవిధంగా చెప్పాలంటే ఈ నవల అంతా 'పరిమళాదేవి బయోగ్రఫీ' లాంటిది. సాధారణంగా పాఠకులను బయోగ్రఫీలు అంతగా ఆకర్షించవు. ఈ నవల కూడా అదే కోవకు చెందుతుంది. కానీ రచయిత్రి చూపిన రచనానైపుణ్యం, భాషాశైలులు ఈ భారాన్ని కొంతవరకు తగ్గించడానికి సహకరించాయి. పనిలో పనిగా రచయిత్రి బాల్యవివాహాల పట్ల వ్యతిరేకతను, అందువల్ల జరిగే అనర్థాలను, స్త్రీ విద్య యొక్క ఆవశ్యకతను పాఠకలోకానికి నొక్కిచెప్పడం జరిగింది.

డబ్బుకోసం ఎత్తుగడలు, కేవలం ఐదారు పాత్రల చుట్టే అల్లబడిన కథాగమనం, సాగదీసినట్లుగా నడిచిన సన్నివేశాలు, కథకు ఎక్కువ. నవలకు తక్కువగా ఉన్న పరిధి, అన్నీ కలిపి 'వీలునామా' నవలగా మారింది.

ఇది చదివిన పాఠకులు ఎవరైనా పరిమళాదేవి పాత్రలోని వ్యక్తిత్వాన్ని అలవర్చుకుంటే రచయిత్రి తంగెళ్ళ శ్రీదేవిరెడ్డి ప్రయత్నం కొంతైనా నెరవేరినట్లే! కాకపోతే శకుంతల, జానకీదేవిలు లాంటి వారికి ఆదరణ ఉన్న ఈరోజుల్లో అది సాధ్యమా అన్నదే సందేహం.

– సయ్యద్ ఖుర్షీద్
మహబూబాబాద్-506 101

## విశ్వాసానికి ప్రతీక

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ఫిబ్రవరి 2002 చతురలో ప్రచురించబడిన తంగెళ్ళ శ్రీదేవిరెడ్డి రచన 'వీలునామా' ... లుప్తమౌతున్న మానవ సంబంధాల అస్తవ్యస్థ స్థితిని చాటిచెప్పింది. ప్రేమ, ఆత్మీయత పుష్కలంగా ఉన్న మనిషి యొక్క ఆలోచనా సరళి ఎలా వుంటుందో పరిమళాదేవి పాత్రలో అణువణువునా రంగరించారు. స్వార్థబుద్ధితో తన చుట్టూ చేరిన బంధువులు తన ఆస్తిమీద ఆశపడి తనమీద ప్రేమ చూపుతున్నారని తెలిసి కూడా వారిని మన్నించడం, చివరికి తన కొడుకుని, కూతుర్ని బలి తీసుకుందనీ తెలిసి కూడా వరసకి కూతురైన శకుంతలకు తన 'ఆస్తిలో భాగం ఇవ్వాలా? ఆమెని క్షమించాలా? అయినా పిల్లలు తప్పు చెయ్యలేదుగా' అని ఆలోచింపచేయడంద్వారా రచయిత్రి ఆ పాత్రను ఉన్నత శిఖరాగ్రాన నిలిపారు.

సొంతబిడ్డలే తల్లిదండ్రుల్ని చీదరించుకుని వెళ్ళిపోతున్న ఈ రోజుల్లో విశ్వాసానికి ప్రతీకగా పనిమనిషి బుచ్చెమ్మను మలిచారు. "నేను చచ్చిపోవాలనుకున్నాను అమ్మగారూ, కానీ మీకోసం బతుకుతానమ్మా" అన్న వాక్యంలో ఆమెకు యజమానురాలి యందలి గౌరవాభిమానాలను, నిర్మలమైన ఆత్మీయతా భావాన్ని తెలియచేస్తాయి.

అనుక్షణం తన భార్య చేస్తున్న ఆగడాలను

సహించి చివరికి ఆమెకు గుణపాఠం చెప్పి ఆమెను మంచిదారిలో పెట్టే భర్త, నానమ్మ కోసం ఆరాటపడే శశాంక, అమాయకపు మాటలతో ఆకర్షించే కస్తూరి... వీరిద్వారా మానవతా విలువలను తెలిపారు.

నేటి సమాజంలో అంతరించిపోతున్న ఆప్యాయతా, అనురాగాలు, మానవ సంబంధాలపట్ల సాగిన ఈ రచన ఎంతో సున్నితంగా ప్రతి ఒక్కరి మనసును దోచుకుంటుంది.

– కె. శ్రీనివాస అయ్యప్ప
హైద్రాబాద్.

## కుతంత్రాల పుట్ట-సహనాలకు గుట్ట

*(ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

**ఆ**హ్లాదకరమైన గ్రామీణ ప్రకృతిశోభని సుజలాం సుఫలాం అని వర్ణన చేస్తూ ఆరంభించిన నవల వీలునామా ఆదిలో తగిన వేగంతో సరసంగా సాగింది.

"పెండ్లి అంటే బొమ్మలాటకాదు", "వేర్వేరుగా వున్న రెండు జీవితాలు ఒకటి కాబోతున్నాయంటే అది సామాన్యంకాదు"

"ఆడపిల్లకి పెళ్ళి చేయగానే బాధ్యత తీరిపోదు", "మొగుడు అంటే కేవలం మగవాడై వుండడంకాదు" అని స్వానుభవంతో పరిమళాదేవి విలువైన జీవిత సత్యాలు చెప్పింది.

"చూడు శకుంతలా! అల్లుడు నీమాట వినకపోతే, నేను వచ్చి పెళ్ళి వాయిదా వేయిస్తాను" అని ఖచ్చితంగా చెప్పిన పరిమళాదేవిని ఆమె బంధుగణం కుతంత్రాలతో కావేరి పెళ్ళి జరిపించడానికి ఒప్పించిన తీరును రచయిత్రి శ్రీదేవిరెడ్డి చక్కగా మలిచారు. సహనానికి మారుపేరు పరిమళాదేవి.

సమాజంలో కొన్ని సాధారణ కుటుంబాల్లో మనకు కనిపించే దురాశాపరుల కుతంత్రాల్ని, ధనదాహాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రీకరించిన నవల వీలునామా.

ఎదిగీ ఎదగని వయసులోనే ఏదో అవకాశం జారిపోతుందని ఆరాటపడి ఆడపిల్లకి పెళ్ళి చేస్తే ఎదురయ్యే అనర్థాన్ని బుచ్చమ్మ మనవరాలు రామలక్ష్మి ద్వారా ఎత్తిచూపించిందీ నవల.

మొదట్లో మంచికి, చెడుకి మధ్యస్థంగా వుండి అత్తమామలు, భార్య చెప్పినట్లల్లా ఆడిన వరప్రసాద్ అనూహ్యంగా మారిపోయాడు. ఆ పాత్ర ఆదినుండీ బాగుండాల్సింది.

హృదయ నైర్మల్యానికి నిదర్శనంగా నిలిచిన పాత్ర బుచ్చమ్మ. ఉత్తమురాలైన పెదతల్లి కొడుకుని, అతని భార్యని ఆస్తికోసం హత్య చేయించిన పరమపాపాత్మురాలు శకుంతలకి చివరలో పరివర్తన కలిగిందనడం అసహ్యంగానూ, అనౌచిత్యంగానూ వుంది. 'పుర్రెతో పుట్టిన బుద్ధి పుల్లలతో గానీ పోదు' అన్నదే సత్యం!

"పరిస్థితులు కొన్నిసార్లు అబద్ధంగా మొదలై 'నిజం'గా జీవం పోసుకుంటాయి'' అని పరిమళాదేవితో అనిపించడం కూడా సరికాదు. అబద్ధం అబద్ధంగానే వుంటుంది. అదెప్పుడూ మారదు. 'అబద్ధం' అనే మాటలోనే ఆ అర్థం వుంది.

మొత్తంమీద సమాజంలో క్రమంగా పెరుగుతున్న ధనపిపాసకు, కుతంత్రాలకు దర్పణం పట్టిందీ నవల. మహాకవి పోతన్నగారు 'అశుభ ప్రతిపాదకమగు కలియుగంబు' అన్నారు. ఆ మాట నిజమవుతుందేమో!

– సూర్యదేవర శారద
హైద్రాబాదు - 500 062

☆

# చతుర

సంపుటి: 25 సంచిక: 4 మే–2002
292వ సంచిక

అందగాడూ, ఐశ్వర్యవంతుడూ, బుద్ధిమంతుడూ అయిన ఆ మెడికో తన తోటి విద్యార్థినిని ప్రేమించాడు. ఆదివారాలు కూడా కాలేజీకి శలవు ఎందుకు పెట్టారో అని తిట్టుకునేవాడు. ఒక్కరోజు కూడా ఆ అమ్మాయిని చూడందే వుండలేకపోయేవాడు. అయితే... తన ప్రేమను ఆ అమ్మాయిముందు ధైర్యంగా వ్యక్తం చెయ్యలేని అతని పిరికితనం చూసి అతని స్నేహితుడు... తానే వారిద్దరినీ కలుపుతాననీ, అతడి ప్రేమను తానే ఆమెకు తెలుపుతాననీ వాగ్దానం చేశాడు. అయితే ఆ ప్రేమకథ వారిద్దరూ కూడా ఊహించని అనేక మలుపులు తిరిగి, విచిత్రంగా ముగిసింది. ఎలా?
యువతీయువకుల మధ్య ప్రేమతోపాటుగా వుండవలసిన మరిన్ని అర్హతలను అక్షరబద్ధం చేసిన...

పుచ్ఛా రామకృష్ణ
నవల

# ప్రేమపథం



ఈ నెల చతుర సమగ్ర నవల

"కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికం
ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవిన్ద ఉత్తిష్ఠ గరుడధ్వజ
ఉత్తిష్ఠ కమలాకాన్త త్రైలోక్యం మంగళం కురు"

హాలులోనుండి వినిపిస్తోంది శ్రీ వెంకటేశ్వర సుప్రభాతం.

వైదేహి బద్ధకంగా ఒళ్లు విరుచుకుంది. తన నడుము చుట్టూ ఉన్న భర్త చేతిని పక్కకు తప్పిస్తూ లేచి కూర్చుంది. మోకాళ్ల వరకూ తొలిగిపోయిన నైటీని కిందకు లాగింది.

బెడ్ దిగి రెండు అడుగులేసి తలుపు తీసింది. హాలులోకి చూడడంతోనే ఆమె మనసులో అనీజీనెస్ చోటు చేసుకుంది.

అప్పటికే హాలు నీట్‌గా సర్దబడి ఉంది. దేముడి గదిలోనుండి అగరవత్తుల పొగ చిన్నసైజు మబ్బులా గాలిలో తేలియాడుతూ హాలులోకి రావడం కనిపిస్తోంది. హాలులోని సోఫాలో కూర్చుని తన ఆడబిడ్డ మౌనిక ఏకాగ్రతతో చదువుకుంటోంది.

తలుపు తీయడంతో అయిన శబ్దానికి కాబోలు తలతిప్పి చూసిన ఆమె తనను చూసి "గుడ్ మార్నింగ్ వదినా!" అంది.

"గుడ్ మార్నింగ్" తనూ ఏదో అనాలి కాబట్టి అన్నది గానీ నిజానికి మౌనికకు విషెస్ చెప్పడం తనకిష్టంలేదు.

ఆమె వంటగదిలో కెళ్లబోతుంటే వెనుక నుండి మౌనిక మాటలు వినిపించాయి. "వదినా! కాఫీ ఫ్లాస్క్‌లో పోసి ఉంచాను, చూసుకోండి"

వైదేహికి మరోసారి ఇబ్బందిగా అనిపించింది.

నిజానికి మౌనిక ఎప్పుడూ కూడా తనని ఇబ్బంది పెట్టేలా మాట్లాడడంగానీ, లేదా ఇబ్బంది కలిగించే పనులు చేయడంగానీ ఎరగదు. ఆమె చేసే చాలా పనులు ఒక విధంగా తనకు సహాయపడుతున్నట్టుగానే ఉంటాయి. అయినా సరే, మౌనికను చూస్తే తనకేదో అనీజీ ఫీలింగ్.

అలా ఎందుకు? అని తనలో తాను ప్రశ్నించుకుంటే దొరికిన జవాబు, తన క్యారెక్టరుకు పూర్తి వ్యతిరేకంగా ఉండే ఆమె కేరెక్టరును చూస్తే కలిగే ఇబ్బంది అని అర్థమయిపోయింది.

మౌనికకూ, తనకూ మధ్య వయసు తేడా మూడేళ్లే. తనేమో బి.యస్సీ రెండు సార్లు ఫెయిలయితే, ఇక ఆ చదువు చెట్టెక్కించేసి పెద్దలు పెళ్లి చేసేశారు. మౌనికకు ఇంటర్‌లో ఫస్ట్‌ర్యాంక్ రావడమే కాదు, ఎంసెట్ ఎగ్జామ్‌లో టాప్ టెన్ ర్యాంకుల్లో ఒకటిగా వచ్చింది. అప్పట్లో ఆమె ఫొటోలు అన్ని పత్రికల్లోనూ ప్రచురించబడ్డాయి. టాప్ టెన్‌లో ర్యాంకు కొట్టిన ఆమెకు మెడికల్ సీటు పిలిచి మరీ ఇచ్చారు.

అలాగే తనేమో ఏడింటికి నిద్ర లేస్తుంది. మౌనిక వేకువజామునే నాలుగింటికే నిద్ర లేస్తుంది. ఓ గంటా గంటన్నర చదువుకున్నాక 'మెడికో' అన్న సుపీరియారిటీ చూపించకుండానే ఇంటి పనులన్నీ చేస్తుంది. తను నిద్ర లేచేసరికి ఆమె మళ్లీ పుస్తకం ముందు కూర్చుని కనిపిస్తుంది. తనలాంటి బద్ధకిస్టుకి పూర్తి వ్యతిరేకంగా కనిపించే మౌనికను చూస్తే కంపరంగా ఉండకుండా ఇష్టం ఎలా కలుగుతుంది?

అందులోనూ మౌనిక సింప్లిసిటీ, ఆ వయసులోనే ఏర్పరుచుకున్న వ్యక్తిత్వం, మాటలలో కదలాడే కమాండింగ్... ఎందుకనో ఆమె ముందు నిలబడితే తను అల్పురాలేమో అన్న ఫీలింగ్ కలగ చేస్తుంది. ఆ ఫీలింగ్ తో తను మారాలని అనుకోవడం లేదు. అసలు పెళ్లయ్యాక ఆడదానికి జీవితం లేదు కాబట్టి తను అల్పురాలే. అందువల్లే తనకన్నా ఎంతో ఉన్నత స్థితిలో కనిపించే మౌనికను చూస్తే తనకు జెలసీ, అనీజీనెస్.

వైదేహి వంట గదిలోకి వెళ్లి ఫ్లాస్క్‌లోని

కాఫీ రెండు కప్పులలో పోసింది. ఒక కప్ లోని కాఫీ తను సిప్ చేస్తూ, మరో కప్ పట్టుకుని బెడ్‌రూమ్‌లో కెళ్లింది.

కృష్ణమోహన్ ఇంకా నిద్ర మత్తులోనే ఉన్నాడు. అతడిని నిద్ర లేపకపోతే పదింటి వరకైనా అలాగే పడుకుండిపోగలడు.

"ఏమండీ! ఏమండీ...!" ఆమె అతడిని తట్టి లేపింది.

"ఊ..." అతడు బద్ధకంగా మూలిగి, మరోవైపుకి తిరిగి పడుకున్నాడేగానీ, కనీసం కళ్లయినా తెరవలేదు.

"లేవమంటుంటే... టైమ్ ఏడయింది. కాఫీ చల్లారిపోతోంది"

"అబ్బా! ఏడే కదా అయింది... ఎనిమిది కాలేదు కదా..."

"ఎనిమిదింటికి లేస్తే మీరు తయారయ్యేది, ఆఫీసుకి వెళ్లేదీ ఎప్పటికీ? పదకొండింటికా?"

"అబ్బా! ఈ ఆఫీసు అన్న పదం ఎవడు మొదలెట్టాడో గానీ.. కోట్లాది జనాలనీ హాయిగా నిద్రపోనివ్వకుండా చేసేశాడు... సర్లే! లేవక తప్పుతుందా?"

ఇక తప్పదన్నట్టు అతడు అయిష్టంగానే లేచి బెడ్ మీదనే కూర్చున్నాడు. ఆమె అతడి చేతికి కాఫీ కప్పు అందించింది.

రెండు గుటకలు కాఫీ సిప్ చేశాక, అప్పటికి నిద్ర మత్తు వదిలిపోవడంతో కృష్ణమోహన్ తల విదిలించి "కాఫీ టేస్ట్ అదిరిపోయింది. ఎవరూ? మౌని చేసిందా?" అని అడిగాడు.

"అవును" నిర్లిప్తంగా చెప్పింది వైదేహి.

తను కాఫీ చేసినపుడు ఎప్పుడూ అతడు తనను మెచ్చుకోలేదు. ఆ విషయంలో తను అతడి మీద కోప్పడేదే గానీ నిజానికి తను చేసిన కాఫీ తన నోటికే సయించకపోవడంతో మరేం మాట్లాడలేక మౌనంగా ఉండిపోవడం మొదలెట్టింది.

కృష్ణమోహన్ కాఫీకప్పు చేతిలో పట్టుకునే బెడ్ దిగి హాల్లోకి నడిచాడు. సోఫాలో కూర్చుని చదువుకుంటున్న చెల్లెల్ని చూసి "గుడ్‌మార్నింగ్ మౌనీ" అంటూ విష్ చేశాడు.

"గుడ్ మార్నింగ్" ఆమె అతడికేసి చూసి చెప్పింది.

కృష్ణమోహన్ ఆమె దగ్గరగా వెళ్లి సోఫాలో పక్కనే కూర్చున్నాడు. "ఏమ్మా చదువుకుంటున్నావా?" అని అడిగాడు.

"అడగడానికి మరే ప్రశ్నా తోచలేదా అన్నయ్యా?"

"అదేంటి?"

"లేకపోతే, సినిమాహాల్లో ఇంటర్వెల్లో కనిపించినవాడిని 'సినిమాకొచ్చావా?' అని గుడిలో కనిపిస్తే 'గుడికొచ్చావా?' అని అడిగినట్టుంది. చదువుకోవడం చూస్తూ కూడా 'చదువుకుంటున్నావా' అంటూ ఇదేం ప్రశ్నా?"

కృష్ణమోహన్ హాయిగా నవ్వాడు. "నిజమేరా" అన్నాడు. అతడికి తన చెల్లెలంటే చాలా ప్రేమ. రోజూ తన చెల్లెల్ని చూసి, ఆమెతో రెండుమాటలు మాట్లాడితే, పల్లెలోని తన అమ్మానాన్నలను చూసి వాళ్ళతో మాట్లాడినట్టుంటుంది అతడికి.

"ఓకే... ఓకే... కూసే సింహం వచ్చి మేసే సింహాన్ని చెడగొట్టినట్టు"

"ఆగాగు... కూసే సింహం కాదన్నయ్యా. కూసే గాడిద"

"ఆ విషయం నాకూ తెలుసులేమ్మా? మనల్ని మనం పోల్చుకునేటప్పుడు మరీ గాడిదలతో పోల్చుకోవడం ఎందుకు? సింహాలతో పోల్చుకుంటే కాస్త ప్రిస్టేజియస్‌గా ఉంటుందని..."

"సరే చెప్పు"

"అదే... కూసే సింహం వచ్చి మేసే సింహాన్ని చెడగొట్టినట్టు, చదువుకుంటున్న నిన్ను పనిపాటాలేని నేను చెడగొట్టడం ఎందుకు? నేనూ వెళ్ళి నా పనులు చూసుకుంటాను"

"దట్స్ గుడ్" నవ్వింది మౌనిక.

కృష్ణమోహన్ అక్కడ్నుంచి లేచి వెళ్ళిపోయాడు.

మౌనిక తిరిగి పుస్తకంలో తల దూర్చేసింది.

ఏ పని చేస్తుంటే ఆ పనిలో ఏకాగ్రత చూపడం మేధావుల లక్షణం అంటారు మానసిక శాస్త్రజ్ఞులు. యోగులూ ఎంతో సాధనతో ఏకాగ్రత సాధిస్తారంటారు పండితులు.

ఏకాగ్రత సాధనతో వస్తుందో, మేధస్సుతో వికసిస్తుందో తెలియదుగానీ మౌనిక పుస్తకంలో తల దూర్చిందంటే ఆమెకు ఈ ప్రపంచంలో మరేదీ గుర్తుకురాదు. ఎవరైనా పిలిస్తే తప్ప చివరికి పరిసరాలూ పట్టించుకోదు.

మెడికల్ ఎంట్రన్స్‌లో స్టేట్ లెవెల్‌లో పదో ర్యాంక్ రావడం ఆ ఏకాగ్రత వల్లే సాధ్యపడిందని ఆమె తల్లిదండ్రులు ఆనందంతో అందరికీ చెబుతుంటారు.

★ ★ ★

మెడికల్ కాలేజీ క్యాంపస్!

సల్వార్ కమీజ్, జీన్ ఫ్యాంట్, టీషర్ట్, మిడ్డీస్... అరుదు అరుదుగా చీరా జాకెట్లతో వయసు తెచ్చిన అందంతో ఆకర్షణీయంగా కనిపిస్తున్న అమ్మాయిలు గేటు దాటి లోపలికి వస్తున్నారు. అమ్మాయిలను ఆకట్టుకోవాలనే తాపత్రయమో లేక ఉన్నంతలో అందంగా కనిపించడంకోసం ప్రయత్నించడం నాగరిక సమాజంలో ఒక భాగం అన్న కారణంగానో తెలియదుగానీ, వాళ్ళకు ముందూ వెనుకా స్మార్ట్‌గా లేకున్నా ఉన్నంతలో నీట్‌గా తయారై హుషారుగా నడిచి వస్తున్నారు అబ్బాయిలు. అప్పుడప్పుడు కొందరు మాత్రం జంటగా మాట్లాడుకుంటూ తుళ్ళుతూ, నవ్వుతూ కలిసిపోయి ముందుకు అడుగులేస్తున్నారు.

వాళ్ళందరికీ జీవితంపట్ల అవగాహన ఉందో, లేదోగానీ, వాళ్ళెవరికీ భవిష్యత్ గురించి భయంలేదు. ఈ దేశంలో ఏ విద్యార్థయినా మెడికల్ కాలేజీలో సీటు సంపాదించుకుంటే చాలు. ఆ తర్వాత డాక్టర్ డిగ్రీ పుచ్చుకుని బయటపడితే, వేల రూపాయల జీతంతో ఉద్యోగం వస్తుంది, లేదా సొంతంగా ప్రాక్టీస్ పెట్టుకుంటే లక్షలు సంపాదించవచ్చు. ఆ నిజం వాళ్ళకు తెలుసు. అందువల్లే అన్ని కాలేజీల్లో విద్యార్థులకుండే భవిష్యత్ పట్ల భయం మెడికోలకు, కొంతవరకూ ఇంజనీరింగ్ స్టూడెంట్స్‌కి ఉండదు. పరీక్షగా చూస్తే, మెడికోల కళ్ళలో ఆ ధీమా కదలాడుతుంటుంది.

అలాంటి మెడికల్ కాలేజీ క్యాంపస్ గేటు పక్కనే అందమైన యువకుడు నిలబడి ఉన్నాడు. అతడు ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్టు, అతడి కళ్ళు లోపలికి వస్తున్న వాళ్ళందరినీ ఒక్క చూపులోనే పరిశీలిస్తున్నాయి.

కొందరు అతడిని చూసి విష్ చేస్తున్నారు. పలకరింపుగా నవ్వుతున్నారు. అతడు వాళ్ళను విష్‌చేసి తిరిగి ఎదురుచూపుల కార్యక్రమంలో మునిగిపోతున్నాడు.

ఎదురుచూపులు బాధాకరమా లేక ఆనందకరమా అంటే ఇష్టమైన వ్యక్తికోసం ఎదురుచూపులు ఆనందకరమయితే, తప్పనిసరిగా కలవాల్సిన వ్యక్తికోసం ఎదురుచూడడం అది స్వల్పకాలమయినా బాధాకరమే.

బహుశా అతడు తనకిష్టమయిన వ్యక్తికోసం ఎదురుచూస్తున్నట్టుంది. అందువల్లే అతడి ముఖంలో ఆనందం కనిపిస్తోంది.

"హాయ్ రమ్మీ"

ఎదురుచూస్తున్న వ్యక్తి తల తిప్పి చూశాడు.

"ఏంట్రా ఇక్కడ నిలబడ్డావ్?" నిఖిలేష్ నవ్వాడు.

"అది... అది..."

"నువ్వేం చెప్పక్కరలేదులే... మౌనిక కోసం! అంతేకదా?"

"తెలుసుకదా, మళ్ళీ ఎందుకు ప్రశ్నించడం?"

"అబ్బా! ఏదో అలవాటులో పొరపాటులేరా..." అని ఆగి, "ఎందుకురా ఆ అమ్మాయికోసం అంతగా ఆరాటపడిపోతావ్" ప్రశ్నించాడు నిఖిలేష్.

"నువ్ నోర్మూసుకో" కసురుకున్నాడు రమేష్.

ఆ విదిలింపుకి నిఖిలేష్ బాధపడలేదు. అదోలా భుజాలెగరేసి నవ్వేశాడు. "నువ్వు ఆ అమ్మాయిని ప్రేమిస్తున్నావని అర్థమయిపోతూనే ఉంది. మరి ఆ విషయమేదో తనకు డైరెక్ట్‌గా చెప్పేయొచ్చుకదా? "

అతడు మరోసారి కసురుకున్నాడు "నోర్ముయ్యమన్నానా"

"అలా అయితే ఓకే... నోర్మూసుకుంటాను. కానీ నోర్మూసుకుని నీ పక్కన కూర్చోవడం నాకు చేతకాదు. సో... నేను క్యాంటీన్‌కి వెళ్ళిపోతాను"

నిఖిలేష్ వెనుదిరగబోతుంటే, యధాలాపంగా అటు చూసిన అతడికి కనిపించింది ఆమె.

నిండుగా చీర కట్టుకుని, పుస్తకాలు గుండెలకు తాకించుకుని, గేటుదాటి క్యాంపస్‌లో అడుగుపెట్టింది మౌనిక.

కదలబోతున్న నిఖిలేష్ కొద్దిక్షణాలు అలాగే నిలబడిపోయాడు.

వయసులో ఉన్న ప్రతి ఆడపిల్లా ఎంతో కొంత ఆకర్షణీయంగానే ఉంటుంది. అలంకరించుకుంటే మరింత అందంగా కూడా కనిపించొచ్చు. అయితే ఎక్కడో కోటికొక్క అమ్మాయిని చూసినపుడు వారిలోని అందమో లేక ఆకర్షణోకాదు... మరేదో తెలియని ఓ భావం మనల్ని పట్టి కుదుపుతుంది. ఆ భావం పవిత్రమైనదే అయి ఉంటుంది. పవిత్రమైన ఆ భావం మనసును స్పందింపచేస్తుంది. ఏదో తెలియని ఆత్మీయత ఆ అమ్మాయిమీద కలుగుతుంది.

'మౌనికను చూస్తే ఆమెది అద్భుతమైన అందం కాదు. వయసు ఆకర్షణ కూడా కాదు. ఆత్మీయతా భావమే ఎవ్వరికైనా మనసులో కలుగుతుంది. బ్రహ్మచారి కుర్రాడయితే ఇలాంటి అమ్మాయి తనకు ఇల్లాలిగా వస్తే తనంత అదృష్టవంతుడు మరొకడు ఉండడనే అనుకుంటాడు' మనసులోనే అనుకున్నాడు నిఖిలేష్.

అలాంటి అమ్మాయిని ప్రేమించాలని అనిపించడమూ చాలా సహజమైన విషయమే. అందుకే తన మిత్రుడు రమేష్ మౌనికను ప్రేమిస్తున్నాడని తెలిసిన వెంటనే అతడు ఆశ్చర్యపడలేదు. అయితే రమేష్ తన ప్రేమను మౌనిక ముందు వ్యక్తం చేయలేకపోతున్నాడనేదే అతడి బాధ.

అతడు ఆలోచనలనుండి తేరుకునేసరికి మౌనిక వాళ్ళిద్దర్నీ దాటుకుని ముందుకెళ్ళిపోయింది. కనీసం తల తిప్పి వాళ్ళకేసి కూడా చూడలేదు.

ఆమె కొద్దిదూరం వెళ్ళిపోయాక నిఖిలేష్ నిట్టూరుస్తూ పలికాడు. "ఏరా! మౌనిక వచ్చింది, క్లాస్‌వైపు వెళ్ళిపోయింది. ఇక నువ్వు ఇప్పుడైనా క్యాంటీన్‌కి వస్తావా రావా? "

ఓ అద్భుత ప్రపంచంలో విహరిస్తుండిన రమేష్, అప్పుడే అయిష్టంగానే ఈ లోకంలోకి వచ్చినట్టు తల విదిలించాడు. "ఏంట్రా నువ్వనేది? " అన్నాడు.

నిఖిలేష్ ఏడుపులాంటి నవ్వొకటి నవ్వాడు. "అంటే మౌనిక కనిపించినప్పటి నుండి నేనేం మాట్లాడానో నీకు వినిపించలేదన్నమాట"

"ఏదో ధ్యాసలో ఉండి వినిపించుకోలేదు"

"ఏదో ధ్యాస కాదు, మౌనిక ధ్యాసలో ఉండి సర్వేంద్రియాలూ పనిచేయకుండా అయిపోయాయని చెప్పు"

రమేష్ కొద్దిగా సిగ్గుపడ్డట్టు, "పోనీలే ఏదో ఒకటి. ఇంతకీ ఇప్పుడు నువ్వనేదేమిటి? " అంటూ ప్రశ్నించాడు.

"క్యాంటీన్‌కి వెళ్దామనుకుంటున్నాను. తమరు వస్తారా అని అడుగుతున్నాను.

చెప్పండి మహాశయా"

"అబ్బా..." అని నెత్తికొట్టుకుని, "పదరా" అన్నాడు రమేష్.

ఇద్దరూ క్యాంటీన్‌వైపు నడిచారు.

క్యాంటీన్‌లో కార్నర్ సీట్స్‌లో ఎదురెదురుగా కూర్చున్నాక నిఖిలేష్‌కి మౌనిక విషయం గురించి మరోసారి ప్రస్తావించాల నిపించింది.

"రమేష్! నేను నిన్ను ఎన్నోసార్లు అడిగాను, ఎప్పుడు అడిగినా ఏదో చెప్పి తప్పించుకుంటావ్ గానీ ముక్కుసూటిగా సమాధానం చెప్పవు... పోనీ ఈ రోజయినా నువ్వు నాకు సమాధానం చెపుతావా?"

"ఏ విషయంలో? ..."

"మౌనిక విషయంలో"

రమేష్ కాస్త తడబడ్డాడు. అయినప్పటికీ ఆ క్షణం అతడి కళ్లల్లో మెరుపు కదలాడడం నిఖిలేష్ గమనించాడు. "మౌనిక.... మౌనిక విషయంలో నేనేం చెప్పగలను?"

నిఖిలేష్ టేబిల్ మీద కాస్త ముందుకు వంగాడు. "రేయ్! నిజం చెప్పు. నువ్వు... నువ్వు నిజంగానే మౌనికని ప్రేమిస్తున్నావా?"

రమేష్ ముఖం ఒక్కసారిగా వివర్ణమయింది. ఆ మామూలు ప్రశ్నకే, కేవలం అతడి ప్రేమని అనుమానించినందుకే అతడి గుండెల్లో బాధ పొంగి పొరలిందని ముఖంలో మారిన రంగులు చూస్తేనే అర్థమయిపోతుంది. 'వీడు నిజంగా సెంటిమెంటల్ ఫూల్. లేకపోతే... కేవలం ప్రేమిస్తున్నావా, లేదా అని అనుమానంగా అడిగితేనే ఇంతగా బాధపడిపోవడం... అంతేకాదు, వీడు మౌనిక ప్రేమలో పీకలోతు వరకూ మునిగిపోయినట్టున్నాడు... ప్చ్! లాభం లేదు. వీడికోసం తనే ఏదయినా చేయాలి' అనుకున్నాడు నిఖిలేష్.

"ఆల్ రైట్! ముఖంలో మరీ అంత రంగులు మార్చక్కర్లేదు. నువ్వు మౌనికని గాఢంగా ప్రేమిస్తున్నావని అర్థమయింది. కానీ నాకర్థం కానిదల్లా.... నీ వన్ వే ప్రేమని టూ వే ప్రేమగా మార్చడం ఎలా అన్నదే"

అసలే మితభాషి అయిన రమేష్ ముఖంలో ఈ సారి ప్రశ్నార్థకం ఉదయించింది. మాటమాత్రం పెగల్లేదు.

"అదేరా! మీ ఇద్దర్నీ కలపడం ఎలాగా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు నిఖిలేష్.

"ఏంటీ? నువ్వు మా ఇద్దర్నీ కలుపుతావా?"

"కలుపుతావా? అని మరీ అంత ఆశ్చర్యపోతావేంట్రా బాబూ! కలపడమంటే మీ ఇద్దర్నీ ఒక గదిలో ఉంచి, ఒకరి కౌగిలిలో మరొకర్ని ఉంచి తాడుతో కట్టేయడం కాదు కదా! అలాంటిపని చేయడం అంటే చాలా కష్టం. కానీ నేను కలుపుతానన్నది అలా కాదు. జస్ట్ ఆ అమ్మాయిని నువ్వు ప్రేమిస్తున్నావ్. కానీ నువ్వొట్టి పిరికివాడివి. నీ మనసు ఆమెకు విప్పి చెప్పలేకున్నావ్. నిజానికి నువ్వు ఆమె ఎదురుగా వెళ్లి 'మౌనికా! నేను నిన్ను ప్రేమిస్తున్నాను' అంటే ఆమె కాదనకపోవచ్చు అనే నా ఉద్దేశ్యం. ఎందుకంటే, మనమంతా ఒకే కాలేజీలో ఉన్నాం. అందులోనూ నువ్వు మెరిట్ స్టూడెంట్‌వి. నీ ప్రవర్తన ఏ ఆడపిల్లయినా ఇంప్రెస్ అయ్యేలా ఉంటుందే తప్ప అసహ్యించుకునేలా ఉండదు.... ఇన్ని ప్లస్‌పాయింట్స్ ఉండీ నువ్వు ఆమె ముందు నీ ప్రేమని విప్పిచెప్పలేకపోతున్నావు... సో...! నీ ప్రేమని గురించి ఆమెకు తెలియచేసే బాధ్యత నేను తీసుకుంటున్నాను. దట్సాల్..!"

రమేష్ కృతజ్ఞతగా మిత్రుడికేసి చూశాడు. కానీ అంతలోనే మరేదో అనుమానం...

"నా విషయం ఆమెకు ఎలా చెప్పగలవ్? ఏమని చెప్పగలవ్?"

"ఈ రోజుకి నన్ను వదిలెయ్‌రా. ఎలా ప్రొసీడ్ అవ్వాలో కాస్త ఆలోచించుకుం

టాను. ఎట్టి పరిస్థితుల్లోనూ రేపు నీ ప్రేమ గురించి మౌనికకు తెలియచేసే బాధ్యత నాది. సరేనా? "

'తన ప్రేమ గురించి తను కాకుండా మిత్రుడి ద్వారా ఆమెకు తెలియచేయడంలో ఆమె అపార్థం చేసుకుంటుందేమో' అని అతడు ఆలోచించాడు. కానీ తనకు నిఖిలేష్ మీద నమ్మకం ఉంది. నిఖిలేష్ మాటతీరు ఎట్టి పరిస్థితుల్లోనూ అపార్థానికి దారితీ యదు. వాడు అంత కన్విన్సింగ్‌గా మాట్లా డతాడు. అంతేకాదు, ఎంత కాలమయినా తను తన ప్రేమను ఆమెకు విప్పి చెప్పలేక పోవచ్చు. అలాంటప్పుడు కనీసం మిత్రుడి ద్వారానయినా ప్రేమ సందేశం పంపితే, ఫలితం ఏమిటో తెలిసిపోతుందికదా? అందుకే రమేష్ కొంత రిలీఫ్‌గా ఫీల య్యాడు.

"కమాన్ గెటప్" నిఖిలేష్ పైకి లేచాడు.

మిత్రులిద్దరూ క్యాంటీన్ వదిలి క్లాస్‌రూ మ్‌వైపు నడిచారు.



కిటికీ అవతల మనీ ప్లాంట్ గాలికి నెమ్మదిగా కదులుతోంది.

చీకటిని పారద్రోలే ప్రయత్నంలో చంద్రుడు కొంతవరకూ ఫలితం సాధించగ లిగాడు. మల్లెపూలను నేలకు విసురుతు న్నట్టు వెన్నెల కురిపిస్తున్నాడు.

కిటికీ పక్కనే టేబుల్ ముందు కూర్చుని ఉన్న నిఖిలేష్ చూపులు టేబుల్‌మీద తెరచి ఉన్న పుస్తకాన్ని చూడడంలేదు. అతడి చూపులు కిటికీ బయటకు సాగి విశాల ప్రపంచాన్ని చూస్తున్నాయి.

దూరంగా కనిపించే బిజీసెంటర్‌లో రంగురంగుల లైట్స్ ఆకాశం కేన్వాస్‌మీద నక్షత్రాల్లా మెరుస్తున్నాయి. కదిలిపోతున్న వాహనాలతోటే, కదిలే హెడ్‌లైట్స్ కాంతి... వేలకొలది తోకచుక్కలు నేలకు జారాక గాలి వాటుకు కొట్టుకుపోతున్నట్టుగా భ్రమింపచే స్తున్నాయి.

ఆ దృశ్యం చూస్తుంటే, రమేష్ చాలా రోజులక్రితం సిటీలైఫ్ మీద గీసిన చిత్రం గుర్తుకొచ్చింది అతడికి. 'ఎత్తయిన మల్టీస్టో రీడ్ బిల్డింగ్స్ కొట్టొచ్చినట్టు కనిపిస్తుం టాయి. ఆ బిల్డింగ్స్ పునాదుల్లో ఒక బక్క ప్రాణి కనిపించీ, కనిపించకుండా నలిగిపో తుంటాడు. పరిశీలనగా చూస్తే తప్ప ఆ చిత్రంలో ఆ బక్క ప్రాణి ఉనికి మనకు కని పించదు'.

హఠాత్తుగా వచ్చిన రమేష్ తాలూకూ ఆలోచన నిఖిలేష్‌కి మరికాస్త అనీజీనెస్ తెచ్చిపెట్టింది. మర్నాడు ఎలాగయినా రమేష్ గురించి మౌనికకు చెప్పాలి. ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి?

అసలు తను ఆ బాధ్యత తీసుకోకపోయి ఉండేవాడేగానీ, రమేష్ అంటే తనకెంతో ఇష్టం. మారుమూల పల్లెనుండి సిటీకి వచ్చాక, మెడికల్ కాలేజీలో పరిచయమ యిన మొదటి మిత్రుడు అతడే! ఇప్పటికీ అతడు తప్ప మరో మంచి మిత్రుడెవ్వరూ లేరు తనకు. ఆదివారం వస్తే చాలు రమేష్ తనను వాళ్ళింటికి తీసుకెళ్తాడు. విశాలమైన ఆవరణలో ఉండే లంకంత కొంప వాళ్ళది. మేడమీద ఉండే రమేష్ బెడ్‌రూమ్‌లోనే ఓ మధ్యతరగతి కుటుంబం హాయిగా కాపురం

చేయొచ్చు అనిపిస్తుంటుంది తనకు. అంత విశాలంగా ఉంటుంది ఆ బెడ్‌రూమ్. మంచి చిత్రకారుడైన రమేష్ బొమ్మలు గీస్తూ రిలాక్సయ్యేందుకు మరో రూమ్ ఉప యోగిస్తాడు. ఆ రూమ్‌లో ఉండే ఫర్నిచర్ ఖరీదు రెండు లక్షల రూపాయలకు మించే ఉంటుంది. ఎప్పుడో వెళ్ళి ఓ గంటా, రెండు గంటలు గడిపే ఆ రూమే అంత రిచ్‌గా ఉంటుందంటే, ఇక ఆ ఇంట్లోని ఖరీదైన మిగతా విషయాల గురించి ప్రత్యేకించి చెప్పాల్సిందేముంటుంది?

రమేష్ డాడీ పురుషోత్తమరావు పెద్ద ఇండస్ట్రియలిస్ట్. ఆ ఇంటిముందు నాలుగు కార్లు నిలిచి ఉంటాయెప్పుడూ. పురుషోత్త మరావు ఈ రోజు హైద్రాబాద్‌లో ఉంటే మర్నాడు ఢిల్లీలో, ఆ మర్నాడు బెంగుళూ రులో ఉంటుంటాడు. ఆయన ఎక్కడ ఉన్నా, ఏం చేస్తున్నా ప్రతిరోజూ రాత్రి కనీసం ఓ పావుగంటయినా, ఫోన్‌లోనైనా సరే కొడుకుతో మాట్లాడతాడు.

తల్లిలేని పిల్లవాడని ఆయన మొదటి నుండి రమేష్‌ని గారాబంగా పెంచాడట.

అంత గారాబంగా పెంచిన ఆ బిడ్డ ఇప్పుడు ఓ అమ్మాయిని ప్రేమిస్తున్నాడు. ఈ విషయం ఆ తండ్రికి తెలిస్తే... నో డౌట్! మరేం మాట్లాడకుండా ఆ అమ్మా యిని తన ఇంటికోడలిగా చేసుకుంటాడు. సో! ఆ వైపు నో ప్రాబ్లమ్.

మరి ప్రాబ్లమ్ ఏముంది అంటే... మౌనిక మనసులో ఏముంది అన్నదే! రమే ష్‌లాంటి వ్యక్తి ప్రేమను ఏ ఆడపిల్లయినా ఎలా తిరస్కరించగలదు? కాకపోతే, అతడి ప్రేమ విషయం ఆమెకు తెలియాలి. అంతే.

నిఖిలేష్ దీర్ఘంగా నిట్టూర్చాడు. 'ఇప్పుడు ఆ బాధ్యత తనమీద ఉంది. ఏదేమయినా రేపు మౌనికను కలుసుకుని మాట్లాడాలి' మనసులోనే అనుకున్నాడు అతడు.

★ ★ ★

కాలేజీకి బయల్దేరే ముందు మౌనిక, కృష్ణ మోహన్‌తో చెప్పింది "అన్నయ్యా! ఈరోజు కోఠీకెళ్ళి కొన్ని బుక్స్ కొనుక్కోవాలి"

"డబ్బులేమయినా కావాలామ్మా? " వెంటనే అడిగాడు అతడు.

"వద్దు నాన్న వచ్చినప్పుడు ఇచ్చిన అమౌంట్‌లో ఇంకా కొంత బేలన్స్ ఉంది. మనీ కోసం కాదు"

"మరేంటి? "

"నీకు బ్యాంక్ అయిపోయాక మా కాలేజీ వైపు రాకూడదలా? ఇద్దరం అలా వెళ్ళి నాలుగు షాపులూ వెతికి బుక్స్ తెచ్చేసు కుందాం. కోఠీకి ఒంటరిగా వెళ్ళాలంటే ఏదోలా ఉంది. అందులోనూ బస్సుల రద్దీ"

"మా బ్యాంక్ వదిలేవరకూ నీకు కాలేజీ..."

"ఈరోజు ఆటాప్సీ ప్రాక్టికల్ క్లాసెస్ జరు గుతాయి. సో! సాయంత్రం వరకూ క్లాసెస్ ఉన్నాయి. ఒకవేళ నాకుముందే క్లాసెస్ అయిపోయినా ఐదింటివరకూ లైబ్రరీలో ఉంటాను. ఆ తర్వాత బయటకొచ్చేస్తాను"

"అలా అయితే ఓకే" తలాడించాడు కృష్ణ మోహన్.

మౌనిక ఇంట్లోనుండి బయటకు నడి చింది.

సెంటర్‌కి చేరుకుంటే, దగ్గర్లోనే ఉంది బస్టాప్. ఆమె బస్టాప్‌లో నిలబడింది. బస్సు వచ్చేందుకు ఇంకా ఐదు నిముషాల టైముంది.

తమ ఇంటికి దగ్గర్లో, తనకు కాలేజీ స్నేహితులెవ్వరూ లేరు. అందుకే కాలేజీకి వెళ్ళడంగానీ, రావడంగానీ ఇంచుమించు ఒంటరిగానే! పోనీ తనకు కాలేజీలోనైనా ఎవరయినా స్నేహితులున్నారా అంటే లేరనే చెప్పాలి. ఎందుకనో తెలియదుగానీ. తనది కలుపుగోలు వ్యక్తిత్వం కాదు. తన లోకంలో తను బతుకుతుంది. ఎదుటి వాళ్ళ గురించి పట్టించుకోదు. ఎవరయినా పలకరించినా ముభావంగా నవ్వి కట్ చేస్తుందే తప్ప మాటలు పెంచుకోలేదు.

ముభావంగా ఉండడం అలవాటో లేక అది తన బలహీనతో తనకే అర్థంకాదు. అది అలవాటయినా, బలహీనతయినా అలా ఉండడమే తనకిష్టం.

ఆ ఇష్టంతోపాటు తనకో లక్ష్యమూ ఉంది. ఆ లక్ష్యం ఏమిటంటే... తను డాక్టర్ కావాలి. డాక్టర్ పట్టా పుచ్చుకుని తన స్వగ్రామం వెళ్ళాలి. అక్కడ స్వంత ఇంట్లోనే ప్రాక్టీస్‌పెట్టి, తన పల్లెలోని పేద ప్రజలకు వైద్యసౌకర్యం అందివ్వాలి. ఇది తన లక్ష్యం, తన తండ్రి కోరిక కూడా అదే!

చాలా దగ్గిరగా కారు హారన్ వినిపించ డంతో ఆమె ఆలోచనలు కట్ అయ్యాయి. ఆమె తలతిప్పి అటు చూసింది.

మార్కెట్‌లోకి కొత్తగా రిలీజయిన సరి కొత్త మోడల్ కారు డ్రైవింగ్ సీట్లో రమేష్ కూర్చుని ఉన్నాడు. అతడు తనను చూసి పలకరింపుగా నవ్వాడు "హలో"

"హలో" అనక తప్పలేదామెకు.

"మీరు...మీరు కాలేజీకే కదూ? నేనూ కాలేజీకే... రండి"

అతడి ఆహ్వానం ఆమెకు ఇబ్బందిగా అని పించింది. అయినా అతడు నొచ్చుకునే విధంగా కాకుండా "ఫర్వాలేదండి. బస్సు వచ్చేస్తుంది" చెప్పింది ఆమె.

"నాకేం ప్రాబ్లమ్ లేదు రండి"

'మీకేం ప్రాబ్లమ్‌లేదు. మనిద్దరం కలిసి కారులో కాలేజీకి వెళ్తే చూసేవాళ్ళ చూపులు నాకే ఇబ్బందిగా ఉంటాయి' ఆ మాటలు పైకే అనాలనుకుందిగానీ అనలేకపోయింది.

"నో! సారీ..." ఈ సారి కాస్త గట్టిగానే సమాధానం చెప్పింది.

ఆమె అంత నిర్ద్వంద్వంగా తిరస్కరించ డంతో అతడు తడబడ్డాడు. "ఆల్‌రైట్" అంటూ కారును ముందుకు పోనిచ్చాడు.

ఎప్పుడూ తనను పలకరించేందుకు కూడా ప్రయత్నించని రమేష్ ఏకంగా కారులోకి ఇన్వయిట్ చేయడం ఎందుకనో ఇబ్బంది గానే అనిపించింది మౌనికకు.

'రమేష్... రమేష్ ఈరోజు ఎందుకిలా ప్రవర్తించాడు?'

ఆమె ఆ ఆలోచనల్లో ఉండగానే బస్సు వచ్చేసింది. రమేష్ గురించి ఆలోచించడం మాని, ఆమె బస్సు ఎక్కేసింది.

★ ★ ★

రమేష్ పరధ్యాసగా ఉండడం గమనిం చాడు నిఖిలేష్. అతడు లెసన్ వింటున్నట్టు లేదు. అసలతడి చూపులు క్లాస్‌లో ఉన్న లెక్చరర్‌మీద లేవు. అతడు అప్పుడప్పుడు అరచేతులకేసి చూసుకుంటున్నాడు. అంత లోనే తలతిప్పి ఓరగా మౌనికకేసి చూస్తు న్నాడు.

తను కరెక్ట్ టైమ్‌కి క్లాసుకి రావడంవల్ల రమేష్‌ని ముందుగా పరిశీలించే అవకాశం లేకపోయింది. ఇప్పుడు పరధ్యాస అర్థమై అతడు ఎందుకో ఇబ్బందిపడుతున్నాడని తెలిసినా 'ఎందుకలా ఉన్నావ్?' అని అడ గడానికి అది క్లాస్‌రూమ్ అయింది. ఆ చోట నిశ్శబ్దంగా ఉండవలసివస్తోంది.

మరో పావుగంటకు క్లాస్ అయిపోగానే, ఇద్దరూ బయటకు నడుస్తున్నప్పుడు, క్లాసు రూమ్ దాటగానే నిఖిలేష్ అతడి చెయ్యి పట్టుకున్నాడు.

రమేష్ తలతిప్పి నిఖిలేష్ ముఖంలోకి చూశాడు.

తమ వెంట... బయటకు వచ్చిన క్లాస్ మేట్ తమను దాటుకుని వెళ్ళాకే నిఖిలేష్ అడిగాడు. "రేయ్ రమ్మీ! ఏమిట్రా... ఏమిట్రా అలా ఉన్నావ్?"

"ఎలా ఉన్నాను?"

"ఏదో పెద్ద తప్పు చేసిన వాడిలా ఇబ్బం దిపడిపోతూ, ఏదో ఆలోచనతో అయోమయ స్థితిలో పడిపోయినట్టు చాలా దిగు లుగా కనిపిస్తున్నావు"

రమేష్ దీర్ఘంగా నిశ్వసించాక "అవున్రా!.. నేను ఒక తప్పుచేశాను... అఫ్ కోర్స్! అది పెద్ద తప్పేం కాకపోవచ్చుగాని, ఇష్టమయిన వాళ్ళను ఇబ్బందిపెట్టానన్న

బాధ భరించలేనిదిగా ఉంది" అన్నాడు.

"ఇష్టమైన వాళ్ళను ఇబ్బంది పెట్టడమేమిటి? విషయమేమిటో వివరంగా చెప్పు"

'అంకుల్ ఇంటినుండి వస్తుంటే, దారిలో బస్టాప్ దగ్గర మౌనిక నిలబడి ఉండడం, తను ఆమెను డ్రాప్ చేస్తాననడం... ఆమె గట్టిగా వద్దని చెప్పడం...' ఆ ఉదయం జరిగింది వివరించి చెప్పాడు రమేష్.

అంతా విన్నాక కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయాడు నిఖిలేష్. ఆ తర్వాత తలెత్తి మిత్రుడి ముఖంలోకి చూస్తూ "ఏదేమయినా నువ్వు తప్పు చేశావురా"

"అది కాదురా! నేను అంకుల్ ఇంటికెళ్ళి వస్తూ ఉంటే, ఆ దారిలోనే బస్టాప్‌లో మౌనిక కనిపిస్తుందని నాకేం తెలుసు? అయితే మౌనిక బస్సుకోసం ఎదురుచూస్తున్నట్టుంది. ఎంతో రద్దీగా ఉండే ఆ బస్సులో ఆమె ఎలా ప్రయాణించగలదు? కనీసం ఈ రోజు ఆమెను కారులో డ్రాప్ చేస్తే... ఆమె ఇష్టపడితే ప్రతిరోజూ ఆ బస్టాప్ నుంచి ఆమెను పికప్ చేసుకోవాలి అన్నది నా మనసులోని భావం. అందుకే ముందు వెనుకలు ఆలోచించకుండా ఆమెముందు కారాపాను. ఆమె 'వద్దంటున్నా' కారులోకి రమ్మని బలవంతపెట్టాను. మౌనిక ఆ పరిస్థితిపట్ల ఎంతగా రియాక్ట్ అయిందో?! నన్నో రోడ్‌సైడ్ రోమియో అనుకుని ఉంటుంది ఆమె. నిన్నటివరకూ నామీద ఉన్న మంచి అభిప్రాయం ఒక్కసారిగా గాలికి కొట్టుకుపోయి ఉంటుంది" బాధపడిపోసాగాడు రమేష్.

"ఆ మాటలు నిజమే" చెప్పాడు నిఖిలేష్.

దాంతో రమేష్ వెంటనే నిఖిలేష్ చేతులు పట్టుకున్నాడు. "రేయ్ నిఖిల్! నిజంగా నేను మౌనికను ఇబ్బందిపెట్టాలని అలా ప్రవర్తించలేదురా. కాని ఆమె నావల్ల ఇబ్బందిపడింది. అందుకే ఈరోజు నువ్వు ఆమెతో మాట్లాడేప్పుడు ఈ విషయం చెప్పు. నేను రోడ్‌సైడ్ రోమియోలా ఆడపిల్లలను టీజ్ చేసేవాడిని కానని ఆమె నమ్మితే నాకంతే చాలు"

"అలాగే చెపుతాను" అన్నాడు నిఖిలేష్. అతడు అప్పటికే మౌనికతో ఎలా మాట్లాడాలో పదిసార్లు రిహార్సల్ చేసుకున్నాడు.

క్లాసెస్ అన్నీ అయిపోయాక మౌనిక లైబ్రరీ లోపలకు వెళ్ళడం చూసి రమేష్ ముందుకుతోస్తే, నిఖిలేష్ కాస్త భయంగానే లోపలికి అడుగుపెట్టాడు.

లైబ్రరీలో 'నిశ్శబ్దంగా ఉండవలెను' అని రాసి ఉన్న బోర్డు గోడకు వేలాడుతోంది. స్టూడెంట్స్ పుస్తకాల ముందు కూర్చుని తపస్సు చేస్తున్న రుషుల్లా ఏకాగ్రతగా చదువుకుంటున్నారు.

నిఖిలేష్ కాస్త భయపడుతూనే మౌనిక దగ్గరగా వెళ్ళాడు. ఆమె కూర్చుని ఉన్న కుర్చీ పక్కనే నిలబడి కాస్త వంగి గొణిగినట్టుగా అన్నాడు. "మౌనికగారూ! నేను... నేను మీతో నాలుగు... మాటలు మాట్లాడాలి" అప్పటికే అతడు బాగా కంగారుపడిపోయాడు. దానికి తగినట్టుగానే ఆ గొణుగుడుకే డిస్టర్బ్ అయినట్టు కొందరు వారిద్దరికేసీ చూశారు.

"నాతో మాట్లాడాలా? " ఆమె ఆశ్చర్యంగా చూసింది అతడికేసి.

"అవునండి. ప్లీజ్" అతడు మరీ జాలిగా ముఖం పెట్టాడు.

ఆమె భుజాలెగరేసి లేచి నిలబడింది. నిఖిలేష్ తనకు క్లాస్‌మేట్ అయినప్పటికీ ఎప్పుడైనా పలకరింపుగా విష్ చేసుకోవడమే తప్ప ఇలా ప్రత్యేకించి మాట్లాడుకోవడం జరగలేదు. అయినా అతడు తనతో అంత పర్సనల్‌గా మాట్లాడవలసిన మేటర్ ఏముంటుందబ్బా?

ఆలోచనల మధ్య మౌనిక, టెన్షన్‌తో నిఖిలేష్-ఇద్దరూ లైబ్రరీ నుండి బయటకు నడిచారు.

మెట్లు దిగుతుండగా ఆమె అడిగింది "చెప్పండి! నాతో ఏం మాట్లాడాలి? "

ఆమె అంత సూటిగా అడిగేసరికి అతడు తడబడ్డాడు. దూరం నుండి రమేష్ వీళ్ళిద్ద రినే గమనిస్తూ ఉన్నాడు.

"అది... అది..." మాటలు పేర్చుకోవడం కోసమన్నట్టు అతడు కొద్దిసెకనులపాటు ఆగాడు.

ఆమె అతడి ముఖంలోకి పరిశీలనగా చూసింది. 'ఎందుకనో నిఖిలేష్ ప్రవర్తన ఈ రోజు మరీ కొత్తగా ఉంది' అనుకుంది. 'ఏదో చెప్పడానికి ఎందుకీ తడబాటు? మరెందుకీ కాలయాపన? ...' ఆ మాటే అతడిని అడగాలనుకుంది.

అయితే అంతలో అతడే పెదవి విప్పాడు. "మౌనికగారూ! ప్రేమమీద మీ అభిప్రాయం ఏమిటి? "

మౌనిక ఉలిక్కిపడింది. ముందుకు పడ బోతున్న ఆమె అడుగు ఆగి పోయింది. పై పంటితో కింది పెదవిని నొక్కిపెట్టింది.

ఆమె ఫీలింగ్స్ గమనించిన నిఖిలేష్‌కి భయంగా అనిపించినా, కర్తవ్యం కనులముందు నిలవడంతో ప్రొసీడ్ కావా లనే అనుకున్నాడు.





"అది కాదండీ! జస్ట్ మీ అభిప్రాయం చెప్పండి... అంతే చాలు..."

ఆమె చాలా సేపటి తర్వాత దీర్ఘంగా నిట్టూరుస్తూ "సదభిప్రాయమే" అంది.

అతడి ముఖంలో కాస్త రిలీఫ్ కదలాడడం ఆమె గమనించింది.

"ప్రేమమీద మీకు సదభిప్రాయం ఉన్నందుకు చాలా... చాలా... థాంక్సండీ"

అతడూ నిశ్వసించాడు. "నాకూ ప్రేమంటే సదభిప్రాయమేనండీ. ప్రేమ గురించి ఎందరో రచయితలు, కవులు ఎన్నెన్నో రచనలు చేశారు కదండీ. లైలా-మజ్నూ, రోమియో- జూలియట్, సలీం-అనార్కలి, దేవదాసు-పార్వతి... చరిత్రలోని ఎన్నెన్నో ప్రేమ కథలు మన మనసుల్ని కదిలిస్తాయి. అసలు నన్నడిగితే 'లవ్ ఈజ్ గ్రేట్' అంటానండీ. ప్రేమ భావన మనల్ని మరో లోకంలోకి తీసుకెళుతుంది. ఆ భావం అపురూపమైనది. ఆ అనుభూతి అనిర్వచనీయమైనది. ప్రతి మనిషి ఒక్కసారయినా ఆ అపురూపమైన అనుభూతిని అనుభవించి తీరాలి" తను అప్పటికే ఎక్కువ మాట్లాడానేమోనన్న అనుమానం వచ్చింది అతడికి. అందుకే తల తిప్పకుండానే ఓరగా ఆమెకేసి చూశాడు. ఆమె కన్ఫ్యూజింగ్‌గా తనకేసే చూస్తోంది సో! నో ప్రాబ్లమ్. అందుకే అతడు కంటిన్యూ చేశాడు.

"...అయితే ఈ ప్రేమలో వన్ సైడ్ లవ్ చాలా డేంజరండీ. ఒక అబ్బాయి ఒక అమ్మాయిని ప్రేమిస్తున్నాడనుకోండి. ఆ వ్యక్తి తన ప్రేమను మనసులోనే దాచుకుని, కృంగి, కృశించి, నశించి పోవడంకన్నా ఆమె ముందు తన ప్రేమను వ్యక్తంచేయడం మంచిదని నా అభిప్రాయం. అఫ్‌కోర్స్! ఆ తర్వాత ఆ అమ్మాయి వప్పుకుంటే ఆ ప్రేమ ఫలించిన ప్రేమ అవుతుంది. లేకపోతే విఫలప్రేమగా మారుతుంది. భగ్న ప్రేమికుడు ఎలా ప్రవర్తిస్తాడన్నది అప్రస్తుతం. వన్ సైడ్ లవ్ తప్పు అని మాత్రం అంటాను. మరి మీరేమంటారు? "

ఆమెకేదో లీలగా అర్థమయింది. గుండె వేగం మరింత పెరిగింది. గొంతు పెగలడం చాలా కష్టమయింది. "ఆ...ఆ!... అవున్నిజం" అని మాత్రం అనగలిగింది.

అతడు చెప్పాడు "మా ఫ్రెండ్ రమేష్‌కి కూడా ఈ విషయమే నేను చెప్పానండీ..."

"మౌనీ...ఏయ్! మౌనీ..."

ఇద్దరూ అటుచూశారు. స్కూటర్‌మీద ఉన్నాడు ఆ వ్యక్తి. అతడెవరో నిఖిలేష్‌కి తెలియదు. పానకంలో పుడకలా మధ్యలో దాపురించిన అతడిని తిట్టిన తిట్టు తిట్టకుండా, వెయ్యి న్నూటొక్క తిట్లు మనసులోనే తిట్టుకున్నాడు నిఖిలేష్.

"వస్తున్నానన్నయ్యా!" ఆ వ్యక్తితో చెప్పాక నిఖిలేష్‌వైపు తిరిగి పలికింది. "మా అన్నయ్య వచ్చాడు. మనం రేపు మాట్లాడుకుందాం" ఆమె నెమ్మదిగా నడిచి, ఆ వ్యక్తిని చేరుకుంది.

మౌనిక స్కూటర్ వెనుక కూర్చున్నాక, స్కూటర్ ముందుకు సాగిపోయింది.

ఆమె ఎక్కిన స్కూటర్ కనుమరుగయిన మరుసెకనులోనే నిఖిలేష్ ఎదుట రమేష్ నిలిచాడు. "చెప్పేశావా? నా ప్రేమ గురించి మౌనికకు చెప్పేశావా? " ఆత్రంగా అడిగాడు.

"చెప్పేవాడినే కాని బ్యాడ్‌లక్. మధ్యలో ఆవిడగారి అన్నయ్య వచ్చాడు. ప్రేమ సందేశం ఉపోద్ఘాతం దగ్గరే ఆగిపోయింది"

రమేష్ చాలా నీరసపడిపోయాడు. అది చూశాక నిఖిలేష్ అతడిని ఉత్సాహపరుస్తూ చెప్పాడు. "డోంట్ వర్రీరా! మరీ అంత నీరసపడిపోవలసిన అవసరం కూడా లేదు. నాకెందుకో ఆమె నీ ప్రేమను అంగీకరిస్తుందనే అనిపిస్తోంది. ఎందుకంటే, నేను ముందే అడిగాను. మీకు ప్రేమ మీద ఉండేది సదభిప్రాయమా? లేక దురభిప్రాయమా? అని! సదభిప్రాయమేనంది తను.

అందులోనూ నేను చెప్పే ప్రతి మాటా శ్రద్ధగానే వింది. సో! నా రాయబారం ఫలిస్తుందనే అనుకుంటున్నాను నేను"

"థాంక్స్‌రా!" కాసింత ఉత్సాహం తెచ్చుకున్నాడు రమేష్. వీళ్ళిద్దరూ ఇక్కడ ఇలా మాట్లాడుకుంటున్న ఆ క్షణాలలోనే...

స్కూటర్ డ్రైవ్ చేస్తున్న కృష్ణమోహన్ వెనక్కు తిరిగి చెల్లెల్ని అడిగాడు "ఎవరమ్మా ఆ కుర్రాడు? "

"నా క్లాస్‌మేట్ అన్నయ్యా"

"పేరు"

"నిఖిలేష్"

"పేరు బాగుంది"

"మనిషి కూడా చాలా మంచివాడేనన్నయ్యా" అన్నాకే తను అనకుండా ఉండవలసింది అనుకుందామె.

కృష్ణమోహన్ మరేం మాట్లాడకుండా డ్రైవ్ చేయసాగాడు.

ఆ సమయంలో ఆమెకు మాత్రం నిఖిలేష్ చెప్పిన మాటలు మళ్ళీమళ్ళీ గుర్తుకు రాసాగాయి. అప్రయత్నంగానే ఆమె పెదాలు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

స్కూటర్ మాత్రం ముందుకు పోతూనే ఉంది.

★ ★ ★

నిఖిలేష్‌ను పికప్ చేసుకునేందుకు అతడి రూమ్‌కి వెళ్ళాడు రమేష్.

కారు రోడ్ పక్కనే ఆపి సన్నటి మెట్లు దారివెంట మిద్దెమీదికి నడుస్తూ మనసులోనే నిఖిలేష్‌ని తిట్టుకోసాగాడు అతడు. 'వీడికి ఎన్నో సార్లు చెప్పాను. 'ఒరేయ్! మాది లంకంత కొంపరా. ఆ కొంపలో వంటరిగా ఉండాలంటే నాకు భయంగా ఉందిరా. ఇంట్లో ఏ మారుమూల గదిలో ఉన్నా నీకు ఈ గదికన్నా విశాలంగా, సౌకర్యంగా ఉంటుంది. నాకు తోడూ ఉన్నట్టుంటుంది. వచ్చేయ్' అని! కాని వింటాడా? వినడు గాక వినడు. కారణం ఇది అని చెప్పడుగానీ, 'వద్దురా' అని తిరస్కరిస్తాడు. గత మూడేళ్ళుగా ఇది సాగుతూ వస్తున్నదే! అందుకే అప్పుడప్పుడు తను ఇక్కడికి పికప్ చేసుకోవడంకోసం రావలసివస్తోంది.

అందులోనూ ఈరోజు తనకు మరీ టెన్షన్‌గా ఉంది. నిన్న మౌనికకు నిఖిలేష్ నా ప్రేమ గురించి చెప్పడం మొదలుపెట్టాడు. ఈరోజు చెప్పడం పూర్తిచేయాలి. ఆమె అభిప్రాయం ఏమిటో తెలుసుకోవాలి. ఈ రోజు నా జీవితంలో మరో మలుపుకు కారణం కాబోతోంది' అనుకుంటూ,

మెట్లెక్కి సెంకడ్ ఫ్లోర్ చేరుకుని ఆ గదిలోకి అడుగు పెట్టబోతూ అటుగా చూసి వాకిట్లోనే ఆగిపోయాడు రమేష్. అటుగా చూస్తే-నిఖిలేష్ కాలేజీకి తయారుకాకుండా, లుంగీతో కూర్చుని ఉన్నాడు. ఎదురుగా పల్లెనుండి వచ్చిన అతడి తల్లి కూర్చుని ఉంది.

రమేష్‌కి ఉత్సాహమంతా నీరుగారిపోయినట్లయింది. పల్లెనుండి తల్లి వస్తే ఆరోజుకి నిఖిలేష్ కాలేజీకి రాడన్న విషయం తనకు తెలిసిందే!

అతడు మెల్లగా దగ్గాడు. వాళ్ళిద్దరూ తల తిప్పి అతడిని చూశారు.

నిఖిలేష్ తల్లి పార్వతమ్మ అతడికేసి ఆప్యాయంగా చూసి "రాబాబూ రా... రా!... నీ గురించే అనుకుంటున్నాం" అంది.

అతడు లోపలికి నడిచాడు. "ఎప్పుడొచ్చావమ్మా? " అడుగుతూ మంచంమీద కూర్చున్నాడు.

"ఉదయమే వచ్చాను" చెప్పిందామె.

'ఆరోగ్యం బాగుందా? "

"బాగుంది బాబూ"

"మరి రాగానే నా గురించి టాపిక్ ఏమిటమ్మా? "

ఆమె నవ్వి చెప్పింది. "నీ ఫ్రెండ్ 'ఈరోజు ఎట్టిపరిస్థితిల్లోనూ కాలేజీకి వెళ్ళాలమ్మా, రమేష్ పని ఒకటి చేయాల్సింది ఉంది' అంటున్నాడు. నేనేమో 'కాలేజీకి వెళ్ళ

డానికి లేదు. ఎలాగూ సాయంత్రం ఊరెళ్ళిపోతున్నాను, ఈ కాసేపయినా నాతో ఉండరా' అని బతిమిలాడుతున్నా. వాడేమో నువ్వొచ్చాకే విషయం చెపుతానంటూ నానుస్తున్నాడు. నువ్వయినా చెప్పుబాబూ! ఏదో రెండు మూడు నెలలకోసారి ఇక్కడికి వచ్చేదాన్ని. అలా వచ్చినప్పుడైనా నాతో కాసేపు గడపకపోతే ఎలా? వీడు ఇప్పుడే ఇలా ఉంటే, రేపు పెద్ద డాక్టరయ్యాక నాతో అసలు పలకడేమో!"

"అమ్మా!" ఇబ్బందిగా పలికాడు నిఖిలేష్.

రమేష్‌కి పరిస్థితి ముందు నుయ్యి-వెనుక గొయ్యిలా అనిపించింది. అటు చూస్తే మౌనికకు తన ప్రేమ గురించి నిఖిలేష్ ద్వారా ఈరోజు తెలియచేయాలని తన తాపత్రయం.. ఇటు ఈ తల్లిప్రేమను చూస్తుంటే, నిఖిలేష్‌ను ఇబ్బంది పెట్టి తనతో తీసుకెళ్ళడమూ న్యాయంకాదేమోనని పిస్తోంది. అందుకే అడిగాడు. "అయినా మీరు ఈ రోజే వచ్చారు. ఈరోజే వెళ్ళిపోవడం ఏమిటమ్మా? ఎప్పుడూ రెండు మూడు రోజులుండేలా వచ్చేదానివి కదా? "

"అసలు నేను వరికోత అయ్యాకే వద్దామనుకుంటే, ఇదిగో వీడు డబ్బులు పంపమని ఉత్తరం రాశాడు. సరే, డబ్బులు పోస్ట్‌లో పంపొచ్చు. కాని వరి కోత అయ్యాక వరుసగా పొలంపనులున్నాయి. కాబట్టి రాలేకపోతాను. అందుకే కనీసం ఒక్కరోజయినా వీడితో గడిపినట్టుంటుందని ఇలా వచ్చా"

"అయితేనేం మరో రెండు రోజులు... కనీసం ఒక్కరోజయినా"

"లేదయ్యా రమేష్! వరి చేను కోతకొచ్చేసి ఉంది. రేపు ఉదయానికి ఇల్లు చేరితే ఎల్లుండి కోతకు కూలీలను పిలుచుకోవాలి" ఆమె తప్పదన్నట్టుగా చెప్పింది.

రమేష్ సీరియస్‌గా నిఖిలేష్‌కేసి చూశాడు. "అయినా నీకు బుద్ధిలేదురా లేకపోతే, నీకు డబ్బులు అవసరపడితే నన్ను అడగొచ్చుకదా? అమ్మను అంత దూరం నుండి రప్పించడమెందుకు? "

నిఖిలేష్ నవ్వి ఊరకుండిపోయాడు. స్నేహాన్ని దుర్వినియోగం చేయడం అతడికి ఇష్టంలేదు. రమేష్ మెంటాలిటీకి కాదుగానీ, చాలాచోట్ల డబ్బు స్నేహాన్ని చెడగొడుతుందని ప్రత్యక్షంగా చూశాడు.

రమేష్ నిట్టూర్చి "సరే! ఇప్పుడు కాలేజీకేమీ రానవసరం లేదుగానీ నువ్వు అమ్మతోనే ఉండు, పాపం! కనీసం ఒక్కరోజయినా బిడ్డతో గడపాలని తను ఎంతో దూరం నుండి వచ్చింది" చెప్పాడు. మనసులో మాత్రం కొంత బాధగానే ఉంది. మౌనిక విషయం ఈరోజు తెలిసిపోయి ఉండేది కదా? తనకూ ఎంతో నిశ్చింతగా... కాదు ప్రపంచాన్ని జయించినంత ఆనందం కలగాల్సిన క్షణాలు దురదృష్టవశాత్తు మిస్ అవుతున్నాయి. బ్యాడ్‌లక్'

"అది కాదు. ఈరోజు -మనం ఒక విషయం..."

రమేష్ చెయ్యి చూపించి ఆగమన్నట్టు సైగ చేశాడు. "ఆ పని ఈరోజు కాకపోతే రేపు అవుతుంది. కానీ, అమ్మ రేపు వరకు ఉండలేదు కదా? "

అతడి ముఖంలోని నిరుత్సాహం గమనించినా, తను చేయగలిగింది మరేం లేనట్టు మౌనంగా తలాడించాడు నిఖిలేష్.

"ఓకే. నేను కాలేజీకి వెళ్తాను" అని రమేష్ మంచంమీదనుండి లేవబోతుంటే, పార్వతమ్మ అతడి చెయ్యి పట్టుకుంది.

"నువ్వు మాత్రం కాలేజీకి వెళ్ళడం ఏంటయ్యా! నువ్వూ ఈరోజు మా ఇద్దరితో పాటే ఇక్కడే ఉండాలి. వచ్చేప్పుడు సున్నుండలు, మామిడితాండ్ర తెచ్చాను. వేడివేడిగా వంటచేస్తాను. ఇక్కడే భోంచేద్దాం" అంది.

రమేష్‌కి కాలేజీకి వెళ్ళాలనిపించడంలేదు. ప్రతిక్షణం మౌనిక అతడి కనులముందు నిలిచి కవ్విస్తోంది. రోజుకోసారయినా ఆమెను చూడనిదే తనుండలేడు. మరి ఈ రోజు... చివరికి అతడు ఆరోజు వారిద్ద

రితోపాటే ఉండిపోదలచుకున్నాడు.

"అలాగే మీరు చెప్పినట్టే చేద్దాం. ముందు సున్నుండలు ఇవ్వమ్మా" రమేష్ మంచం మీదే పద్మాసనం వేసి కూర్చుంటూ అడిగాడు.

ఆమె నవ్వి మంచం దిగివెళ్ళి సంచిలో నుండి పెద్ద డబ్బా తీసుకొచ్చి వారి ముందు ఉంచింది "తీసుకోండర్రా" అంది.

రమేష్ ఒకటి అందుకున్నాక నిఖిలేష్ కూడా మరొకటి చేతిలోకి తీసుకున్నాడు. సున్నుండలు చాలా రుచిగా ఉన్నాయి. ఆమె తల్లిప్రేమనంతా ఆ సున్నుండల్లో కూర్చి చేసినట్టుంది. అందుకే అంత రుచి!

అతడు దీర్ఘంగా నిట్టూర్చాడు. తనకు సంవత్సరం వయసులోనే, రెండో బిడ్డకు జన్మనిచ్చే ప్రయత్నంలో కడుపులోని బిడ్డతో సహా మరణించింది తన తల్లి. నిఖిలేష్‌కి పన్నెండేళ్ళ వయసులో పాముకాటుకి గురయ్యి తండ్రి మరణించాడు. తను తల్లి లేని బిడ్డయితే, నిఖిలేష్ తండ్రిలేని కొడుకు. అయితే ఈ పెద్దవాళ్ళ గొప్పతనం ఏమిటంటే- తన తండ్రి తనకు తల్లిలేని లోటు తెలియకుండా పెంచాడు. నిఖిలేష్ తల్లి అతడికి తండ్రి అవసరం తెలియనంతగా బాధ్యతలు నెత్తినేసుకుని పెంచింది.

పార్వతమ్మ మరో సంచిలోని, మరో డబ్బా తెచ్చి వాళ్ళముందు పెడుతూ చెప్పింది. "ఇందులో మామిడి తాండ్ర ఉంది. తీసుకోండి"

నిఖిలేష్ రమేష్‌తో అన్నాడు, "మామిడి తాండ్ర నీకు బాగా ఇష్టం కదరా, తీసుకుని తిను"

రమేష్ మామిడి తాండ్ర అందుకుని తిన సాగాడు.

పార్వతమ్మ ఆ గదంతా తిరిగి అక్కడున్న ప్రతి వస్తువూ పట్టి పరిశీలనగా చూశాక అంది "ఏరా! అసలు నువ్వు రోజూ అన్నం తింటున్నావా? "

"ఆ అనుమానం ఎందుకొచ్చిందమ్మా నీకు? "

"లేకపోతే ఏంట్రా... ఎప్పుడో మూడు నెలల క్రితం తెచ్చిన యాభైకిలోల బియ్యం ఇంకా అలా పడి ఉన్నాయంటే ఏమనుకోవాలి? "

"అదా..." నవ్వాడు నిఖిలేష్ "... ఈ మధ్య వంట చేసుకోవడానికి బద్ధకించి, ఎక్కువగా మెస్‌లోనే తినేస్తున్నానులేమ్మా"

"పోనీ మెస్‌లోనో, గిస్‌లోనో, ఎక్కడో దగ్గర కడుపునిండా తింటున్నావా? "

"తింటున్నానమ్మా"

తల్లి ఆప్యాయత అనేది ఎలా ఉంటుందో ఆమె సమక్షంలో అర్థమవుతూ ఉంటుంది రమేష్‌కి. తనకు తల్లిలేకపోయినందుకు అతడు కొద్దిక్షణాలపాటు అదోలా ఫీలవుతాడు. ఎక్కువగా కాకపోవచ్చు గానీ ఎంతో కొంత బాధనిపిస్తుంది. అయితే అంతలోనే తండ్రి ప్రేమ గుర్తొచ్చి కొంత తృప్తి పడతాడు.

"సరే! మీరిద్దరూ మాట్లాడుకుంటూ ఉండండి. కాసిన్ని బియ్యం కడిగి స్టౌమీద పడేస్తా. క్షణాలలో అన్నమయిపోతుంది. తినేద్దాం" ఆమె పనిలో పడిపోయింది.

"ఏమిట్రా! ఇలా అయింది. ఈ రోజు నీ ప్రేమ విషయం మౌనికతో చెప్పేయాలనుకున్నాను" నిఖిలేష్ రమేష్‌తో గొణిగినట్టుగా అన్నాడు.

"ఫర్వాలేదులేరా. ఒక్కరోజులో మునిగిపోయేదేముంది? ఈరోజు కాకపోతే రేపవుతుంది. దట్సాల్" అన్నాడు.

నిఖిలేష్ తన తల్లితో కబుర్లు చెపుతూనే, మధ్యమధ్య రమేష్‌తో మాట్లాడసాగాడు. సమయం త్వరగానే గడిచిపోయింది.

పార్వతమ్మ వంట పూర్తిచేసింది. వేడి అన్నం వడ్డించి, పల్లె నుండి తెచ్చిన ఊరగాయలు ప్లేట్స్‌లో వేసింది. వాళ్ళు ఆవిడ తెచ్చిన కమ్మటి పెరుగుతో లొట్టలేసుకుంటూ భోంచేస్తుంటే ఆ తల్లి వారిద్దరికేసి

ఆప్యాయంగా చూస్తుండిపోయింది.

భోజనాలు పూర్తయ్యాయి. అప్పుడు తను ఇంటికెళ్ళి చేసేది మరేం లేకపోవడంతో రమేష్ కూడా నిఖిలేష్ రూమ్‌లోనే ఉండిపోయాడు.

సాయంత్రం పార్వతమ్మ పల్లెకు బయల్దేరింది.

ఎంతో దూరం నుండి వచ్చి కొద్దిగంటలయినా ఉండకుండా ఆమె వెళ్ళిపోతుండడం రమేష్‌కి ఏదోలా అనిపించింది. అసలు అతడా ప్రశ్నను చాలా రోజులుగా అడగాలనుకుంటూనే అడగలేకపోయాడు. ఇక ఇప్పుడు ఉండబట్టలేక అడిగేయదలచుకున్నాడు.

"అమ్మా! నేనో మాట అడుగుతాను ఏమీ అనుకోవుగా? "

"నేను అనుకునేటటువంటి ప్రశ్న నువ్వు అడగవని నాకు తెలుసు. ఒకవేళ అలాంటిదేదయినా నువ్వు అడిగినా నేనేమి అనుకోను కాబట్టి అడగదలచుకున్నది అడిగేసెయ్యి"

నిఖిలేష్ వారిద్దరినే మార్చిమార్చి చూస్తున్నాడు.

"అమ్మా! నిఖిలేష్ ఇంకా ఇక్కడ ఓ రెండేళ్ళపాటు చదువు కొనసాగించాలి. రెండేళ్ళ తర్వాతయినా మనవాడు ఆ పల్లెకొచ్చి చేయగలిగింది ఏమీ లేదు. ఆ పల్లెలో వాడు ప్రాక్టీస్ పెట్టలేడు. ఒకవేళ పెట్టినా డాక్టర్లకి చేతినిండా పని ఉండదు. సో! మనవాడు ఈ సిటీలోనే ప్రాక్టీస్ పెట్టుకోవడమో లేదా మరొక హాస్పిటల్‌లో జాయిన్ కావడమో చేయాలి. అంటే ఒకవిధంగా వాడికి ఆ పల్లెకు రావడం అనేది జరగదు. మరి అలాంటప్పుడు మీరు మాత్రం ఇంకా ఆ పల్లెలో ఉండటం ఎందుకమ్మా? ఆ పొలాలు, ఇల్లూ అమ్మేసి ఈ సిటీకి వచ్చేస్తే, మా వాడికి మెస్ భోజనం బాధ తప్పుతుంది. ఆ పొలం అమ్మిన డబ్బు బ్యాంక్‌లో వేసుకున్నా వచ్చే వడ్డీ మీ ఇద్దరి పోషణకు బ్రహ్మాండంగా సరిపోతుంది? ఏమంటారు? "

పార్వతమ్మ కొద్ది క్షణాలు మౌనంగా ఉన్నాక తలెత్తి నిఖిలేష్‌కేసి చూసింది. 'రమేష్ ప్రశ్నకు జవాబు చెప్పాల్సిన బాధ్యత నీదే' అన్నట్టున్నాయి ఆమె చూపులు.

తల్లిచూపులు గమనించి నిఖిలేష్ చిన్నగా నవ్వాడు "రేయ్ రమ్మీ! నేను... నేను సిటీలోనే ప్రాక్టీస్ పెట్టుకుంటానని నువ్వెందుకనుకొంటున్నావ్? నేనెప్పుడయినా నీకలా చెప్పానా? "

రమేష్ పార్వతమ్మ మీద నుండి చూపులు మరల్చి నిఖిలేష్‌మీద నిలిపాడు.

"అదేంట్రా? ... ఇంత కష్టపడి డాక్టరు డిగ్రీ సంపాదించుకున్నాక, ఆ పల్లెకు వెళ్ళి ఏం చేయగలవ్"

"ఏం? ... సిటీలోనేనా మనుషులుండేది? ... పల్లెటూర్లో మనుషులు లేరా? "

"మనుషులుంటే చాలు హాస్పిటల్ పెట్టేస్తావా? "

"మనుషులకోసం పెట్టే హాస్పిటల్‌కి కావలసింది మనుషులేగా? "

రమేష్ అదోలా నవ్వాడు. "నిజమా!" అతడి గొంతులో వ్యంగ్యం ధ్వనించింది. అంతలోనే సర్దుకుని చెప్పాడు. "అక్కడ మనుషులున్నారు. కాని ఆ మనుషులకు వైద్యం చేయడంవల్ల మనకొచ్చేది మాత్రం ఏమీ ఉండదు. అటు పెద్ద హాస్పిటల్ కట్టుకునేంత పైసలూరావు, ప్రముఖ డాక్టరు అనే పేరూ రాదు. అదే ఈ సిటీలో ఏ మారుమూల చిన్నగదిలో ప్రాక్టీస్ పెట్టినా వచ్చే డబ్బుతోనే హాస్పిటల్‌ని మరింత పెద్దది చేసి కోట్లు సంపాదించొచ్చు"

నిఖిలేష్‌కి ఆ సంభాషణ మరింత పొడిగించడం ఇష్టంలేకపోయింది. ఎందుకంటే పార్వతమ్మకు ట్రెయిన్‌కి టైమయింది. అందుకే అతడు ఆ సంభాషణను కట్‌చేసే ఉద్దేశంతోనే చెప్పాడు.

"చూడు రమేష్! కొందరికి పేరు, డబ్బు

# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ *ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.*
- ★ *సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.*
- ★ ***ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.***

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదని, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

---------- కూపన్ ----------

మే చతుర నవల ప్రేమపథం ..................

సమీక్షకుని పేరు: ..................

చిరునామా: ..................

..................

..................

..................

సంపాదించడంవల్ల సంతృప్తి లభిస్తే, మరి కొందరికి ఇతరులకు సేవచేయడంవల్ల సంతృప్తి లభిస్తుంది. డబ్బు, పేరు సంపాదించాలని నీ కోరిక. నీ కోరిక తీరితేనే నీకు సంతృప్తి. నా కోరిక తీరితేనే నాకు సంతృప్తి. కాబట్టి ఎవరి కోరిక వారిది. ఎవరి సంతృప్తి వారిది. 'అది తప్పేమో' అనడానికి మరొకరికి హక్కులేదు. ఇక నువ్వేం మాట్లాడకు వెళ్దాం పద అమ్మని బండెక్కించివద్దాం"

వాళ్ళు రూమ్‌లోంచి బయటకు నడిచారు. రైల్వే స్టేషన్‌కి చేరుకున్నారు. అప్పటికే రైలు ప్లాట్‌ఫారం మీద ఉంది. వాళ్ళిద్దరూ ఆమెవెంట నడిచారు. లేడీస్ కంపార్ట్‌మెంట్‌లో ఆమెను కూర్చోబెట్టాక రైలు కదిలేవరకూ వాళ్ళిద్దరూ అక్కడే ఉన్నారు.

రైలు కదిలి కనుమరుగయ్యాక, ఇద్దరూ ప్లాట్‌ఫారం మీదనుండి నడుచుకుంటూ స్టేషన్ బయటకొచ్చారు.

రమేష్‌కి చాలా సేపటినుండి మనసులో కొద్దిగా ఇబ్బందికరమైన భావం కదలాడుతూ బాధపెడుతోంది. అందుకు కారణం అదే... తమ మధ్య ఇంతవరకూ రాని ప్రస్తావన కొద్దిసమయం క్రితమే వచ్చింది. అతడి మనసులోని మాట అప్పుడే తనకు తెలిసింది. 'అయితే... అయితే నిఖిలేష్ డాక్టర్ డిగ్రీ పుచ్చుకున్నాక తిరిగి పల్లెకు వెళ్ళిపోతాడా? తనింతవరకూ భవిష్యత్తును తామిద్దరితో కలుపుకుంటూ ఆలోచించుకుంటూ వస్తున్నాడు. నిఖిలేష్‌చేత ప్రాక్టీస్ పెట్టించడమో లేదా తామిద్దరూ కలసి ఉండేలా మల్టీస్పెషాలిటీ హాస్పిటల్ కట్టించుకోవడమో చేయాలనుకున్నాడు. కానీ ఇప్పుడే తెలిసింది. నిఖిలేష్ డాక్టర్ డిగ్రీ పుచ్చుకున్నాక సిటీలో ఉండడని! అయినా నిఖిలేష్ అలాంటి నిర్ణయానికి ఎందుకొచ్చాడు? '

అతడు ఆ విషయమే నిఖిలేష్‌ను అడగాలనుకుంటూ ఉంటే-

అదే సమయంలో స్టేషన్‌నుండి బయటకు నడుస్తున్న నిఖిలేష్ ఆ పరిసరాలను పరిశీలనగా బరువైన గుండెతో చూడసాగాడు.

ఎందుకనో తెలియదు ఎప్పుడు ఆ చోటుకి చేరినా ఆ పరిసరాలు తనకు అదో విధమైన అనీజీనెస్‌ను తెచ్చిపెడతాయి.

కడుపు చేతబట్టుకుని కొందరు. తమ అదృష్టాన్ని వెతుక్కుంటూ మరి కొందరు, స్థిరపడిన బంధుమిత్రులను చేరుకునేందుకు ఇంకొందరు, దూరప్రాంతాలకెళ్ళి పనులు ముగించుకుని వస్తున్న ఎందరో ఆ చోట రైలు దిగి సిటీలో అడుగుపెడుతుంటారు.

అప్పటికే సిటీ చేరి ఊహలు తల్లకిందులై, బ్రతుకు భారమైన జనం కొందరు ఆ చోట రకరకాల రూపాలలో దర్శనమిస్తుంటారు.

ఫైల్స్ పట్టుకుని నిస్తేజమైన చూపులతో బస్టాప్‌లో నిలబడ్డ నిరుద్యోగి, తొక్కిసలాడుకుంటూ బస్సెక్కుతున్న జనంలో దూరిపోయి జేబు కత్తిరించే ప్రయత్నంలో ఉన్న జేబు దొంగ, కష్టాలు ఎన్ని ఎదురయినా నీతి తప్పకూడదని రిక్షా లాక్కునే రిక్షావాడు, నీతి, శీలానికన్నా ఆకలి బాధ గొప్పదని నిరూపిస్తూ విటులను ఆకర్షించే ప్రయత్నంలో ఉన్న వేశ్య, అడుక్కుంటున్న 'అనాథ'పిల్లాడు. ఒక్కరనేమిటి, సమాజంచేత లేదా వ్యక్తులచేత పీడించబడిన వాళ్ళు, మోసపోయిన వాళ్ళు అక్కడ కనిపిస్తుంటారు.

కారుల్లో తిరుగుతూ స్టార్ హోటళ్లలో బసచేసేవాళ్లు, సమాజంలోని మరోకోణాన్ని చూడాలనుకుంటే ఆ చోట ఓ అర్థగంట నిలబడి పరిశీలిస్తే చాలు.

ముఖ్యంగా అడుక్కుంటూనో, ఆగిన వాహనాల అద్దాలను తుడిచి చేతులు చాస్తూనో, హోటళ్లలో గిన్నెలు కడిగేస్తూనో, టైమ్‌పాస్ పల్లీలు అమ్ముకుంటూనో... కనిపించే ఆ అనాథలను కొద్దిసేపు తదేకంగా చూసి, వాళ్ళ గురించి కొద్ది క్షణాలపాటు

ఆలోచించగలిగితే ఖచ్చితంగా మనసులో అదోరకమైన బాధ కలిగి తీరుతుంది. అది నిజం.

అలా తనచుట్టూ కనిపిస్తున్న అనాథలను పరిశీలనగా చూస్తున్న నిఖిలేష్‌ని రమేష్ పిలుపు ఈలోకంలోకి వచ్చేలా చేసింది.

"నిఖిలేష్"

అతడు తలతిప్పి చూసి "ఏమిట్రా?" అన్నాడు.

"ఇందాకటి విషయమే నేను నిన్ను అడగాలనుకుంటున్నాను"

"ఏది? నేను డాక్టరయ్యాక పల్లెటూరు వెళ్ళిపోవడం గురించా?"

"అవును"

నిఖిలేష్ ఏదో చెప్పబోతూ... అటుచూస్తే కనిపించిందా దృశ్యం!

అతడేదో చెప్పబోతున్నాడని తలతిప్పి చూసిన రమేష్‌కి నిఖిలేష్ మరెటో చూడడం కనిపించింది. రమేష్ కూడా అటు చూశాడు.

దారిన వెళ్తున్న ఓ యువతి తను కారుని సమీపించిన క్షణాల్లోనే చప్పున ఆగిపోయి రెండు చేతులతో కడుపు పట్టుకుంది. అప్పుడు చూశారా మిత్రులు ఆమె ఎత్తయిన ఉదరభాగాన్ని... ఆమె గర్భవతి!

ఆమె పళ్ళబిగువున బాధను భరించాలని ప్రయత్నించి, ఆ ప్రయత్నంలో విఫలమై, ఇక బాధను భరించలేనట్టు "అమ్మా! ఆ... అమ్మా..." అంటూ అరుస్తూ నేలమీద కూలబడిపోయింది.

అటూ ఇటూ నడుస్తున్న జనం ఒక్కసారిగా నడక ఆపి ఆమెకేసి చూశారు.

ఆమె అరుపులు పెద్దవయ్యాయి. జనం మెల్లగా ఆమె చుట్టూ మూగారు.

నిఖిలేష్, రమేష్‌లు ముఖాలు చూసుకున్నారు. "చూద్దాం పద" నిఖిలేష్ అన్నాక అతడి అనుసరించాడు రమేష్.

ఇద్దరూ గుంపులో చొరబడి చోద్యం చూస్తున్న మనుషులను తోసుకుని ముందు కెళ్ళారు. ఆమె పరిస్థితి చూస్తే ఇద్దరికీ జాలేసింది.

నేలమీద జారబడి కాళ్ళు కదిలిస్తూ, రెండు చేతులతో పొట్టపట్టుకుని అరిచేస్తోందామె. భరించలేని బాధ ఆమెను అతలాకుతలం చేస్తున్నట్టుంది. అందులోనూ ఈ క్షణమో-మరుక్షణమో ప్రసవం అయ్యేలా ఉంది.

ఆమె ముఖం చూస్తే చదువుకున్న అమ్మాయిలానే ఉంది. కలిగిన కుటుంబంలోనుండి వచ్చినట్టే కనిపిస్తోంది. మరి తొమ్మిదినెలలు నిండుకున్నాయని తెలిశాక కూడా ఈమె ఇలా రోడ్డుమీదకు రావడం ఏమిటి? అందులోనూ చేతిలోని బట్టల సంచి చూస్తే తనేదో ప్రయాణంచేయబోతున్నట్టుంది.

చుట్టూ ఉన్న జనం చోద్యం చూస్తున్నారే తప్ప ఆమెకు సహాయం చేద్దామనే ఉద్దేశంతో ఒక్కరూ అడుగు ముందుకేయడం లేదు.

రమేష్‌కి ఆమెను అలా చూస్తుంటే గుండె ద్రవించిపోయింది. అదేక్షణం చుట్టూ ఉన్న జనాలమీద కోపమూ వచ్చింది. "ఏంట్రా! ఈ జనం మరీ ఇంత మనసులేని వాళ్ళు. అందరూ అలా చూస్తూ ఉన్నారే తప్ప ఏ ఒక్కరూ సహాయం చేయడంలేదేమిట్రా?" నిఖిలేష్‌తో అన్నాడు అతడు.

నిఖిలేష్ దీర్ఘంగా నిశ్వసించాడు. "మనం మాత్రం మనసున్న మనుషులమేమీ కాదు కదరా రమేష్! మనం ఇతరులను విమర్శించడమేమిటి? మనమూ చూస్తూనే ఉన్నాం తప్ప సహాయం చేస్తున్నామా?"

రమేష్ వెంటనే తడబడ్డాడు. కొద్దిక్షణాల తర్వాత "నిజమే" అన్నాడు. వెంటనే ఓ నిర్ణయానికి వచ్చినట్టు "ఎవరో వస్తారని, ఏదో చేస్తారని భ్రమలు వదిలేసి, మనమే కదులుదాం. ఆ అమ్మాయికి ఓవైపు నువ్వుపట్టుకో, మరోవైపు నేను పట్టుకుంటాను. కారులోచేర్చి, హాస్పిటల్‌కి తీసుకెళ్దాం"

నిఖిలేష్ కళ్ళల్లో మెరుపు కనిపించింది. "దట్స్ గుడ్" అన్నాడు.

ఇద్దరు మిత్రులు ముందుకు కదిలి, నేల మీదపడి ఆక్రందనలు చేస్తున్న ఆ అమ్మాయిని చెరోవైపు పట్టుకుని కారులో చేర్చారు.

మరు నిముషమే కారు వేగంగా, హాస్పిటల్‌వైపు దూసుకుపోయింది.

రైల్వేస్టేషన్‌కి దగ్గర్లోనే కనిపించింది ఓ ప్రవేట్ హాస్పిటల్ రమేష్ వెనకా ముందూ ఆలోచించకుండానే కారు ఆ హాస్పిటల్ ఆవరణలోకి పోనిచ్చాడు.

కారు పోర్టికోలో ఆగాక నిఖిలేష్ వెళ్ళి రిసెప్షన్‌లో పేషెంట్ గురించి చెప్పాడు. స్ట్రెచర్ కారు దగ్గరకొచ్చింది. పేషెంట్‌ని లోపలికి తీసుకెళ్ళారు.

తీరా లోపలికెళ్ళాక డాక్టర్ అడ్మిషన్ స్లిప్ తీసి, వాళ్ళను చూస్తూ, "ఇంతకీ ఆవిడ మీలో ఎవరి మిసెస్? " అంటూ ఆసక్తిగా అడిగింది.

ఇద్దరూ ఉలిక్కిపడ్డారు.

ఏదో చిన్న ఇబ్బందికరమైన భావం.

నిఖిలేష్ ముందుగా తేరుకుని "ఆవిడ మా ఇద్దరిలో ఎవ్వరికీ సంబంధించిన వ్యక్తి కాదు. స్టేషన్ దగ్గర ప్రసవవేదన పడుతూ ఉంటే హాస్పిటల్‌కి తీసుకొచ్చాను" చెప్పాడు.

ఈసారి ఉలిక్కిపడడం డాక్టర్ వంతయింది, "అంటే... అంటే ఆ అమ్మాయి మీకు సంబంధించిన మనిషి కాదా? "

"నో డాక్టర్" ఇద్దరూ ఒకేసారి చెప్పారు.

డాక్టర్ ముఖంలో ఈసారి చిరాకు, అసహనం స్పష్టంగా కనిపించాయి. "అయితే మీరు ప్రజాసేవ చేశారన్నమాట" అంది ఆమె వ్యంగ్యంగా.

యాభయ్యేళ్ళుంటాయేమో ఆమెకు. డబ్బు కోసం మనుషుల్ని పట్టిపీడించే నరరూప రాక్షసి అనిపిస్తుంది ఆమెను చూస్తుంటే.

వాళ్ళిద్దరూ ఆమె వ్యంగ్యాన్ని అర్థంచేసుకోలేదు. పైపెచ్చు ఆమె తనను అభినందిస్తోందేమోనని గర్వంగా ఫీలై నవ్వి ఊరుకున్నారు.

"బట్ మీరు ప్రజాసేవ చేయడం బాగానే ఉందిగానీ, ఈ హాస్పిటల్‌లో ప్రజాసేవ చేయబడదు. కాబట్టి మీరు ఆమెను ఏ గవర్నమెంట్ హాస్పిటల్‌కో తీసుకెళ్ళి ఉండాల్సింది..."

ఛెళ్ళున కొరడాతో కొట్టినట్టు వాళ్ళు అదిరిపడి ఆమెకేసి చూశారు. అప్పటికిగానీ ఎదుటివ్యక్తి మనస్తత్వమేమిటో బోధపడలేదు వారికి. పూర్తిగా కమర్షియల్ మెంటాలిటీ ఆమెలో కనిపించింది. అయినా వారిలో ఆశ చావలేదు.

"డాక్టర్! ఆ అమ్మాయి పరిస్థితి చూస్తే అంత టైమ్ ఉన్నట్టుగా అనిపించలేదు. అందుకే దగ్గరగా హాస్పిటల్ కనిపించగానే ఇటు తీసుకొచ్చాం" చెప్పాడు రమేష్.

"ఆమాట నిజమే. దేరీజ్ నోటైమ్. మరో ఐదు, పదినిముషాలలో డెలివరీ అయిపోయేలా ఉంది"

" అదేనా ప్రాబ్లమ్ మేడమ్"? నిఖిలేష్ అడిగాడు.

"ప్రాబ్లమ్ ఏదయినా, కనీసం రెండువేల రూపాయలు డిపాజిట్ చేయనిదే పేషెంట్‌ని అడ్మిట్ చేసుకోవడం జరగదు. ఆ తర్వాత బిల్లులు మీరే చెల్లిస్తామని కూడా హామీ ఇవ్వాలి..."

నిజానికి ఆమె సాధారణ పరిస్థితుల్లోనయితే వచ్చిన వాళ్ళతో అంతసేపు మాట్లాడదు. కాని ఎదుట ఉన్న కుర్రాళ్ళు చదువుకున్నవాళ్ళలా కనిపించడం, కారులో రావడం గమనించాకే ఆమాత్రం మాట్లాడుతోంది.

మిత్రులిద్దరికీ కొద్దిక్షణాలపాటు ఏమీ తోచలేదు. వాళ్ళు ఒకరి ముఖంలోకి ఒకరు చూసుకోసాగారు. గుండె కింద నరాలను మెలిపెట్టేలా దూరంనుంచి ఆ అమ్మాయి అరుపులు వినిపిస్తూనే ఉన్నాయి. మనసు లేని మనుషుల మధ్యకు మరో జీవిని

తెచ్చేందుకు ఆమె ప్రసవవేదన పడుతోంది.

"మేము మెడికల్ కాలేజీ స్టూడెంట్స్‌మి"

"అయితే? "

ఆమె డబ్బు తప్ప మరే విషయమూ పట్టించుకోదన్న నిజం అర్థమయిపోయింది వారికి.

నిఖిలేష్ క్షణాల్లో ఓ నిర్ణయానికి వచ్చాడు. తల్లి ఇచ్చి వెళ్ళిన రెండువేల రూపాయలు జేబులోనే ఉన్నాయి. ఆ డబ్బు తీసి డాక్టర్‌కి అందిస్తూ చెప్పాడు. "ముందు పేషెంట్‌ని అడ్మిట్ చేసుకోండి. మీ హాస్పిటల్ బిల్లులు మేమే చెల్లిస్తాం. అందుకోసం ఎక్కడ సంతకాలు పెట్టాలో చెపితే, సంతకాలు చేస్తాం"

ఈ మలుపు డాక్టర్ ఊహించనేలేదు. డబ్బు కట్టాలి అనగానే వాళ్ళు ఆమెను ఏ గవర్నమెంట్ హాస్పిటల్‌కి తీసుకెళ్ళడమో లేదా తిరిగి రోడ్డు పక్కనే వదిలేయడమో చేస్తారనుకుంది. కాని వాళ్ళలా చేయకపోవ డంతో ఆశ్చర్యపడింది. పైపెచ్చు వాళ్ళు చూపిన మానవత్వం ముందు తన అల్పత్వం కొట్టొచ్చినట్టు కనిపించడంతో కొద్దిగా సిగ్గుపడింది. అయినా ఆమె ప్రొఫె షనల్. ఇలాంటి విషయాలు మనసులోకి తీసుకుంటే వ్యాపారం చేయలేదు. అందుకే మరో అనుమానాన్ని మనసులో ప్రవేశపె ట్టుకుని "అలా కూడా జరిగేందుకు అవ కాశం ఉందిలే! ఈమధ్యకాలంలో కుర్రాళ్లు మరీ తెలివిమీరిపోతున్నారు. లేకపోతే దారిన పోయే శనికోసం నాలుగయిదువేలు ఖర్చుపెట్టే అమాయకులు ఈలోకంలో ఉంటారా? ..." అని మనసుని తృప్తిపరచు కుంది.

ఆమె పక్కనే ఉన్న నర్స్‌వైపు తిరిగి "వీళ్ళ చేత ఫార్మాలిటీస్ పూర్తిచేయించి పేషెంట్‌ని లోపలికి తీసుకురా" అంటూ తను లోపలికె ళ్ళిపోయింది.

అన్ని పేపర్లమీద నిఖిలేష్ సంతకాలు చేశాడు. ఆ అమ్మాయిని లేబర్ రూమ్ లోకి తీసుకెళ్ళిపోయారు.

ఈ తంతు అంతా పూర్తయి, కాస్త తీరిక చిక్కి నీరసంగా అక్కడేవున్న బెంచీమీద కూర్చున్నాక రమేష్ నిఖిలేష్ భుజం మీద చెయ్యివేసి అన్నాడు. "నువ్వు... నువ్వు తొందరపడ్డావేమో? "

"ఆ అమ్మాయి బాధ చూస్తుంటే, మనసు తట్టుకోలేకపోయింది. పోతే పోయింది ఓ నాలుగువేలు ఖర్చవుతాయేమో! అంతగా అవసరపడితే నా మెడలో ఛెయిన్ ఉంది. అమ్మేస్తాను. డబ్బు కావాలంటే మళ్ళీ మనం సంపాదించుకోవచ్చు. కాని, చూస్తూ ఓ నిండు ప్రాణాన్ని రక్షించగలిగే అవకాశం ఉండీ, రక్షించలేకపోతే ఆ బాధ చివరివ రకూ మనల్ని వెంటాడుతుంది"

"నేనూ డబ్బు గురించి బాధపడడంలేదు. డబ్బు ఎంత ఖర్చయినా నేను సర్దుతాను. నా బాధ ఏమిటంటే ఆ అమ్మాయిని హాస్పి టల్‌లో చేర్చడమంటే తన బాధ్యత మనం తీసుకోవడమే అవుతుంది. అనవసరంగా దారిన పోయే వ్యవహారాలలో జోక్యం చేసు కోవడం అంత మంచిది కాదేమోనని" చివ రన నసిగాడు రమేష్.

"అలా అంటే, హాస్పిటల్‌కి తీసుకొచ్చేం దుకు ముందుగా ముందుకు అడుగేసింది నువ్వే కదా? "

"హాస్పిటల్‌కి తీసుకురావడం అంటే... హాస్పిటల్‌లో అప్పగించేసి వెళ్లిపోదామనుకు న్నాను. ఈ సంతకాలు, బిల్లులు చెల్లించడం ఊహించనేలేదు నేను. ఇలా ఉంటుందను కుంటే నేను ముందుకు అడుగేసి ఉండేవా డిని కాను"

"నువ్వు వెనకడుగు వేసి ఉన్నా, నేను మాత్రం ముందుకే నడిచేవాడ్ని. ఎందు కంటే చెప్పానుగా! చూస్తూ చూస్తూ ఓ నిండు ప్రాణం రక్షించే అవకాశం ఉండీ, రక్షించలేకపోతే ఆ బాధ చివరి వరకూ మనల్ని వెంటాడుతుందని"

ఈసారి రమేష్ మరేం మాట్లాడలేదు.

చాలా సేపు ఇద్దరిమధ్యా నిశ్శబ్దం రాజ్యమేలింది.

అయితే, లోపలికి తీసుకుపోబడ్డ అమ్మాయి పరిస్థితి ఎలా ఉందో, ఏమవుతుందోనన్న టెన్షన్ మాత్రం ఇద్దరిలోనూ ఉంది. రమేష్‌కి మాత్రం టెన్షన్ ఒక్కటే కాదు, ఊహించనిదేదయినా జరిగితే తామిద్దరూ మరింత రిస్క్ తీసుకోవాలనే భయమూ మనసులో మెదులాడుతోంది. అందువల్లే అతడు కాస్త ఇబ్బందిగానే అక్కడ కూర్చుని, రకరకాలుగా ఆలోచించుకుంటున్నాడు.

అలా పావుగంట గడిచిందేమో రమేష్‌ని మరింతసేపు భయపెట్టడం ఇష్టంలేనట్టు... నర్స్ పరుగెత్తుకొచ్చింది. వారిద్దరిముందు నిలబడి చెప్పింది.

"బాబు పుట్టాడు, సుఖప్రసవమే అయింది"

ఆనందపడేందుకు ఆ అమ్మాయి కనీసం తమ బంధుమిత్రుల సంబంధకురాలు కూడా కాదు. అందుకే ఇద్దరూ నవ్వడం తప్ప, సంతోషాన్ని వ్యక్తంచేయలేదు. అయితే వారి మనసుల్లో మాత్రం అదోరకమైన సంతృప్తి కదలాడింది. అంతకుమించి టెన్షన్ తొలిగిపోయిన ఫీలింగూ కలిగింది.

రమేష్ జేబులోనుండి యాభైరూపాయల నోటు తీసి నర్స్‌కి అందించాక చెప్పాడు, "ఆ అమ్మాయిని గదిలో చేర్చి కాస్త చూసుకోండి. మేము రేపుదయం వస్తాం, సరేనా? "

కేసు విషయం పూర్తిగా తెలుసు కాబట్టి, ఏమాత్రం ఆశ్చర్యం ప్రకటించకుండా, అభ్యంతరం చెప్పకుండా "అలాగే" అంది నర్స్.

నిఖిలేష్‌కి వెంటనే చేతులు దులిపేసుకుని వెళ్ళిపోవటం ఇష్టంలేదు. ఆ పసికందును చూసి ఇంకా ఏవయినా అవసరాలున్నాయేమో కనుక్కుని వెళ్ళాలని ఉంది. కాని, రమేష్ అప్పటికే తొందరపడుతున్నాడు. అందుకే అయిష్టంగానయినా రమేష్‌ని అనుసరించక తప్పలేదు అతడికి.

ఇద్దరూ హాస్పిటల్‌నుండి బయటకు నడిచారు.

రమేష్ కారు డ్రైవింగ్ సీట్లో కూర్చుని ఇంజన్ స్టార్ట్ చేస్తూ యథాలాపంగా నిఖిలేష్ ముఖంలోకి చూసి, వెంటనే నవ్వేశాడు. "ఏరా! నీకీ హాస్పిటల్ వదిలి రావాలనిపించడంలేదా? " అని అడిగాడు.

మనసులోని భావం అదే అయినా, జవాబు చెప్పకుండా నవ్వి ఊరకుండిపోయాడు నిఖిలేష్.

"నీకు మరీ అంతగా చూడాలనిపిస్తే, రేపు మళ్ళీ హాస్పిటల్‌కి రావచ్చులేరా. పేషెంట్‌ని డిశ్చార్జ్ చేసేందుకు ఎలాగూ మరో వారంరోజులు టైముంది. అందులోనూ మనం రాకుండా, డబ్బు చెల్లించకుండా ఆమెను గడపదాటి వెళ్ళనివ్వరు కదా? సో! నో ప్రాబ్లమ్"

నిఖిలేష్ సీట్లో వెనక్కు వాలాడు. ఎందుకనో ఆ క్షణం అతడి కనులముందు ప్రసవవేదనతో అల్లాడిపోయిన ఆ అమ్మాయి నిలిచింది.

"ఎవరామె? తను గమనించాడు. ఆమె మెడలో తాళిలేదు. తాళి లేకుండానే కడుపులో బిడ్డ..."

ఏదో అనుమానం అతడి మనసును అతలాకుతలం చేయసాగింది.

అతడి ఆలోచనలతో సంబంధం లేకుండానే కారు ముందుకు పోతూనే ఉంది.

★ ★ ★

కృష్ణమోహన్‌కి టిఫిన్ పెడుతూ వైదేహి చెప్పింది. "బ్యాంక్ తర్వాత మరే పనీ పెట్టుకోకుండా తిన్నగా ఇంటికిరండి. సాయంత్రం నేను హాస్పిటల్‌కి వెళ్ళాలి"

"ఈరోజా? హాస్పిటల్‌కా? ..." కృష్ణమోహన్ భార్యకేసి ఇబ్బందిగా చూశాడు.

"ఏం! ఈరోజు ఏదయినా పని ఉందా? "

"అవును! ఈరోజు మా బ్యాంక్ ఛైర్మన్ సిటీ కొస్తున్నారు. ఆయన గౌరవార్థం బ్యాంక్ యూనియన్ మెంబర్స్‌మి కాకతీయ హోటల్‌లో చిన్నపార్టీ ఇస్తున్నాం. నేను తప్పనిసరిగా ఆ పార్టీకి హాజరుకావాలి"

వైదేహి ముఖంలో అసహనం కదలాడింది. "అంతేలెండి నాపని అనేసరికి మీకూ ఏదో పని ఉంటుంది" అన్నది.

ప్లేట్‌లోని ఇడ్లీ తుంచి నోట్లో పెట్టుకుంటున్న మౌనిక నెమ్మదిగా తలెత్తి వదిన ముఖంలోకి చూసింది. మరేం మాట్లాడలేదు. అదోలా నవ్వింది.

ఆ నవ్వుకే వైదేహి తడబడిపోయింది.

కృష్ణమోహన్ చెల్లెలికేసి, భార్యకేసి ఒకసారి చూపులు మార్చిచూసి, మరేం మాట్లాడకుండా తినడం మొదలుపెట్టాడు.

వైదేహికి తను మాట జారానని అర్థమయిపోయింది. తను అన్నమాట మౌనికను దృష్టిలో ఉంచుకునే అన్న విషయం వారు గ్రహించేశారని ఆమెకూ తెలిసిపోయింది. ఏం మాట్లాడాలో అర్థంకాని దానిలా ఆమె "ఏమ్మా మౌనికా! చట్నీ వెయ్యనా? " అడిగింది చట్నీ గిన్నె అందుకుంటూ.

"వద్దు వదినా" చెప్పింది మౌనిక.

వైదేహి తలాడించి, ఆ తర్వాత నెమ్మదిగా తల దించుకుంది.

అంతలో మౌనిక అంది, "పోనీ సాయంత్రం నేను హాస్పిటల్‌కి రానా వదినా? "

"ఎవరో ఒకరు తోడు కావాలి. ఎవరొస్తేనేం ఇంకా నువ్వొస్తేనే మేలు. డాక్టర్లతో విపులంగా మాట్లాడుతావ్"

"ఓహో! అయితే మా చెల్లెలు రాదనుకునే నువ్వు నన్ను పిలిచావన్నమాట" కృష్ణమోహన్ ఉడుక్కుంటున్నట్టు అన్నాడు.

"అంతేకదా మరి? " అంది మౌనిక వాతావరణాన్ని తేలిక చేయాలన్న ఉద్దేశ్యంతో వాళ్ళ మాటలకు నవ్వుకుంటూనే.

"సరే! సాయంత్రం మనిద్దరం వెళ్దాంలే వదినా" చెప్పింది మౌనిక.



వైదేహిది ఇన్‌ఫెర్టిలిటీ కేసు. స్టేషన్‌కి సమీపంలో ఉన్న హాస్పిటల్‌లోనే ఆమె నెలకోసారి చెకప్‌కి వెళ్తుంటుంది.

మౌనిక బుక్స్ తీసుకుని కాలేజీకి బయలుదేరింది.

బస్టాప్‌కి చేరుకుని బస్సుకోసం ఎదురుచూస్తూ నిలబడితే, అప్పుడే ఆమెకు రెండు రోజుల క్రితం రమేష్ కారు ఆపి తనను ఇన్వాయిట్ చేసిన దృశ్యం కనులముందు కదలాడింది.

తను మెడికల్ కాలేజీలో చేరి మూడేళ్ళయింది. రమేష్, నిఖిలేష్‌లు తనకు క్లాస్‌మేట్స్. అయితే ఈ మూడేళ్ళ పరిచయంలో రమేష్ తనను చూసి పలకరింపుగా నవ్వేవాడేగానీ, ఎప్పుడూ కూడా కనీసం పలకరించేందుకు కూడా సాహసించలేదు. అతడంటే 'మెరిట్ స్టూడెంట్' అన్న గౌరవ భావమూ తనకుంది. మరి అలాంటి రమేష్ ఒక్కసారిగా 'రోడ్‌సైడ్ రోమియో'లా ఎందుకు ప్రవర్తించాడు? ఒకవేళ అతడు చాలా క్యాజువ

ల్‌గా అలా ప్రవర్తించినా తనే అపార్థం చేసుకోవడం లేదుకదా? ! ఆమె మనసులో డైలమా!

అదే సమయంలో ఆమెకు నిఖిలేష్ గుర్తుకు వచ్చాడు. 'అప్పుడప్పుడు చాలా క్యాజువల్‌గా 'హలో' అంటూ విష్ చేసే అతడు మొన్నటికి మొన్న తనతో ఏదో చెప్పాలని ప్రయత్నించాడు. ఇంతకీ అతడు తనకు ఏంచెప్పాలనుకున్నాడు. ఏదో అనుమానం! ఏదేమయినా తనకు మాత్రం నిఖిలేష్ మీద సదభిప్రాయమే ఉంది. ఏంచెప్పదలచుకున్నా నిర్మొహమాటంగా చెప్పే గుణం అతడిలో కనిపిస్తుంది...'

బస్సు హారన్ వినిపించింది. ఆమె ఆలోచనలు తెగిపోయాయి.

అలవాటు ప్రకారమే బస్టాప్‌కి పదిగజాల దూరంలో ఆగింది బస్సు.

మౌనిక పరుగెత్తుకెళ్ళి బస్సెక్కింది.

బస్సు ముందుకు కదిలింది. ఆమె తిరిగి ఆలోచనల్లో పడింది.

'తమ కాలేజీలో చాలామంది ప్రేమికులున్నారు. మరే కోర్సుల్లోనూ లేనంతగా డాక్టర్ కోర్స్‌లోనే యువతీయువకులు మరీ దగ్గరగా మసలుకోవడం జరుగుతుందనుకుంటా, 'కో ఎడ్యుకేషన్ అన్నదేకాదు, కలిసి ప్రాక్టికల్స్ చేయాల్సిరావడం, ఆ స్థాయి చదువన్నాక స్త్రీ, పురుషులు పలకరించుకోవడం, స్నేహం చేయడం తప్పనిపించకపోవడం... అసలు కాలేజీలో అడుగుపెట్టడంతోనే ఎదురయ్యే ర్యాగింగ్ అనుభవం... స్త్రీలలో సహజంగా ఉండే సిగ్గు, బిడియాలను పోగొట్టి కాలేజీలోని కుర్రాళ్ళతో క్యాజువల్‌గా మాట్లాడే స్థితికి వచ్చేలా చేస్తాయి.

అలా మాటలతో మొదలయిన స్నేహం ప్రేమవరకూ వెళ్ళొచ్చు.

అదీగాక మరే ప్రొఫెషనులోనూ లేనివిధంగా డాక్టర్ వృత్తిలో ఉండేవాళ్ళు సాధారణంగా మరో డాక్టర్‌నే పెళ్ళాడుతారు. ఆ ఫీలింగ్ కూడా ప్రేమను పెళ్ళివరకూ నడిచేలా చేస్తుందేమో! అందుకే డాక్టర్ వృత్తిలో ప్రేమవివాహాలు అధికంగా జరుగుతాయి.

ఎంతోమంది అమ్మాయిలు మనసులు పారేసుకునేలా చేయగలిగిన మెడికల్ కాలేజీ, తన మనసును మాత్రం కదిలించలేకపోయింది. అనుభవమైతేగానీ అర్థంకాదని చెప్పబడే ప్రేమ తన మనసులోకి చొరబడలేకపోయింది.

బస్సు ఆగింది. ఆలోచనలకు ఫుల్‌స్టాప్ పడింది.

ఆమె బస్సు దిగి గేటుదాటి కాలేజీలో అడుగుపెట్టింది.

అప్పటివరకూ చెట్టుకింద నిలబడి ఆమె రాకకోసం ఎదురుచూస్తూ ఉన్నారు రమేష్, నిఖిలేష్‌లు.

ఆమెను చూడగానే రమేష్ ముఖంలో సంతోషతరంగం ఎగిసిపడింది.

రమేష్ ఉత్సాహంగా "వచ్చేసిందిరా... మౌనిక వచ్చేసిందిరా" అన్నాడు.

"అబ్బా! నాకు కళ్ళున్నాయిరా బాబూ"

"కాదనలేదు... నీకు కళ్ళున్నాయి. నువ్వు ఆమెను చూశావు. ఆ విషయం కాదనడం లేదు. కాకపోతే నా ఉత్సాహం... అది నన్ను నిలవనీయడంలేదు"

"ఎలాంటి స్థితిలోనయినా తొణక్కుండా ఉండేవాడిని స్థితప్రజ్ఞుడు అంటారట"

"కానీ ప్రేమలో పడినవాడు ఎట్టి పరిస్థితిలోనూ స్థితప్రజ్ఞుడు కాలేడు" అన్నాక అప్పటికే ఆమె తమను దాటుకుని వెళ్ళిపోతుండడం గమనించి ఆత్రుతతో మిత్రుడిని ముందుకు తోస్తూ... "త్వరగా వెళ్ళి ఆమెకు నా ప్రేమగురించి చెప్పు" అన్నాడు రమేష్.

నిఖిలేష్ రమేష్‌కేసి సీరియస్‌గా చూశాడు.

ఆ చూపులు అర్థంకాక రమేష్ "ఏమిత్రా! అలా చూస్తున్నావ్? " అనడిగాడు.

"హడావిడిగా ఆమె దగ్గరకెళ్ళి 'హలో మిస్' అంటూ మొదలెట్టేసి చెప్పడానికి ఇదేమయినా టెలిగ్రామ్‌లో మేటరా? ఆ...

ప్రేమసందేశం! ప్రేమ విషయంలో హడావిడి పనికిరాదు బ్రదర్! అవతలి వ్యక్తి ప్రశాంతంగా ఉంది అనుకున్నప్పుడే వెళ్ళి, మాటల్లో పెట్టి, ఆ తర్వాత అసలు విషయం చెప్పాలి. తెలిసిందా? "

"అంటే ఇప్పుడు..."

"అసలే క్లాస్‌కి టైమయిందని మౌనిక హడావిడిగా వెళ్తోంది. ఇప్పుడు ఆపడం ఏమంత బాగోదు. క్లాసలన్నీ అయిపోయాక తీరిగ్గా వెంబడించి, విషయం చెపుతాను. సరేనా? ..."

రమేష్ ముఖంలో కాసింత డిజప్పాయింట్‌మెంట్ కనిపించింది.

"పద" అన్నాడు నిఖిలేష్. అయిష్టంగానే అతడివెంట నడిచాడు రమేష్.

అయితే క్లాసులన్నీ అయిపోయాక మౌనిక వాళ్ళకు ఒంటరిగా దొరకలేదు. ఆమె ప్రొఫెసర్‌ని అనుసరిస్తూ ఆయనతో మాట్లాడుతూ నడవసాగింది. పక్కనే ప్రొఫెసర్ ఉండడంతో ఆమెను పిలవడం నిఖిలేష్‌కి ఇబ్బందిగా అనిపించింది. అందులోనూ అసలే 'ప్రేమసందేశం'. తనేమో రమేష్ రాయబారి. ఏమాత్రం తొందరపడ్డా తన చెంప వాచిపోవడం ఖాయం. అందుకే ఈరోజుకిక లాభంలేదనుకుని అతడు వదిలేశాడు.

"అదేంట్రా! మౌనిక అలా ప్రొఫెసర్ వెంట వెళ్ళిపోతోంది" నిఖిలేష్ ఆగిపోవడం చూసి ఏడుపుగొంతుతో అన్నాడు రమేష్.

"లెసన్‌లో తనకేదో డౌట్ వచ్చినట్టుంది. అందుకే ఆయనవెంట నడుస్తూ డౌట్ క్లియర్ చేసుకుంటోంది సో! ఈ రోజుకి మనం మన ప్రయత్నంలో మరోసారి విఫలమయ్యాం. ఇక రేపు ప్రయత్నించాల్సిందే..." చెప్పాడు నిఖిలేష్.

"ఛా! ఇలా అవుతోందేమిట్రా? "

"మూడు రోజులకే కొంపలు మునిగిపోయినట్టు మరీ అలా ఫోజు పెట్టకురా. మూడేళ్ళపాటు మూగప్రేమలో బతికినవాడివి. మూడురోజులలోనే ఆలస్యమయిపోయిందేంట్రా? "

"ఆలశ్యమని కాదుగానీ..." నసిగాడు రమేష్.

"మౌనిక విషయం పక్కనపెట్టు. ఆ విషయం రేపు చూద్దాం... ఈరోజు సాయంత్రం హాస్పిటల్‌కి వస్తున్నావా లేదా? "

"ఏదీ, ఆ రోడ్‌సైడ్ డెలివరీ కాబోయిన కేసుని చూడడానికా? " రమేష్ ముఖంలో అసహనం కొట్టొచ్చినట్టు కనిపించింది.

"నేను రాను బాబో... అంతగా అవసరమనుకుంటే కారు తీసుకెళ్ళు. నన్ను రమ్మని మాత్రం బలవంతపెట్టకు"

నిఖిలేష్ భుజాలెగరేశాడు. "ఓ.కే. ఇష్టం లేకపోతే వద్దులే. నేనే వెళ్తాను"

"మరి కారు? "

"అక్కర్లేదు, బస్సులో వెళ్తాను"

"డబ్బులేమయినా కావాలా? "

"అవసరపడుతుందనుకుంటే రేపు అడిగి తీసుకుంటాలే"

★ ★ ★

నిఖిలేష్ హాస్పిటల్‌లో ప్రవేశించడంతోనే రిసెప్షనిస్ట్ మొదట ఆశ్చర్యపోయినట్టు చూసి, వెంటనే నవ్వేసింది.

ఆమె అలా ఆశ్చర్యపోవడానికి కారణం నిఖిలేష్‌కి అర్థమయింది. ఒక రోడ్‌సైడ్ కేసుని హాస్పిటల్‌లో చేర్చి రెండువేలు చెల్లించడమే చాలా గొప్ప విషయం. అలాంటిది మర్నాడు అతడు తిరిగి రావడం ఆశ్చర్యకరమైన విషయమేకదా!

రిసెప్షనిస్ట్ నవ్వుతూనే అంది, "ఏంటి సార్! ఇప్పుడా రావడం? "

"వాట్... వాట్ హేపెన్డ్? " అడిగాడు అతడు కాసింత ఆదుర్దాగా.

"ఏమీ కాలేదనుకోండి. ఉదయం మీరు రాకపోయేసరికి మా డాక్టర్ కాస్త కంగారుపడింది. నిన్న మీరు జేబులో ఉన్నంతవరకూ ఇచ్చేసి, ఆ పేషెంట్‌ని వదిలించేసుకు

న్నారేమోనని ఆమె అనుమానం. మీరీరోజు రాకుండా ఉండి ఉంటే, ఆమె పేషెంట్‌ని రేపే డిశ్చార్జ్ చేసి పంపేసి ఉండేది"

అది తనూహించిన విషయమే. అయినా మనసులో బాధ సుడులు తిరిగింది. అయితే అంతలోనే అతడు తనకుతానే సర్ది చెప్పుకున్నాడు. 'ఇందులో ఆ డాక్టర్ తప్పేం లేదనే అనుకోవాలి. వ్యాపారం అన్నాక లాభనష్టాల గురించి అంచనావేయాలి. అన్నిరకాల పరిస్థితులను బేరీజు వేసుకోవాలి. లాభం ఉండదనుకుంటే ఎదుటివ్యక్తి స్థితి, పరిస్థితి ఆలోచించకుండానే బయటకు గెంటేయగలగాలి. ప్రస్తుతం డాక్టర్లు వైద్య సేవ చేయట్లేదు. వైద్య వ్యాపారం చేస్తున్నారు. ఇది నిజం.

ఒకనాటి పదాలు మరికొద్ది కాలానికి కొత్త రూపు సంతరించుకుంటాయేమో! నిన్నటివరకూ వైద్యసేవలు, విద్యాసేవ అనేవారు. కానీ ఇప్పుడు వాటిని వైద్యవ్యాపారం, విద్యా వ్యాపారం అని తీరాలి. కాలంతో వచ్చిన కొత్త మార్పు అది.

నిఖిలేష్ ఆలోచనల్లోంచి తేరుకుని నెమ్మదిగా కారిడార్‌లో నడవసాగాడు.

పదడుగులేశాక అనుమానం వచ్చింది. అతడు తనలోతానే నవ్వుకున్నాడు. వెనుకకు నడిచి రిసెప్షనిస్ట్ దగ్గరకొచ్చి అడిగాడు. "ఆమె ఏ రూమ్‌లో ఉంది? "

"రూమ్ నెంబర్ నైన్‌లో సార్!"

అతడు రూమ్ నెంబర్ నైన్ వైపు నడిచాడు. ఒక్కోగది నెంబర్ చూసుకుంటూ వెళ్ళి ఆ రూమ్‌ముందు నిలబడ్డాక... అప్రయత్నంగా తలుపుమీదకు చేరిన చెయ్యి హఠాత్తుగా కదలడం ఆగిపోయింది. ఏదో తెలియని సందిగ్ధం. ఇప్పుడు... ఇప్పుడు ఆ గదిలోకెళ్తే తననుతాను ఏమని పరిచయం చేసుకోవాలి? ఆ గదిలో తనకు ఎలాంటి పరిస్థితి ఎదురుకాబోతోంది? ఆ అనుమానం అప్పుడే కలిగింది.

'ఏదేమయినా తను లోపలికి వెళ్ళక తప్పదుకదా' అనుకుని అతడు తలుపు తోసుకుని లోపలికి నడిచాడు.

బెడ్‌మీద పడుకుని పక్కనే ఉన్న బిడ్డకేసి చూసుకుంటున్న ఆమె తలుపు దగ్గర చప్పుడు కావడంతో తల తిప్పి చూసింది.

ఎదురుగా అతడు!

అతడెవరో ఆమెకు తెలియదు. అందుకే మొదట అనుమానంగా చూసింది. అంతలోనే మరేదో గుర్తుకువచ్చినట్టు కనుబొమలు ముడివేసి ప్రశ్నార్థకంగా అతడికేసే చూడసాగింది.

"నమస్తే! నా పేరు నిఖిలేష్..." అతడు తలుపు దగ్గరే ఆగిపోయి చేతులు రెండూ జోడించి నమస్కరిస్తూ చెప్పాడు. ఆ సమయంలో మరేవిధంగా పరిచయం చేసుకోవాలో అతడికి అర్థంకాలేదు.

ఆ క్షణం ఆమె కన్నుల్లో మెరుపు. ఒక అపురూప దృశ్యాన్ని అద్భుతంగా చూస్తున్నట్టు ఆమె తదేకంగా అతడినే చూడసాగింది.

ఆమె నిర్నిమేషంగా తననే చూస్తుండడంతో అతడు తడబడ్డాడు. తనెవరో ఆమెకు తెలియకే అలా చూస్తోందేమో అనుకుని, "నిన్న సాయంత్రం మిమ్మల్ని ఈ హాస్పిటల్‌కి తీసుకువచ్చింది నేనే" అన్నాడు.

అప్పటికిగానీ ఆమె ఈ లోకంలోకి రాలేదు. "ఆ... ఆ... తెలుసు" అంది.

అతడు వెంటనే అడిగాడు "ఎలా తెలుసు? "

"నాకు డెలివరీ అయ్యి, కాస్త ప్రశాంతత చిక్కాక నేను నా బిడ్డను చూడలేదు. నన్ను ఈ హాస్పిటల్‌కి చేర్చిన పుణ్యాత్ముడి పేరేమిటని? డాక్టర్‌ని అడిగాను. డాక్టర్ మీ పేరు చెప్పింది"

నిఖిలేష్‌కి కొద్దిగా స్థిమితం చిక్కింది.

అతడు భుజాలెగరేశాడు. "దెన్ నో ప్రాబ్లమ్" అంటూ బెడ్ దగ్గరగా నడిచాడు.

లోకం అంటే ఏమిటో తెలియని పసి

వాడు. తల్లిపక్కనే పడుకుని గాఢనిద్రలో మునిగిపోయి ఉన్నాడు. అయితే గత జన్మ స్మృతులేవో గుర్తుకొచ్చాయేమో వాడు నిద్ర లోనే నవ్వుకుంటున్నాడు.

మనిషికి ఏదయినా జోక్ వినిపించిన ప్పుడో లేదా నవ్వించదగిన దృశ్యం కనిపిం చినపుడో నవ్వడం సహజం. మరి అలాంటి దేదీ వినిపించకుండా కనిపించకుండా పురిటి పాపలు ఎందుకు నవ్వుతారు?

అందుకు గత జన్మస్మృతులే కారణం అని చెపుతారు వేదాంతులు.

ఒక్కొక్కసారి అది నిజమేనేమోననిపి స్తుంది. ఎందుకంటే ఏ కారణం లేకుండా ఎవ్వరూ నవ్వలేరు కాబట్టి.

నిఖిలేష్ బెడ్‌పక్కనే నిలబడి పిల్లవాడినే ఆప్యాయంగా చూస్తుంటే, ఆమె బెడ్‌మీద నుండి లేచే ప్రయత్నం చేసింది. అది గమ నించిన అతడు, "వద్దు... మీరు లేవద్దు. నేనిలా టేబుల్ మీద కూర్చుంటాను" అంటూ పక్కనే ఉన్న టేబుల్ లాక్కుని కూర్చున్నాడు.

ఆమె తిరిగి బెడ్‌మీద ఎప్పటిలానే పడు కుంది. అయితే చూపులు అతడిమీదే నిలిచి ఉన్నాయి.

ఇద్దరిమధ్యా నిశ్శబ్దం!

ఎలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో ఆమెకు అర్థంకావడంలేదు. అతడు తనకు చేసింది మామూలు సహాయంకాదు. ఒకవిధంగా తనకు ప్రాణదాత మాత్రమేకాదు, తన బిడ్డ ప్రాణాలు నిలిపిన వ్యక్తి అతడే! అలాంటి వ్యక్తికి కేవలం రెండక్షరాల 'థ్యాంక్స్' అన్న పదం చెప్పేసి, అతడి రుణం తను తీర్చుకో లేనిదని ఆమెకు తెలుసు. అందుకే ఏం మాట్లాడాలో తెలియక, అతడి రుణం తీర్చు కునే మార్గం తోచక ఆమె మౌనంగా ఉండి పోయింది.

అతడి పరిస్థితి కూడా ఆమె పరిస్థితిలానే ఉంది. ఆమెను పరామర్శించాలంటే ఎలా మాట్లాడాలో అతడికి అర్థంకావడంలేదు.

కేవలం పరామర్శించడానికేకాదు, మరెన్నో వివరాలు ఆమెను అడిగి తెలుసు కోవాలని ఉంది. ఆమె ఎవరు? ఎక్కడి నుండి వచ్చింది? ఓ ఉన్నత కుటుంబంలో నుంచి వచ్చినట్టు కనిపిస్తున్న ఆమె, రోడ్డుప క్కన ప్రసవవేదన పడడానికి కారణం ఏమిటి? ఎన్నో అనుమానాలు, మరెన్నో ప్రశ్నలూ... కానీ అడిగేదెలా?

కొద్దిసేపటికి ఎదుటివ్యక్తి మనసులో నుండి రాలేక సతమతమవుతున్న ప్రశ్నలూ, అనుమానాలు చదివినట్టు చివరికి ఆమె నీరసంగా నవ్వింది.

ఆమె నవ్వడంతో అతడూ నవ్వక తప్పద న్నట్టుగా నవ్వాడు.

అతడి నవ్వు చూస్తూ ఆమె చెప్పింది, "నా పేరు భారతి"

'అలాగా' అన్నట్టుగా అతడు తలాడిం చాడు. మనసులో మాత్రం 'కనీసం ఈవిడ పేరయినా తెలిసింది' అని తృప్తిపడ్డాడు.

"మాది విజయవాడకు దగ్గరలో ఉన్న చిన్న పల్లె"

ఆమె తన కథ వినిపించబోతోందని అర్థ మయిపోవడంతో అతడు క్యూరియాసిటీగా ముందుకు వంగాడు.

భారతి కంటిన్యూ చేసింది, "మా పల్లెలో మా నాన్న మోతుబరి రైతు. యాభై ఎక రాల మాగాణి. పాతిక ఎకరాల నిమ్మతోట మాకుంది. నేను తనకు ఏకైక సంతానం కావడంతో నన్ను చాలా గారాబంగా పెంచారు మా అమ్మానాన్నలు. నన్ను పెద్ద చదువులు చదివించాలని వాళ్ళ కోరిక. అందుకే విజయవాడలోని మా బంధువుల ఇంట్లో నన్ను ఉంచి కాలేజీ చదువులు చది వించసాగారు. మాది కో ఎడ్యుకేషన్ కాలేజీ. నా క్లాస్‌మేట్ ఓ కుర్రాడితో నాకు పరిచయమైంది. ఆ పరిచయం సినిమాలు, షికార్లతో సాగి చివరికి ప్రేమ అనే మత్తు లోకి నన్ను దించింది. దాంతో నేను ఫలానా కుర్రాడినే పెళ్ళాడతానని మా



నాన్నకు చెప్పాను. నేనలా మాట్లాడడంతో నాన్నగారు మొదట ఖంగుతిని, ఆ తర్వాత ఉగ్రనరసింహుడై 'మన కులంకాదు, మన ఆస్తి, అంతస్థులకు తగని ఆ కుర్రాడితో పెళ్ళికి నేనొప్పుకోను' అంటూ ఎగిరెగిరి పడసాగారు. ఈ విషయం ఆ కుర్రాడికి చేరవేశాను. పెద్దలు ఒప్పుకోనప్పుడు పారిపోవడమే ఉత్తమ మార్గమని ఆ ప్రేమికుడు అన్నాడు. అది నిజమని నేనూ నమ్మాను. కాసిన్ని బట్టలూ, నగలూ తీసుకుని సిటీ కొచ్చి ఆరు నెలలపాటు కాపురం చేశాం. ఈలోపు అతడి ఉద్యోగాన్వేషణ ఒక కొలిక్కి రాలేదు. అప్పటికి అతడికి తనెంత అసమర్థుడో తెలిసి వచ్చిందనుకుంటా. అదే సమయంలో నామీద మోజు కూడా తీరిపోయింది. అప్పటికి నాకు ఐదో నెల అని తెలిసి, భవిష్యత్తుపట్ల భయమూ కలిగినట్టుంది. ఇటు నా వంటిమీదున్న నగలు కరిగిపోయాయి. అందుకే ఓ అర్థరాత్రి అతడు నన్ను వదిలి ఎటో వెళ్ళిపోయాడు" అలసట తీర్చుకోవడంకోసమేనన్నట్టు ఆగిందామె.



'చాలా మామూలు ప్రేమకథ. చాలాచోట్ల టీనేజ్‌లో అమ్మాయిలు ఇలా మోసపో తూనే ఉంటారు. ప్రేమ అనే మత్తు దిగిపో యాకే వాళ్ళకి జీవితం అంటే ఏమిటో అర్ధ మవుతుంది. భవిష్యత్ గురించి ఆలోచన మొదలవుతుంది' మనసులోనే అనుకు న్నాడు అతను. ఆమెమీద జాలి రెట్టింప యింది.

అలసట తగ్గినట్టు ఆమె తిరిగి మొదలె ట్టింది. "అతడు వెళ్ళిపోయాక ఇటు కన్న వాళ్ళ దగ్గరకూ వెళ్ళలేక, ఈ మహానగ రంలో ఒంటరిగా ఉండలేక చాలా కష్టాలు పడ్డాను. రూమ్‌లో ఉన్న ఒక్కో వస్తువూ అమ్ముకుని ఇప్పటివరకూ ఎలాగోలా గడి పాను. అయితే రూమ్ అద్దెకోసం మరోవైపు ఒత్తిడి ఎక్కువయింది. నిండు చూలాలుగా ఉన్న నన్ను చూసే దిక్కు ఎవ్వరూలేరని అర్ధమయిపోయింది. అందుకే ఏమయితే అయింది అనుకుని నన్ను కన్నవాళ్ళ దగ్గ రకు చేరుకోవాలనుకున్నాను. రైలు ఎక్కేస్తే ఎలాగోలా మా ఊరు వెళ్ళిపోవచ్చని నా ఆశ. కానీ ఆ ఆశ కూడా అడియాశ అయింది. రైల్వేస్టేషన్ సమీపించేసరికి నాకు నొప్పులు మొదలయ్యాయి"

ఆ తర్వాత జరిగిన కథ అతడికి తెలి సిందే.

ఇక ఆమెనుండి తెలుసుకోవాల్సిన వివ రాలేంలేవు. మాట్లాడుకోవసిన మాటలూ లేవు.

అందుకే నిశ్శబ్దం! ఇద్దరిమధ్యా గాఢమైన నిశ్శబ్దం.

అప్పుడు గుర్తొచ్చింది అతడికి. "మీరు... మీరు ఉదయంనుండి ఏమైనా తిన్నారా?"

"హాస్పిటల్ వాళ్ళిచ్చిన పాలు తాగాను"

అతడికి బాధనిపించింది. వెంటనే సిగ్గే సింది. ఒక అమ్మాయి ఆపదలో చిక్కుకుని హాస్పిటల్ బెడ్‌మీద ఉంటే ఆమె బాధ్యత తీసుకున్న తను ఆమెకు కనీసం ఆహారం కూడా అందించకుండా... తన మతిమరు పుకు తననుతానే తిట్టుకున్నాడు అతడు.

"ఒన్ మినిట్" చప్పున లేచి డోర్ తెరు చుకుని బయటకు నడిచాడు.

హాస్పిటల్ బయటకు నడిచి, అక్కడున్న మెడికల్ షాపులో బ్రెడ్, పక్కనే ఉన్న పళ్ళ దుకాణంలో నాలుగు రకాల పళ్ళు తీసుకు న్నాడు.

వెనుదిరిగి నడుస్తుంటే అప్పుడే హాస్పి టల్ ముందు ఆటో ఆగింది. ఆటోలోనుండి మౌనిక, అదే వయసున్న మరో స్త్రీ దిగారు.

వాళ్ళను చూడడంతోనే అతడి భృకుటి ముడివడింది. అదే సమయంలో మౌనిక కూడా అతడిని చూసింది. ఆమె కళ్ళు ప్రశ్నార్ధకంగా అతడిని చూశాయి. నిఖిలేష్ సిటీలో ఒంటరిగా, రూమ్ తీసుకుని ఉంటు న్నాడన్న విషయం ఆమెకు తెలుసు. మరి అతడు హాస్పిటల్ దగ్గర...?

"హలో మౌనికగారూ" అతడే వాళ్ళ దగ్గ రగా నడిచాడు.

"హలో" అందామె. పక్కనే ఉన్న వైదేహి వైపు తిరిగి చెప్పింది. "ఈయన నిఖిలేష్, నా క్లాస్‌మేట్" అతడితో అన్నది "మా వది నగారు. తనకు హాస్పిటల్ చెకప్ ఉంటే వెంట వచ్చాను"

అతడు వైదేహిని చూసి పలకరింపుగా నవ్వాడు.

"మరి మీరు ఇక్కడా?..." ఆమె అడి గింది.

ఏం చెప్పాలో, అతడికి వెంటనే అర్థంకా లేదు. ఒక అమ్మాయి రోడ్డుపక్క ప్రసవవే దన పడుతుంటే, తీసుకొచ్చి హాస్పిటల్‌లో చేర్పించాననీ, ఇప్పుడు ఆమె సేవలోనే ఈ బ్రెడ్, పళ్ళు తీసుకువెళుతున్నానని చెబితే ఆమె నమ్ముతుందా? లేక మరోలా ఆలో చించి అనుమానిస్తుందా?

అర్థంచేసుకున్నా, అనుమానించినా తన కొచ్చే నష్టం ఏమీలేదు. కాకపోతే రేపు రమేష్ గురించి ఆమెకు రికమెండ్ చేసేట ప్పుడు ఆమె దృష్టిలో తను చెడ్డవాడిగా కని

పించకూడదు.

నిఖిలేష్ అలాంటి డైలమాలో కొట్టుమిట్టా డుతుంటే, ఆమె నవ్వుతూ ప్రశ్నించింది. "జవాబు చెప్పరేంటండీ..."

"అది... అది..." అన్నాక ఏమయితే అది అవుతుందనుకుని అతడు భారతి గురించి క్లుప్తంగా ఆమెకు వివరించాడు.

అతడి మాటలు వినడంతోనే ఆమె కళ్ళింత చేసుకుని అతడికేసి చూసింది.

నిఖిలేష్‌కి ఆమె చూపులు అర్థంకాలేదు. 'కొంపదీసి ఈమె... ఈమె నన్ను అనుమా నంగా చూస్తోందా ఏంటి? ' అనుకున్నాడు మనసులో. 'ఒకవేళ ఆమె తనను అనుమా నిస్తే అది కచ్చితంగా పెద్ద ప్రమాదమే'.

అంతలోనే ఆమె దీర్ఘంగా నిశ్వసించింది. "వాట్ పిటీ... ఆ అమ్మాయికి అంత చిన్న వయసులో ఎంత కష్టం వచ్చిందో కదా? "

ఆ మాటలు వినడంతోనే అతడికి కాస్త ధైర్యం చిక్కింది. అంటే ఆమె తనను అను మానించలేదు. తను చెప్పిన విషయం విని షాక్ తిన్నట్లు కొద్దిక్షణాలు ఉండిపోయింది అంతే.

అప్పుడే "ఈ కాలంలో ఆడపిల్లలు ప్రేమ పేరుతో ఎంతగా మోసపోతున్నారోకదా? " స్వగతంగా అనుకుంటున్నట్లు పైకే అనే సింది వైదేహి.

నిఖిలేష్‌కి ఆమాట కాస్త ఇబ్బందిగా అని పించింది. అసలే తను రమేష్ రాయబారిగా మౌనికకు అతడి ప్రేమ గురించి చెప్పాలనే ప్రయత్నంలో ఉంటే, ఇప్పుడీ విఫలమైన ప్రేమ కాస్తా ఆమెను రకరకాల ఆలోచన లతో వెనుకడుగు వేసేలా చేయదుకదా" ఆ అనుమానమే అతడిలో కలిగింది.

"పదండి" అన్నాడు నిఖిలేష్.

ముగ్గురూ ముందుకు నడుస్తుంటే మౌనిక అతడిని చూస్తూ, "అయితే మీరు యం. బి. బి. ఎస్. తోపాటు యస్. యస్. డిగ్రీ కూడా చేస్తున్నారన్నమాట" అంది నవ్వుతూ.

అతడు "యస్. యస్. డిగ్రీనా? " అంటూ అర్థంకానట్టు ముఖం పెట్టాడు.

"యస్. యస్. అంటే సోషల్ సర్వీస్"

మౌనిక, నిఖిలేష్‌లతోపాటు వైదేహి కూడా నవ్వింది.

ముగ్గురూ కొద్దిదూరం నడిచాక, వైదేహి ఓ గదిముందు ఆగింది. నిఖిలేష్ కూడా ఆగిపోయి, తలెత్తి చూశాడు. 'కన్సల్టింగ్ రూమ్' అని రాసి ఉన్న బోర్డు ఆ గది ముందు కనిపించింది.

"ఓ. కే... మనం మళ్ళీ కలుద్దాం"

అతడు ముందుకు నడవబోతుంటే మౌనిక అడిగింది, "మీరిప్పుడు ఏ రూమ్‌లో ఉంటారు? "

"రూమ్ నెంబర్ నైన్" జవాబిచ్చాక చెప్పాడు. "డాక్టర్ చెకప్ అయ్యాక ఆ రూమ్‌కి రండి"

"అలాగే" ఆమె తలాడించింది.

వాళ్ళిద్దరూ కన్సల్టింగ్ రూమ్‌లోకెళ్ళారు.

నిఖిలేష్ రూమ్ నంబర్ నైన్‌వైపు నడి చాడు.

అతడు డోర్ తెరుచుకుని అడుగుపెట్టే సమయానికి, భారతి పసివాడికి స్తన్యం ఇస్తోంది. అతడిని చూసిన ఆమె బిడ్డ ముఖానికి కొంగు అడ్డుగా వేసింది.

అతడు ఆమె ముందుకు నడిచి, తెచ్చినవి బెడ్‌మీద పెట్టి చెప్పాడు.

"ఇవిగోండి... పళ్ళు... బ్రెడ్... ముందు కాసింత ఆహారం తీసుకోండి. మీకు ఎప్పుడు ఏం అవసరం పడినా అందించ మని డ్యూటీ నర్స్‌కి చెప్పి వెళ్తాను"

ఆమె నెమ్మదిగా తలాడించింది. కొద్దిక్ష ణాల తర్వాత పెదవి విప్పింది. "మిమ్మల్ని చూశాకే మనుషుల్లో మానవత్వం మిగిలి ఉందని నాకు నమ్మకం కలిగింది. లేకపోతే రోడ్డుపక్కన ఓ జంతువుకన్నా హీనంగా సిగ్గుతో చితికిపోతూ ప్రసవించవలసిన నేను, ఈరోజు ఇలా ఇంకా మానాభిమా నాలు కాపాడుకుంటూ బతికి ఉన్నానంటే

కారణం మీరే" ఆమె గొంతు జీరబోయింది.

అతడు కొద్దిగా ఇబ్బందిపడ్డాడు.

"ఆ సమయంలో మీరు రాకపోయి ఉంటే నేనేమయిపోయి ఉండేదాన్నో తలచుకోవడానికే భయంగా ఉంది. నాకింత మేలుచేసిన మీ రుణం ఎలా తీర్చుకోవాలో నాకర్థంకావడంలేదు"

ఆమెను వదిలేస్తే అవే మాటలు కంటిన్యూ చేస్తుందేమోననిపించింది అతడికి. టాపిక్ డైవర్ట్ చేయడం ఎలా అని ఆలోచిస్తుంటే చప్పున మౌనిక గుర్తుకొచ్చింది.

"హలో భారతిగారూ! అన్నట్టు చెప్పడం మర్చిపోయాను... ఇప్పుడే పళ్ళు తెచ్చేందుకు బయటకు వెళ్ళానుకదూ? అప్పుడు, అక్కడ నా క్లాస్‌మేట్ మౌనిక ఎదురుపడింది. వాళ్ళ వదినగారి చెకప్‌కోసం వెంట వచ్చిందట. మిమ్మల్ని చూసేందుకు తనూ వస్తానంది"

"మౌనిక? మీ క్లాస్‌మేట్? ..." అంటూ ఆగి అప్పుడే గుర్తొచ్చినట్టు "ఆ... అన్నట్టు అడగడమే మర్చిపోయాను. మీరేం చేస్తుంటారు? " ప్రశ్నించిందామె.

"నేను మెడికోని" జవాబిచ్చాడు అతడు.

ఆమె నిలువుగా తలాడించింది.

అలా చేయడంతో ఆమె ముంగురులు అందంగా కదలడం అతడు గమనించాడు.

"మీ అమ్మానాన్నా...? " అడిగిందామె.

ఆమె తన వివరాలు తెలుసుకోవాలనుకుంటున్నదని అతడికి అర్థమయింది. అందుకే అతడు తన వివరాలు ఆమెకు చెప్పడం మొదలుపెట్టాడు. 'తన చిన్న వయసులోనే తండ్రి మరణించడం, ఉన్న నాలుగెకరాలూ కౌలుకివ్వకుండా తల్లి వ్యవసాయ బాధ్యతలు చేపట్టి ఇంటిబరువు నెత్తికెత్తుకోవడం, ఆమె తనను డాక్టర్‌ని చేయాలనుకోవడం, ఆమె కోరిక తెలుసుకున్న తను కష్టపడి మెడికల్ సీటు తెచ్చుకోవడమూ...

అతడు తన వివరాలు చెప్పడం పూర్తిచేసేసరికి, డోర్ అవతలనుండి మౌనిక గొంతు వినిపించింది. "మే ఐ కమిన్? "

"అదిగో మౌనిక వచ్చేసింది..." అతడు డోర్‌వైపు తిరిగి, "యస్, కమిన్" అన్నాడు.

మౌనిక, వైదేహి లోపలికొచ్చారు.

"రండి... రండి..." అన్నాక అతడికి మరేం మాట్లాడాలో తెలియలేదు.

అతడి పరిస్థితి అర్థమయినట్టు మౌనిక చొరవచూపింది. భారతిని చూస్తూ

"నమస్తే" అంది.

భారతి రెండు చేతులూ జోడించి "నమస్తే" అంటూ బెడ్‌మీదనే లేచి కూర్చోబోయింది.

అది గమనించినట్టు మౌనిక "వద్దొద్దు. మీరు కదలకండి" చెపుతూ ఆమె దగ్గరగా వెళ్ళింది.

భారతి తన ప్రయత్నం విరమించుకుంది. "ఇప్పుడే... ఇప్పుడే మీ గురించి ఆయన చెప్పారు..."

"ఆఁ! మా వదినగారిని డాక్టర్‌కి చూపించేందుకు వచ్చాం. హాస్పిటల్ బయట నిఖిలేష్‌గారు కనిపించి మీ గురించి చెప్పారు"

మౌనిక మాటలు పూర్తికాలేదు. వైదేహి అందుకుంది, "ఏమిటోనమ్మా! ఈ లోకంలో ఎవరిని నమ్మాలో, ఎవరిని నమ్మకూడదో అర్థం కావడంలేదు. ఆడది ఏ కుర్రాడినయినా నమ్ముకుని ఇల్లు విడిచివస్తే పరిస్థితి ఇలా దారుణంగా అయిపోతోంది. ప్చ్! ఈ కాలంలో ఆడపిల్ల తన జాగ్రత్తలో తను ఉండడం మంచిదనిపిస్తోంది నిన్ను చూస్తుంటే..."

"వదినా" కాస్త కసురుకున్నట్టుగానే అంది మౌనిక.

వైదేహి చప్పున నోరు మూసేసింది.

మౌనిక బెడ్ దగ్గరగా నడిచింది. పసివాడి ముఖాన్ని చేత్తో నిమురుతూ "బాబు ముద్దుగా ఉన్నాడు" నిఖిలేష్‌తో చెప్పింది.

నిఖిలేష్ నవ్వి ఊరుకున్నాడు. భారతి

మాత్రం నవ్వలేదు.

కొద్ది క్షణాలు మౌనంగా ఉన్నాక మౌనిక కాస్త సంశయంగానే పలికింది. "మీ గురించి నిఖిలేష్‌గారు కొంతవరకూ చెప్పారు. మీ పరిస్థితి విని మేం చాలా బాధపడ్డాము..."

భారతి మౌనంగా ఉంది.

"...మరి హాస్పిటల్ నుండి డిశ్చార్జ్ అయ్యాక ఎక్కడికెళ్ళాలనుకుంటున్నారు? ... ఏంచెయ్యాలనుకుంటున్నారు? ..."

భారతి తలెత్తి మౌనిక కళ్ళలోకి ప్రశ్నార్థకంగా చూసింది.

"... ఉచిత సలహాలివ్వడం తప్పే అయినా ఇలాంటి స్థితిలో మీకేం తోచదు. మీరు సరయిన నిర్ణయం తీసుకోలేరన్న ఉద్దేశంతో చెపుతున్నాను. మీరు మీ అమ్మా నాన్నల దగ్గరకు చేరుకోవడం మంచిది. ఎందుకంటే వాళ్ళకు మీ మీద ఎంతకోపం ఉన్నా, దిక్కుతోచక ఇంటికి చేరుకున్న ఆడపిల్లను, 'నీకు దిక్కున్నచోటుకి వెళ్ళు' అని చెప్పేంత క్రూరమనస్తత్వం తల్లిదండ్రులనే వాళ్లకు ఉండదు. ఎంతయినా నువ్వు వాళ్ళ రక్తం పంచుకుపుట్టావ్. పెంచి పెద్దచేసిన ప్రేమాభిమానాలు వాళ్ళకుంటాయి. కష్టకాలంలో ఇంటికి వచ్చిన కూతుర్ని చూసి, జరిగినవన్నీ మర్చిపోయి 'బిడ్డా' అంటూ అక్కున చేర్చుకుంటారు. అది నిజం..."

భారతి ఈసారి కనుబొమలు ముడివేసి, అయోమయంగా మౌనిక కేసి చూడసాగింది.

మౌనిక అది గమనించి నవ్వి చెప్పింది. "నేను ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే మీరు మీ అమ్మా నాన్నల దగ్గరకు చేరుకోవడం ఉత్తమం. అయినా ఒకవేళ మనసులో అలా చేయడం ఇష్టం లేకపోతే అక్కడికి వెళ్ళలేని పరిస్థితులలో మీరు ఉంటే ఆ విషయం నాకు చెపితే నేను నాకు తెలిసిన దారిలో మీకు సహాయపడాలనే ఉద్దేశం. అంతే..."

భారతి అడగలేదుగానీ నిఖిలేష్ అడిగాడు, "మీరు ఈమెకు సహాయపడగలరా? ...ఎలా? "

"మా బంధువుల్లో ఒకావిడ అదేదో మహిళామండలికి ప్రెసిడెంట్. వాళ్ళ మహిళా మండలిలో సేవా కార్యక్రమాలంటూ ఇలాంటివాళ్ళకు షెల్టర్ ఇచ్చి ఏదో వృత్తిపని నేర్పించి వాళ్ళ కాళ్లమీదవాళ్ళు నిలబడేలా ట్రైనింగ్ ఇస్తారు. భారతిగారు ఇష్టపడితే నేను ఆవిడతో మాట్లాడుతాను"

నిఖిలేష్‌తోపాటు మౌనిక, వైదేహిలు కూడా భారతి ముఖంలోకి చూశారు.

భారతి తల దించుకుంది. ఆమె ముఖంలో ఏదో తెలియని ఇబ్బంది స్పష్టంగా కనిపిస్తోంది.

ఆమె ఇబ్బందిని ముందుగా గమనించిన వాడు నిఖిలేష్, "చూడండి! మీరు జవాబు ఇప్పుడే చెప్పవలసిన పనిలేదు. మీరు హాస్పిటల్ నుండి డిశ్చార్జ్ అయ్యేందుకు మరో రెండు మూడు రోజులు టైముందనుకుంటా. ఆలోపు మీరు మీ ఇష్టాయిష్టాలు మౌనికగారికి చెబితే చాలు"

అప్పుడే మౌనిక కూడా "అవునవును, మీరు ఏ విషయం ఇప్పుడే చెప్పనవసరం లేదు. కాస్త ఆలోచించుకునే చెప్పండి" అంది.

భారతి తలాడించింది. 'అలాగే' అన్నట్టు.

మరో రెండు నిముషాలు నిలబడ్డాక మౌనిక "వెళ్ళొస్తాను" అంటూ భారతీ నిఖిలేష్‌లకేసి చూసింది. వారిద్దరూ తలాడించారు.

మౌనిక, వైదేహి రూమ్‌లోనుండి బయటకు నడిచారు.

మరో ఐదు నిముషాల తర్వాత ఇక తను మాత్రం అక్కడ ఉండి చేసేదేమీ లేదన్నట్టు "ఓకే. భారతిగారు! ఒక్కసారి డాక్టర్‌కి కనిపించి, నర్స్‌కి చెప్పేసి... నేనూ బయల్దేరుతాను"

ఆమె తలాడించింది. అతడు రూమ్‌లో

నుండి బయటకు నడిచాడు.



కాలేజీకి వెళ్ళేందుకు తయారయ్యాక రమేష్ కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు నిఖిలేష్.

ఏంచేయాలో తోచనప్పుడు, కాసింత రిలాక్స్ అవుదామనిపించినపుడు మాత్రమే అతడు టి.వి.ని ఆన్ చేస్తాడు.

ఆ టైమ్‌లో ఎలాగూ ఎదురుచూపులే కాబట్టి టి.వి. ఆన్‌చేశాడు అతడు.

ఓ ఛానల్‌లో డాక్టరుతో ముఖాముఖి అనే కార్యక్రమం వస్తోంది.

సిటీలో పేరున్న ఓ ప్రవేట్ హాస్పిటల్‌లో ఓ విభాగానికి చెందిన డాక్టరొకరు ప్రేక్షకులు ఫోన్ ద్వారా అడిగే ప్రశ్నలకు సమాధానం చెపుతున్నారు. ఆ ప్రోగ్రాం టెలికాస్ట్ అవుతోంది.

"డాక్టర్! నేను ఓ నెలక్రితమే హార్ట్‌ఎటాక్‌తో మీ హాస్పిటల్‌లోనే జాయిన్ అయ్యాను. ఓ పదిరోజులు హాస్పిటల్‌లో ఉంచుకుని ట్రీట్‌మెంట్ ఇచ్చాక నన్ను డిశ్చార్జ్ చేశారు. ఈమధ్య నాకు అప్పుడప్పుడూ నొప్పి వచ్చినట్టుగా అనిపిస్తోంది. కాని అది సివియర్‌గా కాదు. మరి ఇప్పుడు నన్నేం చేయమంటారు? ఏవైనా టాబ్లెట్స్ సజెస్ట్ చేస్తారా? "

అందుకు డాక్టర్ జవాబు...

మరో మోటుప్రశ్న "డాక్టర్! నేనో డాక్టర్‌ని కన్సల్ట్ చేస్తే నాకు గుండెకు రంధ్రం పడిందని చెప్పారు. నా కేసు గురించి వివరాలు చెప్పగలరా? "

డాక్టర్ జవాబు...

మరొక పేషంట్ ప్రశ్న...

డాక్టర్ వివరణ...

తలుపు చప్పుడయింది.

నిఖిలేష్ తలతిప్పి చూశాడు.

రమేష్ లోపలికొచ్చాడు. అతడి పక్కనే కూర్చుని అటు తల తిప్పాడు. టి.వి. ప్రోగ్రాం చూసి "ఏంట్రా! ప్రశాంతంగా టి.వి. ప్రోగ్రామ్‌లు చూసుకుంటున్నావ్? " అంటూ నిఖిలేష్ ముఖంలోకి చూశాడు.

"ముందు ఆ ప్రోగ్రాం చూడు"

రమేష్ తలతిప్పి ఆ ప్రోగ్రాంని అరనిమిషం చూశాక "ఓహో! పేషెంట్స్ ప్రశ్నలకు డాక్టర్ల సమాధానాలు డైరెక్ట్ రిలే చేస్తున్నారా? ..." స్వగతంగా అన్నాక నిఖిలేష్ కేసి తల తిప్పాడు. "అయితే ఏంటట? "

"ఏంటంట? అంటే ఏం చెప్పను? ... సమాజంలో రోజు రోజుకీ వస్తున్న మార్పులను పరిశీలించమంటున్నాను"

రమేష్ కనుబొమలు ముడివేశాడు. "నాకేం అర్థంకావడంలేదు"

నిఖిలేష్ దీర్ఘంగా నిశ్వసించాక, లేచివెళ్ళి టి.వి. ఆఫ్ చేశాడు. టీవీ పక్కనే నిలబడి మిత్రుడికేసి చూస్తూ చెప్పాడు.

"కొద్ది సంవత్సరాల క్రితం వరకూ అనారోగ్యం కలిగితే మనిషి డాక్టర్‌నే కలిసి సలహా అడిగేవాడు. ఆ తర్వాత పత్రికలలో 'డాక్టర్ సలహాలు' శీర్షికలు మొదలయ్యాయి. పేషెంట్ తన జబ్బు తాలూకూ వివరాలను పత్రికలకు పంపి పత్రికలోనే సలహాలు పొందసాగాడు. నేటికి వచ్చిన మరో మార్పు ఫోన్ ద్వారా డాక్టర్‌తో

మాట్లాడుతూ, ఆయనను చూస్తూ సలహా లను పొందగలుగుతున్నాడు"

"సో! వాట్?"

"రోజు రోజుకి పెరుగుతున్న సైన్స్ మని షికీ మనిషికీ మధ్య దూరం పెంచడమే కాదు, చివరికి డాక్టర్‌ని, రోగిని కూడా దూరం చేయడం మొదలుపెట్టింది. ఇప్పుడు టి.వి. సలహాలొచ్చాయి. మరో వైపు ఇంటర్‌నెట్ వాడకం పెరుగుతున్న కొద్దీ పేషెంట్ ఇంట్లోనే కూర్చుని ఎక్కడో వున్న డాక్టరుతో 'ఛాటింగ్' చేసే అవకాశం ఏర్పడింది. వీడియో కాన్ఫరెన్స్ ద్వారా ఒక పేషెంట్ అమెరికా వెళ్ళి సర్జరీ చేయించు కునే అవసరం లేకుండానే అక్కడి డాక్టర్లు ఇక్కడి డాక్టర్లను వీడియో తెరమీదనే పేషెంట్‌కి ఆపరేషన్ ఎలా చేయాలో చెప్పడం, అప్పటికప్పుడు వచ్చే ఇబ్బందుల్ని తొలగించడం చేస్తున్నారు..."

"అవున్రా! వైద్యం రోజురోజుకి చవకయి పోతుందేమోననిపిస్తోంది" రమేష్ తలా డిస్తూ చెప్పాడు.

"లేదు లేదు... చవకయిపోవటమంటే, ఖరీదు లేనిదిగా మారడం లేదు. వైద్యం రోజురోజుకి సామాన్యుడికి అందనంత దూరం అవుతోంది. సాధారణ హాస్పిటల్స్ స్థానే పుట్టుకొచ్చే మల్టీ స్పెషాలిటీ హాస్పిట ల్స్‌ని సామాన్యుడు కన్నెత్తికూడా చూడ లేడు. చిన్న హాస్పిటల్‌కి వెళ్తే పేషెంట్ ఆర్థికస్థితిని మరచి మల్టీ స్పెషాలిటీ హాస్పి టల్స్‌కే రిఫర్ చేస్తారు. చివరికి ఆ చిన్న హాస్పిటల్స్‌లోని డాక్టర్స్ 'తమకెందుకులే రిస్క్' అని అనుకోవడంవల్లే అలాంటి సమస్య ఉత్పన్నమవుతుంది. వెరసి బాధప డేది, లేదా వైద్యసేవ అందక కృంగిపోయేది సామాన్యుడే"

"అయ్య బాబోయ్..." అన్నాడు రమేష్.

ఏమయిందోననుకుంటూ, "ఏమిట్రా, ఏమయింది?" అడిగాడు నిఖిలేష్.

"డాక్టర్ కాబోతూ నువ్విలా మాట్లాడుతు న్నావంటే, లాభం లేదురా. నీకు బ్రెయిన్ వాష్ చేయాల్సిందే. ఇప్పుడే, ఇక్కడే బ్రెయిన్ వాష్ చేద్దును కాని, కాలేజీకి టైమ యింది. వెళ్దాంపద"

నిఖిలేష్ కదలబోతూ ఆగాడు. అతడికి నిన్నటి సాయంత్రం విషయం గుర్తుకొ చ్చింది.

"రేయ్ రమ్మీ! నిన్న సాయంత్రం ఓ తమాషా జరిగింది తెలుసా?"

"ఏమిటది?"

"అది మౌనికకు సంబంధించిన విష యంరా... బ్యాడ్‌లక్... మంచి ఛాన్స్ మిస్ అయ్యావ్... అప్పటికీ నిన్ను 'నాతో రారా' అన్నాను. కాని నువ్వు వస్తేనా. నువ్వే గనుక నిన్న సాయంత్రం నాతో వచ్చి ఉంటే నా సామిరంగా..."

"అబ్బా! అసలేం జరిగిందో చెప్పమం టుంటే?"

ఇంకా రమేష్‌ని సస్పెన్స్‌లో పెట్టి వాడి బీపీ పెంచేస్తే, వాడు కోపం తెచ్చుకుని తన మీదపడి కొట్టినా కొట్టేయగలడనిపించింది. అందుకే చెప్పాడు "నిన్న సాయంత్రం మౌనిక హాస్పిటల్‌కి వచ్చిందిరా"

"వాట్! మౌనిక నిన్న సాయంత్రం హాస్పి టల్‌కి వచ్చిందా?" ఆశ్చర్యంగా అడిగాడు రమేష్.

"అవున్రా! వాళ్ళ వదిన వెంట వచ్చింది. మేమిద్దరం కాసేపు మాట్లాడుతుకున్నాం"

"నా విషయమేనా?" ఆతృతగా ప్రశ్నిం చాడు.

"నోర్ముయ్యరా! పక్కనే తన వదిన ఉంటే, తనతో నీ లవ్ గురించి మాట్లాడమం టావా?... బుద్ధిలేకపోతే సరి"

"అలాగా" నీరసపడిపోయాడు రమేష్

"మరేం మాట్లాడుకున్నారు?" అడిగాడు.

"మౌనిక భారతిని కలిసి 'ఆమె తన కాళ్ళ మీద తను నిలబడతానంటే చేయూతనిస్తా నంది? ఆమెను ఆలోచించుకోమని చెప్పింది"

రమేష్‌కి ఇన్సల్టింగ్‌గా అనిపించింది. 'అమ్మా నాన్నలచాటు ఆడపిల్ల, మరో ఆడ పిల్లకు, అందులోనూ అప్పుడే పరిచయమైన అపరిచితకు చేయూతనిస్తానంటే తను చేతులు ముడుచుకుని కూర్చోవడం ఏమిటి? నో! లాభం లేదు. ఒక మగాడిగా ఇది తను సిగ్గుతో తలదించుకోవలసిన విషయం. అందుకే వెంటనే ఆ అమ్మాయికి తనూ ఏదయినా సహాయం చేయాలి. తను చేసిన సహాయం పనిలోపనిగా మౌనికకు తెలిసేలా చేసుకోవాలి. మరి ఇంతకీ తనిప్పుడు ఏం సహాయం చేయాలబ్బా?'

"అయితే నేనూ ఆ అమ్మాయికి సహాయం చేస్తాను. తనకు నెలకో వెయ్యి రూపాయలు నా పాకెట్‌మనీ నుండి అందజేస్తాను. ఏమంటావ్?"

"నడిసముద్రంలో మునిగిపోతూ దిక్కుతోచక కొట్టుకుంటున్న ఓ ప్రాణికి చేయూతనందిస్తానంటే సంతోషమే కదరా! ఈ విషయం ఆమెకే చెబుదువు పద వెళ్దాం"

నిఖిలేష్ కుర్చీలో నుండి లేచాడు.

"మరి కాలేజీకో"

నిఖిలేష్ టేబుల్‌మీద ఉన్న పుస్తకాలు అందుకుంటూ చెప్పాడు. "ఆమెను పలకరించేసి, అటునుండి అటే వెళ్ళిపోదాం"

"అలా అయితే సరే. పద వెళ్దాం"

ఇద్దరూ మెట్లు దిగి కిందకొచ్చారు.

రోడ్ పక్కనే ఆగివుంది రెడ్‌కలర్ మారుతి కారు. రమేష్ కారు డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు. నిఖిలేష్ ఫ్రంట్ సీట్లోనే కూర్చున్నాడు "త్వరగా పోనివ్వు. మళ్ళీ కాలేజీ టైమ్‌కి వెనక్కి వెళ్ళిపోవాలి" అన్నాడు.

"నో ప్రాబ్లమ్" కారు వేగంగా ముందుకు దూకించాడు రమేష్.

పదినిమిషాల తర్వాత కారు హాస్పిటల్ గేటుముందు ఆగింది. ఇద్దరూ కారుదిగి లోపలికి నడిచారు.

వాళ్ళను చూడడంతోనే రిసెప్షనిస్ట్ కంగారుగా దగ్గరగా రాసాగింది. ఆవిడ కంగారు చూడడంతోనే 'జరగకూడనిదేదో జరిగిపోయినట్టుంది' అన్న అనుమానం నిఖిలేష్ మనసులో చొరబడింది.

రిసెప్షనిస్ట్ దూరంనుండే "డాక్టర్‌గారు ఉదయంనుంచి మీ కోసమే టెన్షన్ పడుతున్నారు. మీరిచ్చిన ఫోన్‌నంబర్‌కి చాలా సార్లు డయల్ చేశారు. 'రమేష్‌గారు కాలేజీకి వెళ్ళిపోయారన్న' జవాబే మాకు అందింది..." అంటూ చెప్పి దగ్గరకొచ్చింది.

"ఇంతకీ ఏమయింది?"

"...సార్! మీరు చేర్పించిన పేషెంట్ బిడ్డను వదిలేసి రాత్రికిరాత్రే పారిపోయింది"

అడుగుదూరంలో బాంబు పడ్డట్టు అదిరి పడ్డారిద్దరూ. అందుకే అడుగు ముందుకు పడలేదు. అప్రయత్నంగానే ముఖాలు చూసుకున్నారు వాళ్లిద్దరూ.

నిఖిలేష్‌కి ఆ మాట ఎంత మాత్రమూ నమ్మబుద్ధికాలేదు. అందుకే అతడు రిసెప్షనిస్ట్‌కేసి అనుమానంగా చూశాడు.

కొద్దిక్షణాల తర్వాత "ఆమె... ఆమె... వెళ్ళిపోయిందా?" అన్నాడు నిఖిలేష్. ఎంత కంట్రోల్ చేసుకుందామనుకున్నా మాట తడబడింది.

"అవును. సార్"

నిఖిలేష్ మనసులో కంగారు మాత్రమే ఉంది. రమేష్ మాత్రం పూర్తిగా భయపడిపోయాడు. క్షణాల్లోనే అతడి ఆలోచనలు ఎంతో దూరం వెళ్ళిపోయాయి. ఈ విషయం పోలీసుల వరకూ వెళ్తుందేమో! ఎంక్వయిరీ పేరుతో పోలీసులు తమ ఇంటికి వస్తారేమో? దారినపోయే శనిని ఇంటివరకూ తెచ్చినందుకు డాడీ తనను ఏమంటాడో ఏమో? ఇంకా ఎన్నెన్ని పిచ్చి ఆలోచనలు ఒక్కసారిగా చుట్టుముట్టేశాయో!

అందుకే అతడు నిఖిలేష్ చెవిలో గొణిగాడు, "ఏరా! ఇప్పుడేం చేయడం? మెల్లగా తప్పించుకుని పారిపోదామా?"

నిఖిలేష్ రమేష్‌కేసి సీరియస్‌గా చూశాడు. తర్వాత రిసెప్షనిస్ట్‌వైపు తిరిగి, "డాక్టరుగారు ఎక్కడ?" అని అడిగాడు.

"కన్సల్టింగ్ రూమ్‌లో" చెప్పింది నర్స్.

నిఖిలేష్ ఆ రూమ్‌వైపు నడుస్తుంటే అనుసరించక తప్పలేదు రమేష్‌కి. డోర్ తెరవగానే సీట్లో కూర్చుని ఉన్న డాక్టర్ కనిపించింది. తనను చూడడంతోనే ఆమె ముఖంలో సంతోషం కదలాడడం గమనించాడు నిఖిలేష్.

"రండి... రండి... కూర్చోండి" ఇన్వయిట్ చేసింది డాక్టర్.

ఇద్దరూ లోపలికి నడిచారు. వాళ్ళు సీట్లో కూర్చున్నాక డాక్టర్ చెప్పింది. "చూశారా! ఇప్పుడేమయిందో? రోడ్డు పక్కన వదిలేయాల్సిన మనిషిని ఇంత ఖరీదయిన హాస్పిటల్లోకి తీసుకొచ్చారు. తను మీకు కృతజ్ఞత చూపాల్సింది పోయి, కృతఘ్నత చూపింది. కన్నబిడ్డను వదిలేసి రాత్రికిరాత్రే వెళ్ళిపోయింది"

ఏం మాట్లాడాలో వాళ్ళకు అర్థం కాలేదు. షాక్‌నుండి తేరుకునేటప్పటికి, ఇటుపైన ఏం చెయ్యాలన్నది వాళ్ళముందు సమస్యగానే మిగిలివుంది. అయితే రమేష్ మాత్రం ఎలా ఎస్కేప్ కావాలా అని ఆలోచిస్తుంటే, నిఖిలేష్‌కి ఏం చేయాలో పాలుపోవడం లేదు.

"...అన్నట్టు, తను పర్సనల్‌గా మీకీ ఉత్తరం కూడా రాసిపెట్టి వెళ్ళింది..."

డాక్టర్ టేబుల్ సొరుగులోనుండి అతికించి ఉన్న కవరొకటి తీసి నిఖిలేష్‌కి అందించింది. ఆ కవరు అందుకుంటుంటే ఎందుకో తెలియదు. అతడికి చెయ్యి సన్నగా వణికింది.

నిఖిలేష్ డాక్టర్‌ముందే కవరు చించాడు. అతడు కవరులోని కాగితం తీసి పేపరు మడతలు విప్పితే, రమేష్ కూడా ఆ కాగితంలోకి తొంగిచూశాడు. వాళ్ళిద్దరి కళ్ళూ అక్షరాల వెంట పరుగెత్తసాగాయి.

గౌరవనీయులైన నిఖిలేష్‌గారికి,

ఏంచేసినా మీ రుణం తీర్చుకోలేనని తెలిసినా, శతకోటి వందనాలు అని మాత్రమే రాస్తున్నాను.

ఈ ఉత్తరం మీ చేతికి అందేసరికి, నేనిలా ఎందుకు చేశానో అర్థంగాని అయోమయంలో, ఏంచేయాలో తోచని కంగారులో ఉండిఉంటారనుకుంటా. అవును మరి. పొత్తిళ్లలోని పసికందును జన్మనిచ్చిన తల్లే నిర్దాక్షిణ్యంగా వదిలేసిపోతే, ఆ బిడ్డను ఏంచేయాలో తెలియని ఓ బ్రహ్మచారి పడే కంగారు ఎలా ఉంటుందో నేను అర్థం చేసుకోగలను. కృతజ్ఞత చూపవలసిన మీ పట్ల కృతఘ్నత చూపుతున్నాననీ తెలుసు. అయినా నా స్వార్థమే నన్నిలా చేయిస్తోంది.

కన్యగా ఇంట్లోనుంచి బయటపడ్డ నేను, ఒక బిడ్డ తల్లిగా తిరిగి పుట్టింటికి చేరితే, నన్ను కన్నవాళ్లు అసలు తట్టుకోలేరు. నేను చేసిన తప్పుకు సాక్ష్యంగా మిగిలిన బిడ్డ ఎదురుగా ఉంటే, వాళ్ళు నా తప్పును కప్పి ఉంచాలనుకున్నా కప్పి ఉంచలేరు. నాకూ భవిష్యత్ మీద ఎంతో కొంత ఆశ ఉంది. తెలిసో తెలియకో చేసిన తప్పుకు జీవితాంతం శిక్ష అనుభవించడం నా వల్ల కాదు.

మరి ఏ తప్పూ చేయకుండానే మీకు శిక్ష విధిస్తున్నానా? ఏమో! అది నాకు తెలియదుగానీ, నాకో నమ్మకం. మీలాంటి మంచి మనిషి నీడలో నా బిడ్డ ఎంతో గొప్పవాడవుతాడు. లేదా ఓ అనాథశరణాలయానికైనా వాడిని మీరు చేరుస్తారన్న నమ్మకం నాకుంది.

దయచేసి నన్ను వెతికే ప్రయత్నం చేయకండి. అందుకే మాది విజయవాడ దగ్గర పల్లె అని చెప్పానేగాని, ఏ పల్లెనో చెప్పలేదు. అయినా మీరాపని చేయలేరని నా నమ్మకం. ఒకవేళ నన్ను వెతుక్కుంటూ గమ్యం చేరినా అక్కడ మీకు ప్రతికూల పరి

స్థితే ఎదురవుతుంది.

లోకంలో ఇటువంటి తల్లులూ ఉంటారా? అని ఆశ్చర్యపోతున్నారా... ఉంటారు! భవిష్యత్ అనో, కెరీర్ అనో పురిట్లో బిడ్డను అత్తమామల దగ్గరో, అమ్మానాన్నల దగ్గరో వదిలేసి విదేశాలకు వెళ్ళిపోయే నేటి తరం మమ్మీ డాడీలకన్నా నేనే ఎంతో మేలు. ఎందుకంటే నాది విధిలేని పరిస్థితి, ఏమాత్రం సాధ్యపడినా నేను నా బిడ్డను వదులుకోలేకపోయేదాన్ని.

ఏదేమయినా నేను తప్పు చేస్తున్నాను. నా తప్పుకు మీరు శిక్ష అనుభవించబోతున్నారు.

అందుకే మిమ్మల్ని మనస్ఫూర్తిగా క్షమించమని కోరుతూ, నా బిడ్డను మీకు అప్పగించి సెలవు తీసుకుంటున్నాను.

ఇట్లు
భారతి

నిఖిలేష్‌కి ఆ క్షణం ఎంత ఆవేశం కలిగిందంటే, ఆ ఉత్తరాన్ని ఉండ చుట్టి నేలకు విసిరికొట్టాడు. కసిగా మనసులో ఏదో గొణుక్కున్నాడు.

అతడు గొణుక్కోవడం విని, అప్పటికే లెటర్‌లోని మ్యాటర్ చదివివున్న రమేష్ కాసింత చిరాకుగానే "చూశావా నిఖిలేష్! నేను అప్పుడే చెప్పాన్రా. ఇలాంటి కేసులు మనం పట్టించుకోకూడదురా అని! నీతిమాలిన పనులు చేసి బిడ్డను కన్నవాళ్ళకి, ఆ బిడ్డను నిజాయితీగా పెంచుకోవాలనే ఆలోచన ఎలా వస్తుంది? రాదుగాక రాదు. అలాంటి వాళ్ళ విషయంలో తలదూరిస్తే, ఇదిగో ఇలాగే సమస్య మెడకు చుట్టుకుంటుంది. ఇప్పుడీ సమస్యనుండి మనం తప్పించుకోవడం ఎలా? "

"ఏమయింది? " అడిగింది డాక్టర్.

రమేష్ ఆమెకు ఉత్తరంలోని వివరాలు చెప్పాడు.

ఆ వివరాలు వినడంతోనే డాక్టర్ కొద్దిక్షణాలు మాట్లాడలేకపోయింది. తేరుకున్నాక మందలిస్తున్నట్టుగా పలికింది. "చూశారా! ఇలాంటి కేసుల విషయంలో మేం అంత నిక్కచ్చిగా ఎందుకుంటామో! ఒకవేళ పోనీలే ప్రజాసేవ చేద్దామని ఇలాంటి కేసుల్ని హాస్పిటల్‌లో చేర్చుకున్నా ఆ తర్వాత ఇదిగో ఇలాగే ఆ బిడ్డను ఏం చేయాలో తెలియక మేం జుట్టు పీక్కోవాలి. అనాధాశ్రమాన్ని వెదుకులాడాలి. ఒక్కొక్కసారి ఇలాంటి కేసులవల్ల పోలీసు కేసు కూడా కావచ్చు. అప్పుడు మనం హాస్పిటల్‌ని వదిలేసి పోలీసుల చుట్టూ తిరగాలి. మంచి చెయ్యాలనుకుని చెడుని కొనితెచ్చుకోవడం ఎందుకు? అందుకే మాలాంటివాళ్ళు ఇలాంటి కేసుల్ని వీలయినంత దూరంగా ఉంచుతారు.

తన మిత్రుడు తననే నిందిస్తున్నాడు. ఆ డాక్టర్ 'తనేదో తెలివితక్కువగా ఆ సమస్యలో ఇరుక్కుపోయానని' అనుకుంటోంది.

నిజానికి... నిజానికి తను కూడా ఇలాంటి సమస్యను ఊహించలేదు. ఒక ఆడది తన పేగు తెంచుకుపుట్టిన బిడ్డను పురిటిలోనే వదిలేసి వెళ్ళిపోగలదని తనెలా ఊహించగలడు? తనేదో ఆమెను హాస్పిటల్‌లో చేర్చి సుఖప్రసవం చేయించి, తల్లీ బిడ్డల్ని సంతోషంగా సాగనంపగలననుకున్నాడు.

కానీ కథ అడ్డం తిరిగింది. తన ఎదుటే పెద్ద సమస్య నిలిచింది.

ఇప్పుడు... ఇప్పుడేమిటి చేయడం?

ఒకరి నిందలు, మరొకరి సలహాలు వినవలసిన అవసరంలేదు. చిన్న ఘనకార్యం చేసినా దేవుడిలా పూజించే జనం, అతడే చిన్న పొరపాటు చేస్తే దారుణాతి దారుణంగా 'ఛీ' కొడతారు.

కాబట్టి ఇతరుల గురించి వారి వ్యాఖ్యల గురించి ఆలోచించడం అనవసరం.

తనేం చేయాలనుకుంటున్నాడో, ఆలోచించి నిర్ణయం తీసుకోవడం ప్రధానం.

తన ముందిప్పుడు రెండు మార్గాలు

న్నాయి.

ఆ బిడ్డను తీసుకెళ్ళడం మొదటిది. ఆ బిడ్డను ఏ అనాథాశ్రమానికో ఇచ్చేసి చేతులు దులిపేసుకుని వెళ్ళటం రెండవది.

తనేం చేయాలిప్పుడు?

అతడు ఓ నిర్ణయానికి వచ్చినట్టు అడిగాడు. "డాక్టర్! పసివాడెక్కడ?"

"ఆ రూమ్‌లోనే ఉన్నాడు"

"నేను బిడ్డను చూడాలి"

"పదండి వెళ్దాం"

ముగ్గురూ కన్సల్టింగ్ రూమ్‌లో నుండి బయటకు నడిచి కారిడార్‌లో కొద్దిదూరం ముందుకు సాగారు.

డాక్టర్ వారిద్దర్ని రూమ్‌నంబర్ నైన్‌లోకి తీసుకెళ్ళింది.

రూమ్‌లో అడుగుపెట్టగానే నిఖిలేష్ అటు చూశాడు.

ఓ మగాడు వయసు ఆవేశంతో చేసిన పాపం, ఓ స్త్రీ బలహీనతకు లోనై చేసిన తప్పు.

కానీ శిక్షనుండి వారిద్దరూ తప్పించుకున్నారు.

శిక్ష పడిన పసివాడు, తనకు పడిన ఘోరమైన శిక్ష ఏమిటో తెలియక నిశ్చింతగా గాఢంగా నిద్రపోతున్నాడు.

ఆ క్షణం ఆ పసివాడిని చూస్తుంటే నిఖిలేష్‌కి ఇతరుల పాపాలను మోస్తూ శిలువ ఎక్కిన ఏసుక్రీస్తు కనులముందు కదలాడాడు.

నిఖిలేష్ ముందుకు నడిచాడు. రెండు చేతులు ముందుకు సాచి ఆ బిడ్డను అందుకున్నాడు.

ఆ క్షణం ఏదో తెలియని మమకారం, మరేదో ఆప్యాయత మనసులో కదలాడి తనువంతా ఏదోలా అయిపోయింది.

అతడు బిడ్డను చేతులలోనే ఉంచుకుని బయటకు నడవసాగాడు.

రమేష్‌కి నిఖిలేష్ ఏం చేస్తున్నాడో మొదట అర్థం కాలేదు. అర్థమయ్యాక వారించాలని ప్రయత్నించాడు. అయితే అతడి ముఖంలోకి చూసి తన ప్రయత్నం విరమించుకున్నాడు.

నిఖిలేష్ ముఖంలో ఒక నిర్ణయం కదలాడుతోంది.

అయితే అది స్థిరనిర్ణయమో లేదా తాత్కాలిక ఉద్రేకమో కాలమే నిర్ణయించాలి.

రూమ్‌లో నుండి రెండు అడుగులు బయటకు వేశాక అతడికి అప్పుడే గుర్తుకు వచ్చిందేమో వెనుదిరిగి చూశాడు. డాక్టర్ మీద చూపు నిలిపి అడిగాడు. "డాక్టర్! నేను ఈ బిడ్డను తీసుకెళ్ళొచ్చా?"

అతడి నోటివెంటా మాట రావాలనే ఆమె వేయి దేవుళ్ళకు మొక్కుకుంటూ ఉంది. ఎప్పుడయితే అతడి నోట ఆ మాట వచ్చిందో ఆమె ముఖంలో ఓ మెరుపు మెరిసింది.

"సంతోషంగా... తీసుకెళ్ళండి"

నిఖిలేష్ కారిడార్‌లో నడవసాగాడు.

రమేష్ అయోమయంగా అతడిని అనుసరించసాగాడు.

మిత్రులిద్దరూ ముందుకు సాగిపోతుంటే డాక్టర్ అక్కడే నిలబడిపోయి రిలాక్స్‌డ్‌గా ఫీలవుతూ వారినే చూడసాగింది. 'హాస్పిటల్ ఫీజులో ఇంకా కొంత బాలెన్స్ వాళ్ళు చెల్లించాల్సి ఉందని ఆమెకు తెలుసు. కానీ ఆ బిడ్డను హాస్పిటల్‌నుండి తీసుకెళ్ళటమే ఫీజు చెల్లించినంత భాగ్యం' అనుకుంది ఆమె.

★ ★ ★

అప్పుడే కాలేజి లాస్ట్‌బెల్ కొట్టడంతో స్టూడెంట్స్ అందరూ బయటకు నడవసాగారు.

"హలో రమేష్‌గారూ..."

నీరసంగా ముందుకు నడుస్తున్న రమేష్ ఉలిక్కిపడి వెనక్కు తిరిగి చూశాడు. మౌనిక! రమేష్‌కి వంట్లోని రక్తమంతా వడివడిగా ప్రవహించింది. ముఖం వంద

ట్యూబ్‌లైట్ల కాంతితో ఒక్కసారిగా వెలిగిపోయింది. అది కలా? నిజమా? అన్న అనుమానమూ కలిగింది. మౌనిక పిలిచింది తననేనా?

అయితే అప్పటికే ఆమె అతడికి దగ్గరగా వచ్చేసింది. దాంతో తనది అనుమానం కాదని అర్థమయిపోయింది. అందుకే పలకరింపుగా పెదవులు వెడల్పు చేశాడు అతడు.

ఆమె మాత్రం నవ్వకుండానే అడిగింది. "ఏమండీ! మీ ఫ్రెండ్ నిఖిలేష్ ఈ రోజు కాలేజీకి వచ్చినట్టు లేదే? "

ఆమె తనను పిలిచింది మరెందుకో అనుకున్నాడు. 'నిఖిలేష్ గురించి అడిగేందుకా? '

అయినా అంతలోనే మరో అనుమానం. 'మౌనిక నిఖిలేష్ గురించి ఎందుకడుగుతోంది? అతడు కాలేజీకి వచ్చినట్టు లేడు' అని అంటోందంటే, ఉదయంనుండి అతడి కోసమే వెతుకుతోందా?

అతడి ముఖంలో అనుమానం గమనించినట్టుగా ఆమె నవ్వుతూ చెప్పింది. "సాధారణంగా మీరిద్దరూ ఒకర్ని విడిచి మరొకరు ఉండరుకదా? జంటకవుల్లా మీరిద్దరూ ఎప్పుడూ పక్కపక్కనే ఉంటుంటారు. ఈ కాలేజీలో ఎవరయినా మీ గురించి అనుకుంటే, ఇద్దరూ కళ్లముందు కదలాడుతారు... సో! అలాంటిది ఈరోజు మీరు ఒక్కరే కనిపించేసరికి అనుమానం వచ్చి అడిగానులెండి"

రమేష్‌కి గుండె కుదుటపడ్డట్టనిపించింది.

ఇద్దరూ ముందుకు నడుస్తున్నారు.

అతడి ఉత్సాహపు పొంగు హద్దులు దాటుతూ ఉన్నట్టనిపించింది. ఆమె పక్కన నడుస్తుంటే అదోరకమైన అనుభూతి కలుగుతోంది.

ఈ ప్రపంచాన్ని జయించినంత ఆనందంతో మునసు అదుపు తప్పుతోంది. ఈ కలిసి సాగే ప్రయాణం శాశ్వతమయితే ఎంత బాగుణ్ణు. ప్రస్తుతం తన జీవిత ఆశయం అదే. జీవితాంతం ఆమెతో కలిసి ప్రయాణించడం!

తనలాంటి వ్యక్తితో జీవితం పంచుకునేందుకు ఆమెకూ అభ్యంతరం ఉండకపోవచ్చు కానీ తన మనసులోని మాట ఆమెకు తెలిసేలా చేయగలగాలి.

అదిగో ఆ బాధ్యత తీసుకున్న నిఖిలేష్‌కి గత కొద్దిరోజులుగా ఏదోవిధంగా ఆటంకం రావడం జరుగుతోంది.

వాడు... వాడు ఎప్పుడు ఈమెకు నా ప్రేమ గురించి చెపుతాడో ఏమో!

"నేనడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పకుండా ఏదో ఆలోచనల్లోకి వెళ్ళిపోయినట్టున్నారు? "

అతడు ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చాడు. తన పరధ్యాస ఆమెకు తెలియడం ఇష్టం లేదన్నట్టు "అది... అది... మావాడి గురించి ఏం చెప్పాలో అర్థంగాక..." అంటూ నసిగాడు.

ఆమె కంఠంలో ఆత్రుత ధ్వనించింది. "ఏదయినా జరగక్కూడనిది జరిగిందా? "

"నోనో! అలాంటిదేమీలేదు" అన్నాక అతడు దీర్ఘంగా నిశ్వసించి చెప్పాడు.

"వాడు దారినపోయే శనిని పిలిచి మరీ తగిలించుకున్నాడు. ఆ శని ఇప్పుడు వదలనంటోంది. ఎలా వదిలించుకోవాలో తెలియక, అయోమయంలో ఉండి కాలేజీకి రావడం మానేస్తున్నాడు."

"శని తగిలించుకోవడం ఏమిటండీ? అర్థమయ్యేలా చెప్పండి"

"ఏముందండీ! రోడ్డు పక్కన ప్రసవ వేదన పడుతున్న అమ్మాయిని హాస్పిటల్‌కి తీసుకెళ్ళామా? అక్కడ నేను వద్దంటున్నా, తనే ఆ అమ్మాయిని హాస్పిటల్‌లో చేర్చాడు. హాస్పిటల్‌లో చేర్పిస్తే చేర్చాడు, మరుసటిరోజు హాస్పిటల్‌కి వెళ్ళకుండా ఉంటే సరిపోయి ఉండేదికదా! పరామర్శించాలంటూ అక్కడికెళ్ళాడు. అప్పుడే ఆ అమ్మాయి మనవాడి మంచితనం చూసినట్టుంది. నా బిడ్డను పెంచుకోమంటూ ఓ

చీటీ పెట్టేసి అర్ధరాత్రి పసివాడిని వదిలేసి వెళ్ళిపోయింది... అప్పుడయినా ఏదోలా తప్పించుకుని ఆ పసివాడిని హాస్పిటల్‌లో వదిలేయొచ్చుగా. ఊహు! అలా చేయడానికి మనసొప్పడంలేదంటూ వెంటబెట్టుకుని రూమ్‌కి తెచ్చుకున్నాడు"

వెంటనే బాణంలా దూసుకువచ్చిందా ప్రశ్న. "అయితే నిఖిలేష్ ఇప్పుడు ఆ బిడ్డతో సహా రూమ్‌లోనే ఉన్నాడా? "

"ఉదయం నేను వెళ్ళేసరికి రూమ్‌లోనే ఉన్నాడు. పాపం! ఆ పసివాడు వాడిని బాగా ఏడిపిస్తున్నాడులెండి. ఆ వెధవకి అలా జరగాల్సిందే"

క్యాంపస్‌లో అటూ ఇటూ తిరుగుతున్న స్టూడెంట్స్ తామిద్దరినే చూస్తున్నట్టు అనిపించింది. అవునుమరి! మూడేళ్ళుగా ఏ మగాడితోనూ నిలబడి మాట్లాడని మౌనిక తనతో అలా మాట్లాడుతుంటే, సాటివారికి చిత్రంగా అనిపించదా? అంతేకాదు, ఆమె అలా మాట్లాడుతుంటే గర్వం మాత్రమే కాకుండా, మరో లోకంలో విహరిస్తున్న ఫీలింగ్ కలిగింది అతడికి. ఆమె అలా ఎంతసేపయినా మాట్లాడుతూ ఉంటే బాగుణ్ణనిపించింది.

అయితే అప్పుడే ఆమె, కొద్దిక్షణాలు ఏదో ఆలోచించుకుంటున్నట్టు ఆగి, ఆ తర్వాత అడిగింది "మీకు ఇబ్బంది అనిపించకపోతే, నాకు మీ ఫ్రెండ్ రూమ్ చూపించగలరా? "

అతడు చప్పున ఆమె ముఖంలోకి చూశాడు.

నిఖిలేష్ రూమ్‌కి వెళ్ళాలంటున్న మౌనిక...?

రమేష్ మనసులో ఒక రకమైన ఇబ్బందికరమైన ఫీలింగ్ కొద్దిక్షణాలపాటు కదలాడింది. అయితే అంతలోనే అతడు తేరుకున్నాక ఆమెవైపు తిరిగి "పదండి వెళ్దాం" అన్నాడు.

ఆమె అతడిని అనుసరించింది.

క్యాంపస్‌లోని కారు పార్కింగ్ ప్లేస్‌లో ఉన్న మారుతికారు ఫ్రంట్ డోర్ తెరిచిపట్టుకుని "కూర్చోండి" చెప్పాడు.

ఆమె కారులో కూర్చున్నాక, తను డ్రైవింగ్ సీట్లో కూర్చుని కారు ముందుకు పోనిచ్చాడు అతడు.

అతడికి ఆ క్షణం కొద్దిరోజుల క్రితం తను బస్టాండ్‌లో నిలబడిన ఆమెను కారులోకి ఆహ్వానించడం గుర్తొచ్చింది. ఆ రోజు తన ఆహ్వానాన్ని తిరస్కరించిన ఈమె ఈరోజు తనంతట తానే కారెక్కింది.

ఏదేమయినా ఇవి తనకు మధురక్షణాలే! కారు గేటుదాటి రోడ్డెక్కింది.

అతడికి ఆ క్షణం కారులో పోతున్నట్టుగా లేదు. విమానంలో వెళ్తున్నట్టుగా ఉంది. అతడు గాలిలో తేలిపోతున్నాడు. 'రేపు తామిద్దరూ పెళ్ళిచేసుకున్నాక ఇలాగే ఒకే కారులో... ఆ తర్వాత తన పక్కనే పసిపాపను ఒడిలో కూర్చోబెట్టుకుని ఆమె. అలాగే పెద్ద హాస్పిటల్! అందులో తామిద్దరూ ఒకరికొకరు ఎదురుగా కూర్చుని పేషెంట్స్‌ని చూస్తూ...'

అయితే అతడు ఆ అనుభూతులనుండి తేరుకునేసరికి నిఖిలేష్ రూమ్ ఎదురుగా ఉంది.

రమేష్ కారు ఆపాడు. "రండి" తను కారులోనుండి దిగుతూ పలికాడు. ఆమె మరోవైపు కారుడోర్ తెరుచుకుని దిగింది.

ఇద్దరూ మెట్లెక్కి పైకి వెళ్ళారు.

ఆ గది తలుపు తెరిచే ఉంది.

వాళ్ళిద్దరూ గదిలోకి తొంగిచూశారు.

లోపల కనిపించిన దృశ్యం, వాళ్ళిద్దరూ ముఖాలు చూసుకునేలా చేసింది.

గదిలోపల-

నిఖిలేష్ చాపమీద అడ్డం పడుకుని వళ్ళు తెలియకుండా నిద్రపోతున్నాడు. అతడి పక్కనే పిల్లవాడు కూడా గాఢనిద్రలో మునిగిపోయి ఉన్నాడు.

పిల్లవాడి పక్కనే పాలపీక పడివుంది. నిద్రలోనే వాడు పక్క తడిపేసి ఉన్నాడు.

తడిసిన పక్కమీద నిఖిలేష్ చెయ్యిపడి ఉందిగాని, అతడికి తడి స్పర్శ కూడా తెలియడంలేదేమో!

చాపకు కొద్దిదూరంలో డస్ట్‌బిన్ ఉంది. డస్ట్‌బిన్‌లో న్యాపీ ప్యాడ్స్ పడి ఉన్నాయి. పాపం ఆ ప్యాడ్స్ తీస్తూ నిఖిలేష్ ఎంత ఇబ్బంది పడివుంటాడో తలచుకోడానికే ఏదోలా ఉంది.

నిఖిలేష్ పడిన ఇబ్బందికి నిదర్శనం అన్నట్టుగా ఆ గది కూడా అసహ్యంగా, అస్తవ్యస్తంగా కనిపిస్తోంది.

రమేష్ ఆమె ముఖంలోకి చూస్తూ ఇబ్బందిగా ముఖం పెట్టాడు.

అతడి ముఖంలో ఇబ్బందికర భావం ఉండాల్సినదానికన్నా ఒక పిసరు ఎక్కువ ఉన్నట్టుగా ఆమెకు అనిపించింది.

"లోపలికి వెళ్దామాండీ?" అతడు అడిగాడు.

"ఇక్కడివరకూ వచ్చింది లోపలికి వెళ్ళడానికే కదా?"

ఆమె ఎదురుప్రశ్న వేయడంతో అతడు తడబడి "అదికాదు మౌనికగారూ! గదంతా చాలా అసహ్యంగా కనిపిస్తోంది. మావాడు రూమ్‌ని ఎప్పుడూ నీట్‌గా ఉంచుకునేవాడు. పిల్లాడు వచ్చాడుగా, వాడి మలమూత్రాలతో గదంతా కంపు నిండిపోయి ఉంది. అందుకని..." అంటూ నసిగాడు.

"పసిపిల్లాడున్న ఇంట్లో ఇలాంటి దృశ్యాలు మామూలే. అయితే ఆడవాళ్ళున్న ఇల్లయితే వెంటనే శుభ్రం చేసుకుంటారు. ఇది బ్రహ్మచారి గదికదా! అందులోనూ పసిపిల్లాడితో మొదటిరోజు. అందుకే కొంత దిక్కుతోచని స్థితిలో ఆయన ఉండిపోయారనుకుంటా... పదండి లోపలికి"

ఆమె అలా అనేసరికి అతడు తప్పదన్నట్లు లోపలికి నడిచాడు. అయితే లోపలికి నడిచాక కూడా ఇబ్బందికరంగా ముఖం పెట్టి అలాగే నిలబడిపోయాడు.

"ఆయన్ను కాస్త లేపండి"

అలాగే"

"నిఖిలేష్... నిఖిలేష్" రమేష్ అతడిని తట్టాడు.

రెండో పిలుపుకు ఉలిక్కిపడి లేచిన నిఖిలేష్, లేవడంతోనే మొదట పక్కనే ఉన్న పసివాడికేసి చూశాడు. వాడు నిద్రపోతూ ఉండడం గమనించాక కాసింత గుండె ధైర్యం చిక్కిందేమో... అప్పుడు అప్పుడే... ఏదో అనుమానం వచ్చినట్టు తలతిప్పి చూస్తే రమేష్, వెనుకే మౌనిక కనిపించారు.

మౌనికను చూడడంతోనే అతడి కళ్ళు విప్పారాయి. ఆమెను, అక్కడ ఆ క్షణం ఊహించనట్టు తడబడ్డాడు. వెంటనే అదిరిపాటుతో లేచి లుంగీ సర్దుకుంటూ "మీరు... మీరెప్పుడొచ్చారు మౌనికగారూ?" అన్నాడు.

"ఇప్పుడే" ఆమె నవ్వింది.

అతడు కంగారుగా అటూ ఇటూ చూసి దూరంగా ఉన్న కుర్చీని తెచ్చి ఆమె ముందుంచి చెప్పాడు. "కూర్చోండి... కూర్చోండి"

"ఫర్వాలేదు" అంటూ ఆమె పసివాడి దగ్గరకెళ్లి నేలకు మోకాళ్లను తాకించి కూర్చుంది. "హాయ్ బాబూ! హాయ్..." అంటూ బుగ్గలను మృదువుగా పట్టుకుంది.

పసివాడు నిద్రలోనే కదిలాడు.

ఆమె పసివాడిని కదిలిస్తుంటే నిఖిలేష్ ఏమీ అనలేదుగాని, మనసులో మాత్రం కంగారు పడసాగాడు. 'వాడిప్పుడు నిద్ర లేస్తే... తన పని అయిపోయినట్టే' అని.

అయితే అదృష్టవశాత్తు మౌనిక ముద్దులకు వాడు కదల్లేదు.

ఆమె కూడా అక్కడినుండి లేచి కుర్చీలో కూర్చోకుండా అక్కడే చాపమీద కూర్చుండిపోయింది. తలెత్తి నిఖిలేష్‌ని చూస్తూ చెప్పింది. "బాబు తెల్లగా, బొద్దుగా, ముద్దుగా ఉన్నాడు"

నిఖిలేష్ నవ్వుతూనే అన్నాడు, "ముద్దు

గానే ఉన్నాడు కాని తిప్పలు పెడుతున్నాడు"

మౌనిక కూడా నవ్వింది, "పిల్లలన్నాక ముప్పుతిప్పలు పెట్టకుండా ఉంటారా? "

"కాని... కాని..." ఏదో చెప్పాలనిపించినా, ఎందుకో చెప్పలేక ఆగిపోయాడు అతడు.

ఆమెకు అతడేం చెప్పాలనుకున్నాడో కొంతవరకూ అర్థమయింది. "మగాళ్ళకు పిల్లల్ని చూసుకోవడమంటే, కొంతవరకూ ప్రాబ్లమ్‌గానే ఉంటుందిలెండి. అందులోనూ మీరు బ్రహ్మచారులు. పైగా చదువుకుంటున్నారు. ఒక్కరోజు కాలేజీకి వెళ్ళకపోతే లెసన్స్ మిస్ అవుతామేమోనన్న భయం. మొత్తంమీద ఏం చేయాలో తెలియక వాడు చేసే పనులకు విసిగిపోతూ, కాలేజీ గురించి భయంతో పిచ్చిపట్టినట్టుంటుంది. అది నిజం"

నిఖిలేష్ ఆమెకేసి పరిశీలనగా చూశాడు. గత మూడేళ్ళుగా ఆమెను చూడడమేగాని, ఎక్కువగా మాట్లాడింది లేదు. మనిషి దగ్గరయ్యి మాట్లాడినప్పుడే అవతలివారి తెలివితేటలు తెలుస్తాయి. కొద్దిరోజులు చనువుగా గడిపాకే వ్యక్తిత్వం అర్థమవుతుంది.

తనేం చెప్పకుండానే ఆమె అంత విశ్లేషణ ఇవ్వడమంటే, ఆమె ఏ సమస్యనయినా లోతుగా ఆలోచిస్తుందని తెలిసిపోతూనే ఉంది.

"అది నిజమేనండి" అతడు అన్నాడు.

అప్పటివరకూ మాట్లాడకుండా ఉన్న రమేష్ అప్పుడే పెదవి విప్పాడు. "మరి ఇన్ని ఇబ్బందులు పడుతూ ఆ పిల్లాడ్ని నీ దగ్గరే ఉంచుకోకపోతేనేం? "

"నా దగ్గర ఉంచుకోక మరేం చేయను? " నిఖిలేష్ ఎదురు ప్రశ్నించాడు.

"అది... అది... ఏ అనాథాశ్రమంలోనో వదిలేస్తే వాళ్ళే చూసుకుంటారు. కాకపోతే మనమూ అప్పుడప్పుడు వెళ్ళి చూసుకుని రావచ్చు"

నిఖిలేష్ వెంటనే మాట్లాడలేదు. కొద్దిక్షణాలపాటు తన అరచేతులకేసి చూసుకున్నాక తలెత్తి రమేష్‌కేసి చూశాడు. "నువ్వు అన్నది నా మేలు కోరి కావచ్చు. కాని నేను ప్రస్తుతం నా గురించి ఆలోచించుకోవడం కన్నా, ఆ పసివాడి గురించే ఎక్కువగా ఆలోచిస్తున్నాను"

"అంటే? "

"ఈ పసివాడిని అనాథాశ్రమంలో వదిలేస్తే వాడు పెరిగి పెద్దవుతాడు. కాని ఎలా ఒక అనాథలా! తన చుట్టూ ఎందరో పిల్లలు. వాళ్ళంతా తనకు స్నేహితులు. కాని తనకు ఆప్యాయతను పంచేవాళ్ళు అక్కడెవరున్నారు? ఆకలి తీర్చుకోవడం మనిషి ప్రాథమిక అవసరం. కాని అయితే ఆకలి తీరిన శరీరం ఆ తర్వాత తనవాళ్ళ గురించి ఆలోచిస్తుంది. తనకు ఆప్యాయతను పంచే వాళ్ళకోసం అర్రులు చాస్తుంది. ఆప్యాయత దొరకనప్పుడు ఒక అనాథ మానసికంగా ఎంతో బాధపడే అవకాశం ఉంది. ఈ ప్రపంచంలో తనకెవ్వరూ లేరని కుమిలిపోయే పరిస్థితీ కలుగుతుంది. వీడిని వీడిని అలాంటి స్థితిలోకి నెట్టడం నాకిష్టం లేదు"

రమేష్ ముఖంలో మరింత విసుగు కదలాడింది.

"మరి అనాథాశ్రమంలో వదలక పిల్లాడినేం చేస్తావ్? "

"నా దగ్గరే ఉంచుకుంటా"

"నీ దగ్గరే అంటే... వాడిని ఇలాగే పెంచుకుంటావా? కాలేజీ మానేస్తావా? "

మౌనిక కూడా ఆ ప్రశ్నకు సమాధానం ఎలా ఉంటుందోనని కాస్త కంగారుపడింది. 'ఒక అనాథను పెంచడంకోసం అతడు తన భవిష్యత్తును త్యాగం చేయబోతున్నాడా? '

నిఖిలేష్ తల అడ్డంగా ఆడించాడు.

"లేదు... నేను కాలేజీ మానేయబోవడం లేదు"

"కాలేజీ మానేయకుండా పిల్లాడ్ని పెంచడం ఎలా కుదురుతుంది? "

# ఏరినముత్యాలు

★ ఎవరైతే ఏకాగ్రతతో ఏదైనా ఒక విషయంపై దృష్టిని కేంద్రీకరిస్తారో అట్టివారు చివరకు ప్రతి పనినీ సాధించగలరు.

– మహాత్మాగాంధీ

★ ఏ వృత్తీ లేకపోవడం విశ్రాంతి కాదు. ఏ వృత్తీ లేని మనసు వ్యాకులభరితం కాగలదు.

– కూపర్

★ అజీర్ణం సృష్టించిన నిరాశా శిశువులే స్వప్నాలు.

– చర్చిల్

★ మౌనం ఎల్లప్పుడూ భూషణం కాజాలదు. అది అప్పుడప్పుడు అపరాధమౌతుంది.

– అనన్

★ ప్రార్థన చేసేవారు మనసులోని కోరికను బయట పెట్టకూడదు. భగవంతుని సన్నిధిలో నీ కోర్కెలని బయటపెట్టడం ప్రార్థన కాదు.

– సౌత్

★ పరుగెత్తేవారు వెనక్కి చూడకుండా ఎలా పరుగెత్తుతారో, విజయం వైపు పయనించేవారు కూడా ముందుకే గానీ వెనక్కు చూడకూడదు.

– మేస్కియో

★ విషం తన ప్రభావాన్ని ఒక్కసారే చూపుతుంది. కానీ ఒక చెడ్డ పుస్తకం చాలా కాలం వరకూ మనసులని విషమయం చేస్తూనే ఉంటుంది.

– జాన్‌ముర్రే

★ తాము విశ్వసించి, కృషి చేసే ఆదర్శానికి ప్రమాదం వచ్చినప్పుడు నిజాయితీ పరులు ప్రతిఘటిస్తారు..

– ప్యూజిక్

★ వాయువు, నీరు, వెలుగు వలె విజ్ఞానము కూడా అందరికీ అందుబాటులో ఉండాలి. ఆనాడే గ్రంధాలయోద్యమం ఆశయం నెరవేరుతుంది.

– చిలకమర్తి

★ సాహిత్యం ప్రజను జ్ఞానవంతులుగా చేస్తుంటే వారు ఇంతకుపూర్వం కన్నా బాగా జీవించడానికి తోడ్పడుతుంది.

– ఇల్యా ఎహ్రెన్ బర్గ్

★ అరణ్యాలు అపరిమితమైన ఉదారత గలవి. తాము ఏవీ కోరక ఉత్పత్తులను ఉదారంగా అందజేస్తాయి.

– గౌతమబుద్ధుడు

సేకరణ: పట్నం శేషంశెట్టి

"పగలంతా బాబుని బేబీకేర్ సెంటర్‌లో ఉంచేసి రాత్రులు వాడ్ని నా దగ్గరకు తెచ్చేసుకుని పెంచుతాను"

"ఏమోరా! నీ పద్ధతి మాత్రం నాకు నచ్చలేదు"

"నాకు నచ్చింది"

"అయితే ఆ ఖర్మను అనుభవించు" కాస్త కోపంగానే అన్నాడు రమేష్.

నిఖిలేష్ నవ్వి ఊరకుండిపోయాడు.

ఇక ఆ సంభాషణ అలా కట్ కావడంతో నిఖిలేష్ వెళ్ళి స్టౌమీద చాయ్‌ని పెట్టాడు.

మూడు కప్పుల్లో పోసుకుని తెచ్చి వాళ్లిద్దరికీ చెరొకటి ఇచ్చి తనొకటి ఉంచుకున్నాడు.

చాయ్ తాగాక వాళ్ళిద్దరూ మరికాసేపు కూర్చున్నారు.

అప్పటికీ రమేష్ కదల్లేదుగాని, మౌనిక లేచింది. "నేవెళ్ళొస్తానండీ" రమేష్ కూడా చప్పున లేచాడు. "పదండి మిమ్మల్ని బస్టాప్‌లో డ్రాప్ చేస్తాను"

ఆమె వద్దనలేదు.

"నేను రేపు కలుస్తానురా" రమేష్ బయటకు నడుస్తూ చెప్పాక నిఖిలేష్ తలాడించాడు.

రమేష్, మౌనికలు రూమ్‌లోనుండి బయటకు నడుస్తుంటే అతడు వాళ్ళిద్దరి కేసి తదేకంగా చూశాడు. మిత్రుడి మనసు తెలిసి ఉండడంవల్ల కాబోలు ఆ దృశ్యం తనకు చాలా ఆనందాన్ని కలిగించింది.

అయితే-

వాకిటవరకూ వెళ్ళాక మౌనిక ఆగి తల తిప్పి చూసింది.

అటువైపే చూస్తున్న నిఖిలేష్ అప్రయత్నంగానే ఆమె చూపుల్లో చూపులు కలిపాడు.

ఎప్పుడయితే అలా ఆమె చూపుల్లో చూపులు కలిపాడో, ఆ మరుక్షణమే అతడు తడబడవలసివచ్చింది.

ఎందుకంటే- మౌనిక చూపులు అదోలా ఉన్నాయి. ఆ చూపులకు అర్థమేమిటో తనకు అర్థం కావడంలేదుగానీ, అవి అర్థవంతంగానే కనిపిస్తున్నాయి.

ఇంతకీ ఆ చూపులకు అర్థమేమిటి?

మౌనిక తల తిప్పుకుని బయటకు నడిచింది. మరు సెకనులోనే ఆ జంట కనుమరుగయింది.

నిఖిలేష్ కొద్దిక్షణాలు అలాగే నిలబడిపోయాడు.

అతడు మరికాసేపు అలాగే ఉండిపోయేవాడేమోగానీ, వెనుకనుండి పిల్లవాడి ఏడుపు వినిపించింది.

నిఖిలేష్ ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చి పిల్లవాడివైపు నడిచాడు.



**బే**బీ కేర్ సెంటర్!

సిటీ సంస్కృతిలో గత కొద్దికాలం క్రితమే మొదలై భవిష్యత్‌లో మరింత విస్తరించబోతున్న లాభసాటి వ్యాపారం అది.

నగరాలలో జనం చిన్న కుటుంబాలనే ఇష్టపడుతున్నారు.

సాధారణంగా ఒకడు ఉద్యోగ ప్రయత్నాలలో సిటీ చేరుతాడు. ఎలాగోలా చిన్నదో,

పెద్దదో ఉద్యోగం సంపాదించుకుంటాడు. హైదరాబాద్ మహానగరంలో ఉద్యోగం చేస్తున్నాడని అనగానే సిటీ వాతావరణం తెలియని ఆడపిల్లల తల్లిదండ్రులు మంచి కట్నంతోనే అమ్మాయిని ఇవ్వడానికి ముందుకొస్తారు.

పెళ్ళి జరిగిపోతుంది. అతడు అమ్మాయిని తీసుకుని సిటీలో కాపురం పెడతాడు.

అప్పటివరకూ బ్యాచ్‌లర్ రూమ్‌లో ఉండే వాడు ఇప్పుడు భార్యను తీసుకురావడంవల్ల రెండు, మూడు గదుల ఇల్లు తీసుకుంటాడు. ఆ కొత్త కాపురానికి కావలసినవన్నీ సమకూర్చుకుంటాడు. వచ్చిన కట్నం వస్తువులకు సరిపోగా, వస్తున్న జీతం సంసారానికి జరిగిపోతూ ఉంటుంది.

అయితే తను సిటీకి వచ్చింది కేవలం కడుపు నింపుకోడానికేనా అన్న అసంతృప్తి కొద్ది నెలలకే మొదలవుతుంది. 'ఇలా ఎవరిదో ఇంట్లో నెలనెలా కిరాయి కడుతూ ఉండడమేమిటి? జీవితాంతం ఒక ఇంటి నుండి మరో ఇంటికి మారుతూ స్థిరమైన గూడు లేకుండా గడపడం ఏం బాగుంటుంది? వెంటనే కాకపోయినా ఓ రెండేళ్ళకో, మూడేళ్లకో ఓ చిన్నగూడు ఏర్పరుచుకుంటే బాగుంటుంది...'

భార్యాభర్తలిద్దరూ ఇలా ఆలోచించుకున్నాక, ఆ అమ్మాయి ఏ కాస్త చదువుకున్నా, ఉద్యోగ ప్రయత్నాలు చేయిస్తాడు అతడు. రిసెప్షనిస్ట్, కండక్టర్, సేల్స్‌గర్ల్, సేల్స్ ఎగ్జిక్యూటివ్, టీచర్, క్లర్క్, దొరికితే గవర్నమెంట్ ఉద్యోగం, దొరక్కపోతే ప్రైవేట్ ఉద్యోగం.

ఉద్యోగం దొరక్కపోతే ఏదో స్వయం ఉపాధి పథకమయినా ఆమె చేపట్టి తీరుతుంది. ఇరుగుపొరుగు పిల్లలకు ట్యూషన్లు చెప్పడం, ఇంట్లో కుట్టుమిషన్ కుట్టడం, బట్టలు అమ్మడం, ఇప్పుడిప్పుడే సినిమా మీడియాలో వస్తున్న నటన, డబ్బింగ్‌లాంటిది వృత్తిగా స్వీకరిస్తుంది.

వాళ్ళలా తమ కలల సాఫల్యం కోసం కష్టపడుతుంటే, వాళ్ళ మధ్యకు ఓ బేబీ పుట్టుకొస్తుంది. దాంతో వాళ్ళకు మరింత ఖర్చు పెరుగుతుంది. పెరిగిన ఖర్చు కలల సాఫల్యం రెండింటిని సమన్వయ పరచుకుంటూ ముందుకెళ్ళాలి.

అయితే ఇప్పుడే అసలు సమస్య మొదలవుతుంది.

తమ దంపతుల మధ్యకు ఓ బిడ్డ వచ్చింది. బిడ్డ పుట్టాక ఎలాగూ ఆమె ఓ మూడు నెలలపాటు ఇంట్లోనే ఉండిపోతుంది.

మూడు నెలల తర్వాత కూడా ఆమె ఇంట్లో ఉండడం ఎలా సాధ్యం? ఖర్చులు పెరిగాయి. కలలు అలాగే మిగిలాయి. వాటిని మరింత త్వరగా సాధించాలంటే ఆమె బయటకు వెళ్ళితీరాలి. బయటకెళ్ళాలంటే బిడ్డను ఎవరికి అప్పగించాలి.

'పోనీ పల్లెనుండి కన్నవాళ్ళను పిలుచుకొస్తే ఎలా ఉంటుంది. అయినా తన భార్య ఉద్యోగం చేస్తే అదనంగా రెండు, మూడు వేలు వస్తాయి. రెండు మూడువేలకోసం పెద్దవాళ్లను పల్లెనుండి తీసుకురావడం ఎంతవరకు సబబు? వాళ్ళు సిటీకి వస్తున్నారంటే, తను మరోగది అదనంగా ఉండే ఇల్లు తీసుకోవాలి. మరోగది అదనంగా ఉండడమంటే మరో ఐదొందలు ఖర్చు పెరిగిపోతుంది. అలాగే వాళ్ళ తాలూకు ఖర్చు ఐదొందలు... అదీగాక తమ మధ్యకు ముసలివాళ్ళు రావటంతోనే కొన్ని సరికొత్త సమస్యలు మొదలవుతాయి. అత్తా కోడళ్ళ మధ్య తగాదాలు, ముసలివాళ్ళ అనారోగ్యాలు, వాళ్ళ పాత తరహా పద్ధతులతో వచ్చే కష్టాలు... ఇవన్నీ ఆలోచించుకుంటే, వాళ్ళను సిటీకి తీసుకురావడంకన్నా ప్రత్యామ్నాయం వెతుక్కోవడం మంచిది'

అలా ప్రత్యామ్నాయాల కోసం వెతుకుతుంటే కనిపించేదే బేబీ కేర్ సెంటర్!

ఓ మూడు, నాలుగువందల ఖర్చుతో

తమకు ఎలాంటి ఇబ్బంది లేకుండా తమ బిడ్డను వాళ్ళు చూసుకుంటారని తెలిసి ఆ దంపతులు సంతోషపడతారు.

బేబీకేర్ సెంటర్ వాళ్ళు మూడు నెలల పాపనుండి ఐదేళ్ళ బాబు వరకూ తమ దగ్గర ఉంచుకుంటారు.

అయితే అది హాస్టల్ కాదు. హాస్టల్ అంటే ఇరవైనాలుగు గంటలూ ఆచోట ఉండొచ్చు.

ఈ బేబీ కేర్‌సెంటర్‌లో బేబీలను ఉదయంనుండి సాయంత్రం వరకూ మాత్రమే చూస్తారు. సాయంత్రం ఆఫీసునుండి తిరిగి వెళ్ళేటప్పుడు ఎవరయినా తమ బిడ్డను తీసుకెళ్ళాల్సి ఉంటుంది.

ఉదయమే బిడ్డను అప్పగించేప్పుడు, పిల్లాడికివ్వాల్సిన పాలు, బిస్కెట్స్ లాంటివి బాక్స్‌లో పెట్టి ఇవ్వాలి. అలాగే మలమూత్ర విసర్జనలప్పుడు మార్చడానికి బట్టలూ ఇచ్చివెళ్ళాలి.

బేబీ కేర్‌సెంటర్‌లో నిర్వాహకులు కాక ఒకరిద్దరు ఆయాలుంటారు. వాళ్లు పిల్లల్ని ఆడించడం, వాళ్ళ మలమూత్రాదులను శుభ్రం చేయటం, వాళ్ళకు వేళకు తాగించడం చేస్తుంటారు. అయితే మలమూత్రాదులతో తడిసిన బట్టలను ఓ కవర్‌లో పెట్టి ఉంచుతారు. సాయంత్రం పేరెంట్స్ తమతో కవరు తెచ్చుకుని వాటిని శుభ్రం చేసుకోవలసి ఉంటుంది.

నిఖిలేష్‌కి బేబీ కేర్‌సెంటర్‌ల గురించి ఆమాత్రం అవగాహన ఉండడంతో అతడు తన సమస్య సులువయిందే అనుకున్నాడు.

మొదటిరోజు బిడ్డను బేబీ కేర్‌సెంటర్‌లో ఇచ్చేసి సంతోషంగా కాలేజీకి వెళ్ళిపోయాడు.

అయితే నాలుగు రోజులకే అతడికి ఓ విసుగులాంటిది వచ్చేసింది.

అంతేకాదు... తల్లి తన బిడ్డకు చిన్న వయసులో ఎంత సేవ చేయాల్సి ఉంటుందో, ఆ పసివాడు తన దగ్గరకు వచ్చిన నాలుగురోజులకే అర్థమయిపోయింది నిఖిలేష్‌కి.

కాలేజీనుండి రూమ్‌కి చేరుకునేప్పుడు, బేబీ కేర్‌సెంటర్‌లో వాడిని చంకనెత్తుకోగానే 'కేర్'మంటూ ఏడుపు మొదలెడతాడు. ఒకవేళ ఏడవడం లేదని సంబరపడిన మరుక్షణం చొక్కా తడిపేస్తాడు. ఇంటికెళ్ళాక వాడికి గోరువెచ్చటి నీళ్ళలో, గుడ్డ ముంచి ఒళ్ళు తుడవాలి. పౌడరు వెయ్యాలి. పాలు పట్టాలి. వీటికి పనిమనిషిని పెట్టినా అటుపైన వాడు నిద్రపోయేవరకూ ఎత్తుకుని ఊయలలో పడుకోబెట్టి ఊపినట్టు ఊపాలి.

అప్పుడే నిఖిలేష్‌కి తల్లి బిడ్డను పెంచటంలో ఉండే కష్టమేమిటో తెలిసొచ్చింది. అందుకేనేమో అంత కష్టపడి పెంచిన బిడ్డ మీద ఆ తల్లికి అంత మమకారం ఉంటుంది.

అయినా తల్లీబిడ్డల మమకారమేమోగానీ తనకు వాడిపట్ల అంత బాధ్యత ఎందుకుండాలి?

అసలు వాడెవడు? వాడి కోసం తనింతగా పాకులాడాల్సిన పనేముంది?

వాడు వచ్చాక తన జీవన విధానం పూర్తిగా అస్థవ్యస్థమయింది.

అర్ధరాత్రివరకూ వాడు నిద్రపోడు. అలా అని ఎండబడేవరకూ నిద్రపోతాడా అంటే, నిద్రపోడు. ఏ తెల్లవారుజామునో లేచి కూర్చుంటాడు. అర్ధరాత్రి వరకూ మేలుకుని ఉండడంతో తనకు తెల్లవారుజామునే నిద్ర లేవాలనిపించదు. కాని వాడు ఏడుస్తూ ఉంటే నిద్రపట్టదు. అలాంటివేళ ఎంత విసుగొస్తుందంటే, లాగి వాడి చెంప ఛెళ్లుమని పించాలనిపిస్తుంది. అంతలోనే చెంప పగలగొట్టినా వాడికేం తెలుస్తుంది? వాడికి ఆలోచించే శక్తి ఉండి ఉంటే తననెందుకు కొట్టాడోనని ఆలోచిస్తాడు. ఒకవేళ తనది తప్పనిపిస్తే ఆ తప్పును సరిదిద్దుకోవడానికి ప్రయత్నిస్తాడు.

అయినా ఆ వయసులో ఏడవడం తప్పెలా అవుతుంది. ఈ ప్రపంచంలో ప్రతి మనిషీ శిశువుగా ఉన్నప్పుడు ఇంచుమించు ఒకేలా ప్రవర్తించి ఉంటాడు. ఏమీ తోచకపోతేనో, ఆకలేస్తేనో, విసుగ్గా అనిపిస్తేనో ఏడవడం, అంతలోనే నవ్వుకోవడం, సమయం సందర్భం లేకుండా పక్కను తడిపేయడాలు... ఇవన్నీ 'శిశువు' అనే పదం యొక్క సర్వసాధారణ లక్షణాలు.

మరి తనకు కోపం రావడంలో అర్థమేమయినా ఉందా?

అలా అనిపించడంతోనే కోపం తగ్గిపోతుంది. వాడి పనులు చేసి వాడిని పడుకోబెట్టి మళ్ళీ తన పనులలో మునిగిపోతాడు.

కాలేజీకి బయల్దేరేప్పుడు వాడి నెత్తుకుని బేబీ కేర్ సెంటర్‌లో వదిలేసి వెళ్ళిపోతాడు. తిరిగి సాయంత్రమో, రాత్రో వెళ్ళి వాడిని తన వెంట తెచ్చుకుంటాడు.

ఇది తన దినచర్య.

ఇలా తను వాడితో కష్టాలు పడుతుంటే, ఆ కష్టాలు చాలవన్నట్టు ఇరుగు పొరుగు నుండీ తనకు ఇబ్బందులు మొదలయ్యాయి.

ఒక బ్రహ్మచారి గదిలో ఒక పసివాడు ఉండడం, వాడిని ఉదయాన్నే తను తీసుకెళ్ళడం, సాయంత్రం తీసుకురావడం, వాడిని తనే పెంచి పోషించడం ఇవన్నీ గమనించాక ఇరుగు పొరుగు అడగడం మొదలుపెట్టారు.

"ఆ బేబీ ఎవరండీ? "

"అది... అది..." తను మొదట తడబడేవాడు.

ఆ ప్రశ్నకు వెంటనే జవాబు చెప్పడం సాధ్యపడే విషయం కాదు. 'ప్రసవ వేదన పడుతున్న ఓ ఆడపిల్లను రైల్వేస్టేషన్ దగ్గర చూడడం, ఆమెను హాస్పిటల్‌లో చేర్చటం, ఆమె బిడ్డను కని పిల్లాడ్ని వదిలేసి వెళ్ళిపోవడం' ఇవన్నీ చెపితే ఎవరయినా నమ్ముతారా?

వాళ్ళు నమ్ముతారో, నమ్మరో అన్న డైలమా ఉన్నప్పటికీ తను సర్దుకుని వాళ్ళకు జరిగిందంతా వివరించేవాడు.

కొందరు నమ్మేవాళ్ళు. మరికొందరు వెనక్కు తిరిగి నవ్వుకునేవాళ్లు.

"మరీ చెవిలో పువ్వు పెడుతున్నాడు. రైల్వేస్టేషన్‌లో ఆడపిల్లట, హాస్పిటల్‌లో చేరిస్తే బిడ్డను కని వదిలేసి వెళ్ళిపోయిందట. పిల్లాడ్ని ఏ సంబంధం లేకుండానే తను తెచ్చిపెంచుకుంటున్నాడట. వినేవాళ్ళంతా అమాయకులు అనుకుంటున్నట్టున్నాడు. బహుశా ఏ గర్ల్‌ఫ్రెండ్‌కో కడుపు చేసి ఉంటాడు, ఆ అమ్మాయి బిడ్డను కనేసి ఇతడిముందు పడేసి వెళ్ళిపోయుంటుంది"

వాళ్ళ మనసుల్లో మెదలాడే అనుమానాలు తనకు అర్థమవుతూనే ఉన్నాయి. కానీ తనేం చేయగలడు. ఏం చెప్పి వాళ్ళను నమ్మించగలడు?

అయినా ఒకరికి సంజాయిషీ చెప్పుకోవలసిన అవసరం తనకు లేదు.

ఇలా ఇతరుల అనుమానాలు, పిల్లవాడితో కష్టాల మధ్య తను నలిగిపోతుంటే ఓరోజు కాలేజీలో మౌనిక అతడిని పలకరించింది.

"హలో నిఖిలేష్‌గారు!..."

రమేష్‌తో కలిసి క్లాస్‌రూమ్‌లోంచి నడుస్తున్న అతడు తలతిప్పి ఆమెను చూశాడు. ఆమె దగ్గరగా నడిచాక అడిగాడు.
"చెప్పండి మౌనికగారూ!"

"ప్రత్యేకించి ఏమీలేదు. బాబు విషయం మిమ్మల్ని అడగాలని పలకరించానంతే"

పిల్లాడు అప్పుడే గుర్తొచ్చాడేమో అతడి ముఖంలో అదోరకమైన ఇబ్బంది కదలాడింది. అతడు మరేం మాట్లాడలేదు.

ఆమె అంది, "రండి... అలా మాట్లాడుకుంటూ వెళ్దాం"

అతడు తలాడించి రమేష్‌ని తన దగ్గరగా రమ్మని సైగ చేశాడు. ముగ్గురూ కలిసి కారిడార్‌లోంచి బయటకు నడవసాగారు.

"చెప్పండి బాబు ఎలా ఉన్నాడు?"

"వాడికేం బాగానే ఉన్నాడు. ఏదయినా బాగోలేదని చెప్పాల్సివస్తే అది నేనే" నవ్వు రాకపోయినా నవ్వాడు నిఖిలేష్.

"బాగోలేకపోవడం అంటే?"

"బాగోలేదంటే ఏమని చెప్పాలి? ఇంట్లో ఉన్నంతసేపూ వాడి ఏడుపులు వినాలి. వాడి పనులే చేస్తుండాలి. దీంతో నా చదువు అటకెక్కిపోయింది. చదువు పోతే పోయింది. ఇరుగుపొరుగు కూడా నాకేసి అనుమానంగా చూస్తున్నారు"

"అనుమానంగా చూడడమా?"

"అవునండీ! ఆ బిడ్డ పరాయివాడంటే ఎవ్వరూ నమ్మడంలేదు. వాళ్ళంతా ఆ బిడ్డ నా బిడ్డే అయి ఉండొచ్చని అనుకుంటున్నారు"

ఆమె దీర్ఘంగా నిశ్వసించింది. "ఒక మంచి పని చేసేటప్పుడు లోకాన్ని పట్టించుకోకూడదు. లోకాన్ని దృష్టిలో పెట్టుకుంటే మంచిపని చేయలేం"

అప్పటికే ముగ్గురూ కొద్దిదూరం నడిచారు. ఇక వాళ్ళిద్దరూ కారువైపు, ఆమె బస్టాప్‌వైపు నడవాల్సి ఉంది. అందుకే ఆ చోట ఆగారు.

ముగ్గురూ ఆగాక రమేష్ అన్నాడు, "ఏదేమయినా వీడి వ్యవహారం మాత్రం నాకు నచ్చడంలేదండి మౌనికగారు! ఆ పిల్లవాడొచ్చాక వీడి చదువు అటకెక్కింది. ఈ నాలుగు రోజులకే ముఖం సగం పీక్కుపోయింది. మరి రాత్రీపగలూ నిద్ర లేకపోతే ముఖం పీక్కుపోదా మరి... వీడి వ్యవహారం చూస్తుంటే జనాల అనుమానాలు పక్కన పెడితే, నాకూ ఓ భయం పట్టుకుంది. వీడిలా పిల్లవాడిని తన దగ్గరే ఉంచుకుంటే రేపు వీడిని ఎవరయినా పెళ్ళి చేసుకుంటారా... చెప్పండి?"

మౌనిక కొద్దిగా కలవరపడినట్లు నిఖిలేష్ కేసి చూసింది.

"పెళ్ళి కాకముందే ఒక బిడ్డకు తండ్రిగా ఉన్నవాడికి పిల్లనివ్వడానికి ఎవ్వరూ ముందుకురారు. పిల్లవాడు ఎవరనీ, ఎక్కడవాడని ఎంక్వయిరీ చేస్తారు. ఖచ్చితంగా ఇదేదో అక్రమ వ్యవహారమని అనుమానిస్తారు. అలాగే ఏ ఆడపిల్లయినా తనకు పెళ్ళయ్యాక కొద్దిరోజులపాటు ఏ బాదరబందీ లేకుండా భర్తతో సుఖాలను అనుభవించాలనుకుంటుందేగానీ, పెళ్ళయిన మర్నాటినుండే పిల్లాడితో కష్టాలను కొని తెచ్చుకోవాలనుకోదు. పైగా ఏ అమ్మ కన్నబిడ్డకో తను సేవలు చేయాల్సి వచ్చినందుకు తప్పకుండా బాధపడుతుంది..."

నిఖిలేష్‌కి ఆ టాపిక్ అసలు ఇష్టం లేనట్టుంది. అందుకే అన్నాడు, "అబ్బా! ఎప్పటిదో విషయం గురించి, ఇప్పుడే ఇంత చర్చ ఎందుకురా?"

"ఎప్పటి విషయమైనా సమస్య ఎదురు నిలిచినప్పుడే కాదు, ముందునుంచి ఆలోచించుకుని ఉంటే అప్పుడు గతంలో తప్పుచేశామన్న ఫీలింగు ఉండదు"

"సర్లేరా! కొద్దిరోజులు ఓపిక పట్టు. ఏదో ఒకటి ఆలోచిస్తాలే" అన్నాడు నిఖిలేష్.

మౌనికకు ఇక మాట్లాడవలసిందేమీ లేదనిపించిందేమో "నేను వెళ్ళొస్తానండీ" అంది వారిద్దరితో.

వాళ్ళిద్దరూ తలాడించారు.

మౌనిక పదడుగులు ముందుకు వెళ్ళాకే, వాళ్ళిద్దరూ కారువైపు నడిచారు.

కార్లో కూర్చున్నాకే నిఖిలేష్‌కి రమేష్ విషయం గుర్తుకొచ్చింది. 'ఈమధ్యకాలంలో పిల్లవాడి తాలూకూ ప్రాబ్లమ్‌తో తను రమేష్‌పట్ల తనకున్న బాధ్యతను పూర్తిగా మర్చిపోయాడు... మౌనికకు రమేష్ ప్రేమ విషయం చెప్పడం తనకు సాధ్యపడలేదు'

ఆ మాటే అతడు రమేష్‌తో అన్నాడు. "సారీరా! నేను నీ ప్రేమ విషయంలో ఇంత కాలం తాత్సారం చేస్తూనే వస్తున్నాను"

"నువ్వు అనవసరంగా ఓ సమస్యలో చిక్కుకుని అల్లాడిపోతున్నావ్. ఇలాంటి

సమయంలో నువ్వు అలాంటి మాటలు మాట్లాడలేవు. ఒకవేళ నువ్వు ఇప్పుడు ఆమెతో ఆ మాట చెప్పినా ఆమె నిన్ను అదోలా చూస్తుంది. నువ్వు కన్విన్సింగ్‌గా మాట్లాడే స్థితిలో లేవు కాబట్టి ఆ ప్రేమ సందేశాన్ని కొద్దిరోజులపాటు పోస్ట్‌పోన్ చేయడం మంచిది"

నిఖిలేష్ తలాడించాడు.

కారు నిఖిలేష్ రూమ్‌ముందు ఆగింది.

నిఖిలేష్ కారు దిగి "బై రా" అంటూ ముందుకు నడిచాడు.

★ ★ ★

అదేరోజు రాత్రి డైనింగ్ టేబుల్‌ముందు కూర్చున్న మౌనిక భోజనంపళ్లెంలో చెయ్యి ఉంచి కెలుకుతూ ఉంటే, చూసిన కృష్ణమోహన్ అడిగాడు, "మౌనీ! ఏంటమ్మా ఆలోచిస్తున్నావ్? "

ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చిన మౌనిక అన్నయ్య ముఖంలోకి చూసి తడబాటుగా తల అడ్డంగా ఆడిస్తూ "ఏం లేదు... ఏం లేదులే" అంది.

"లేదమ్మా! నువ్వెందుకో చాలా పరధ్యాసగా కనిపిస్తున్నావ్"

"పరధ్యాసగా కనిపిస్తున్నానా? " ఎదురు ప్రశ్నించినట్టు అన్నాక నిలువుగా తలాడించింది. "అవును! కొంతవరకూ పరధ్యాసగానే ఉన్నానేమో"

ఈసారి కృష్ణమోహన్‌తోపాటు, వైదేహి కూడా మౌనిక ముఖంలోకి పరిశీలనగా చూసింది.

"పరధ్యాస ఎందుకమ్మా? "

"ఓ పసివాడి గురించిన ఆలోచనలవల్ల పరధ్యాస వచ్చేస్తోంది"

"కాస్త వివరంగా చెప్పు మౌనికా"

మౌనిక నిఖిలేష్ గురించి, అతడు తెచ్చి పెట్టుకున్న పసివాడి గురించీ వివరాలు చెప్పింది.

కృష్ణమోహన్ చాలా ఆశ్చర్యపోయాడు. "ఏంటి? ఒక కాలేజీ స్టూడెంట్ ఎవరో ప్రసవవేదన పడుతుంటే హాస్పిటల్‌లో చేర్చి ఆమె బిడ్డను కని, వదిలేసిపోతే ఆ బిడ్డను తెచ్చుకుని పెంచుతున్నాడా? ఎవరమ్మా అంత అమాయకుడు? "

"ఓరోజు బుక్స్‌కోసం కోఠీ వెళ్ళేందుకు నువ్వు నన్ను కాలేజీదగ్గర పికప్ చేసుకున్న రోజు నాతో మాట్లాడుతున్న నా క్లాస్‌మేట్ నిఖిలేష్ గురించి నీకు చెప్పానూ..."

కృష్ణమోహన్‌కి వెంటనే గుర్తొచ్చి "ఆ... ఆ... గుర్తుకొచ్చింది. సన్నగా, పొడవుగా... స్మార్ట్‌గా ఉంటాడు ఆ కుర్రాడేనా? "

"ఆ... ఆ... అతనే"

అప్పుడే వైదేహికీ నిఖిలేష్ గుర్తొచ్చినట్టుంది.

"మౌనికా, ఆరోజు హాస్పిటల్‌లో మనల్ని పలకరించిన అతనేకదూ నిఖిలేష్"

"అతనే" అంది మౌనిక.

"అంటే ఆరోజు మనం హాస్పిటల్‌లో పలకరించిన అమ్మాయి, బిడ్డను వదిలేసి వెళ్ళిపోయిందా? "

ఈసారి మౌనిక నిలువుగా తలాడించింది.

"అయ్యో పాపం! తనేదో ఆమెకు మంచి చేయాలనుకుంటే, ఆయనకే జంజాటం తగిలించి వెళ్ళిపోయిందా ఆ అమ్మాయి... భలే అమ్మాయే... ఆ అమ్మాయిమీద నేను అనవసరంగా జాలిపడ్డాను"

మౌనిక వైదేహికేసి చూసి నవ్వింది. 'ఈమెకు స్థిరమైన అభిప్రాయాలంటూ ఏవీ ఉండవనుకుంటా. ఈ నిమిషం ఒకరిని వెనకేసుకొస్తే, మరు నిమిషమే ఆ మనిషిలో తప్పులు పట్టడం మొదలుపెడుతుంది'

కృష్ణమోహన్ భోంచేయడం తిరిగి మొదలుపెడుతూ, "భోం చేస్తూ మాట్లాడుకుందాం. భోం చెయ్యి" అన్నాడు చెల్లెలితో.

మౌనిక అన్నం కలపసాగింది.

కృష్ణమోహన్ రెండుముద్దలు తిన్నాక చెల్లెలివైపు తలెత్తి చూశాడు. "ఏదేమయినా



నిఖిలేష్ భవిష్యత్ దృష్ట్యా చూస్తే అతడు చేసింది మంచిపని కాదేమోననిపిస్తోంది మౌనికా"

"కానీ పసివాడి కోణంలోంచి చూస్తే అతడు చేసింది మంచిపనే అని నేననుకుంటున్నాను అన్నయ్యా"

కృష్ణమోహన్ వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. అయితే కాస్త తటపటాయించాక అన్నాడు, "పసివాడి కోణంలోంచి చూస్తే అది మంచిపనే కావచ్చేమోగానీ అతడి గురించి కూడా ఆలోచించు. పిల్లల పెంపకం అనేది మగాడికి తెలియని విద్య. దానివల్ల ఒక పిల్లాడిని దగ్గరుంచుకుని లాలించి, పాలించాలంటే అతడి తల ప్రాణం తోకకొస్తుంది. అంటే అతడి జీవితంలో విసుగు, చిరాకు, కోపం, ఆందోళన లాంటివి మొదలవుతాయి. దాంతోపాటే అతడు కాలేజీ లైఫ్‌లో ఉండే అసలు సిసలు ఆనందాన్ని ఇకమీదట మిస్ చేసుకోబోతున్నాడు. ఇదంతా ఒక ఎత్తయితే అతడు రాత్రింబవళ్ళు కష్టపడుతూ మెడికల్ సీట్ సంపాదించి, సాధించిన ఫలితమంతా ఈ

ఒక్క దెబ్బతో కొట్టుకుపోతుంది. పిల్లాడ్ని పెంచడం మొదలుపెట్టాక ఇక అతడు చదువుమీద కాన్‌సన్‌ట్రేషన్ ఏం చేయగలడు? అతడి చదువు అటక ఎక్కినట్లేనని మనం అనుకోవచ్చు"

మౌనిక "అదీ నిజమే" అంది.

అది కేవలం చర్చే కాబట్టి నిర్ణయాలు తీసుకోవడమంటూ ఏమీలేదు కాబట్టి, అలా అన్నాక కృష్ణమోహన్ తలొంచుకుని భోంచేయసాగాడు.

మౌనిక కూడా తలొంచుకుని అనాలోచితంగానే కడుపు నింపుకుంటోంది.

ఆచోట కాసేపు నిశ్శబ్దం కదలాడాక వైదేహి నిశ్శబ్దాన్ని పక్కకు నెట్టింది.

"అన్నట్టు ఎప్పుడయినా ఓరోజు పిల్లాడ్ని ఓసారి మనింటికి తీసుకురా మౌనికా! వాడిని మనం ఓ రెండు మూడు రోజులు ఉంచుకుందాం"

వదినగారి మాటలు ఆ క్షణం మౌనికకు కాస్త ఆనందాన్నే కలిగించాయి. 'అలా చేస్తే నిఖిలేష్ కష్టంలో కాస్త పాలు పంచుకున్నట్టుంటుంది' అనుకుందామె.

"అలాగే వదినా" అందామె చిరునవ్వుతో.

మొత్తంమీద తన పరధ్యాస కొంత ఫలితాన్ని సాధించినట్టే ఫీలయింది మౌనిక.

★ ★ ★

మరో వారంరోజులు గడిచేసరికి నిఖిలేష్‌కి పిచ్చెక్కిపోయింది.

'తనిక ఆ పసివాడిని దగ్గర ఉంచుకోలేనన్న అభిప్రాయానికి వచ్చేశాడు అతడు. 'పిల్లాడ్ని దగ్గరుంచుకుంటే, తన చదువుకే కాదు, ఆరోగ్యానికి హానికరమయ్యేలా ఉంది'.

అందుకే అతడు ఓ నిర్ణయానికొచ్చాడు.

పసివాడిని తీసుకుని ఓ అనాథాశ్రమం చేరాడు. ఆ ఆశ్రమ సెక్రటరీని కలిశాడు.

అరవై ఏళ్ళుంటాయేమో ఆయనకు. మాసిన బట్టలతో ఉన్నా, ముఖంలో చాలా ప్రశాంతత కనిపిస్తోంది. బహుశా జీవితంలో సుఖదుఃఖాలు చవిచూశాక, జీవనతత్వం తెలుసుకుని, మనసును అంతర్ముఖం చేసి సాధనతో తనను తాను తెలుసుకున్నాకే కలిగే ప్రశాంతత అది.

ఆయనకు జరిగిన కథంతా చెప్పాక, ఆ పసివాడిని ఆ ఆశ్రమంలో వదిలేయాలనుకుంటున్నట్టు చెప్పాడు.

అంతా విన్నాక ఆయన చిన్నగా నవ్వి చెప్పాడు.

"నాకు ఈ బిడ్డను తీసుకోవడానికి ఎలాంటి అభ్యంతరం లేదు బాబూ! ఇక్కడ తొంభైమంది పిల్లలున్నారు. మీరు ఈ పిల్లాడిని వదిలేస్తే తొంభై ఒక్కమంది పిల్లలవుతారు. ఒక్క పిల్లవాడు నాకు భారం కాబోడు. కొందరు పుణ్యాత్ములు కొంత 'నిధులు' సమకూర్చారు. దాంతో ఈ అనాథ శరణాలయం సాఫీగా సాగిపోతోంది. పిల్లల పోషణకు ఎలాంటి ప్రాబ్లమ్‌లేదు. కానీ నేనిలా ఎందుకంటున్నానంటే ఒక బిడ్డను అనాథను చేసేముందు, అనాథ బిడ్డల బతుకులు ఎలా ఉంటాయన్నది మీరు తెలుసుకుంటే బాగుంటుందని..."

"అయ్యా! ఈ బిడ్డ నా బిడ్డ అయితే వీడిని అనాథను చేస్తున్నానేమోనని నేను బాధపడాలి. వీడు నా బిడ్డ కాదని మీకు చెప్పాగా. ఒక అయోగ్యురాలికి సహాయం చేయబోతే ఆమె కృతఘ్నతతో ఈ బిడ్డను నాకు అంటగట్టి తప్పించుకుంది. కన్నతల్లికే బిడ్డమీద మమకారం లేనప్పుడు నాకు మాత్రం ఉండవలసిన అవసరం ఏముంది? మీరే చెప్పండి"

ఆయన నవ్వాడు. గుబురు గడ్డం కదిలింది. వత్తుగా పెరిగిన మీసాలు గాలికి రెపరెపలాడే ఆకుల్లా ఊగాయి.

"బిడ్డమీద ఆ తల్లికి మమకారం లేకపోయి ఉండొచ్చేమోగానీ, మీలో మాత్రం మానవత్వం ఉంది నాయనా! అందువల్లే హాస్పిటల్‌లో బిడ్డను వదిలేసే అవకాశం ఉన్నా, అలా చేయకుండా నీ దగ్గర ఉంచుకున్నావ్. ఏదో పసివాడు కాసింత విసుగు

కలిగించేసరికి వదిలించుకుందామని ఇంత దూరం వచ్చావ్‌గానీ, నీ వాలకం చూస్తుంటే, ఒకవేళ వాడిని వదిలి వెళ్ళినా, మళ్ళీ వచ్చి తీసుకుపోయేలా ఉన్నావ్"

"అది కాదు మాస్టారూ! వీడిని పెంచి పెద్ద చేసేందుకు నాకు అభ్యంతరం లేదు గానీ, నేను విద్యార్థిని. ప్రతిరోజూ కాలేజీకి వెళ్ళవలసిన అవసరం ఉంది. మరలాంటప్పుడు వీడిని ఇంట్లో వదిలివెళ్ళడం ఎలా సాధ్యం? " అసలు సమస్యను ఆయన ముందుంచాడు నిఖిలేష్.

"మనసుంటే మార్గముండకపోదు"

"ఆ మార్గాలన్నీ ప్రయత్నించి ఇక మరో మార్గంలేదని తెలిసి ఇక్కడకు వచ్చాను"

"మార్గాలన్నీ ప్రయత్నించడమంటే ఏం చేశావు నువ్వు? "

అతడు తను పసివాడిని బేబీ కేర్ సెంటర్‌లో చేర్చి సాయంత్రం రూమ్‌కి వెళ్ళడం లాంటి విశేషాలు ఆయనకు వివరించాడు.

"చాలావరకూ కష్టపడ్డావని అర్థమవుతోంది. కానీ... ఇంకా మనసుపెట్టి ఆలోచించు. ఒక పసివాడిని అనాథను చేయకూడదు అన్న ఆలోచన కలిగితే చాలు. పరిష్కార మార్గాలు అవే లభిస్తాయి"

నిఖిలేష్ ఆయనకేసి ఇబ్బందిగా చూశాడు.

ఆయన నిఖిలేష్ ముఖంలోని ఇబ్బంది గమనించాక చెప్పాడు. "ఒకవేళ అప్పటికీ కష్టమనిపిస్తే అప్పుడయినా మునిగిపోయేదేమీలేదు ఈ అనాథ శరణాలయం గేట్లు మీకోసం తెరిచే ఉంటాయి"

ఇక ఆయన దగ్గర వర్కవుట్ అయ్యేలా కనిపించలేదు. అందుకే ఆయన ముందు నుండి లేచి బయటకు నడవసాగాడు అతడు. 'అసలు తప్పు తనదేనేమో! లేకపోతే సినిమా స్టయిల్లో ఏ తెల్లవారుజామునో అనాథ శరణాలయం వరండాలో వదిలేసి, ఎవ్వరూ చూడకుండా వచ్చేయాల్సింది. ఏదో పెద్ద పోటుగాడిలా తిన్నగా ఆ అనాథ శరణాలయం సెక్రటరీ దగ్గరికే వెళ్ళి 'ఈ బాబుని అనాథ శరణాలయంలో వదిలేస్తున్నాను ఆదరించండి' అంటే, ఆయన 'ఇది తప్పు నాయనా! ఓ పసివాడిని అనాథను చేయడం పాపం' అనక అలాగే అంటూ తలూపుతాడా? ఛ... ఛ... తనదే బుద్ధి తక్కువ. తను అమాయకంగా ప్రవర్తించాడు.

అతడు అనాథ శరణాలయం గేటుదాటి రోడ్డెక్కాడు. దోసిలిలో పసికందు అలాగే ఉన్నాడు.

బిడ్డను పట్టుకుని రోడ్డు అంచునే నడుస్తున్న అతడిని కొద్దిమంది జనం చిత్రంగా చూశారు. పొత్తిళ్ళలోని పాపను ఓ స్త్రీ పట్టుకుని అలా నడుస్తుంటే జనం చిత్రంగా చూడరుగాక చూడరు. ఒక మగాడు పక్కన స్త్రీ లేకుండా పసికందును పట్టుకుని నడవడం చిత్రమేకదా?

టాంక్‌బండ్‌కి చాలా దగ్గరలో ఉంది ఆ అనాథ శరణాలయం. ఆ చోటునుండి వందగజాలు నడిస్తే చాలు టాంక్‌బండ్ చేరుకుంటాం.

అతడు లోయర్ టాంక్‌బండ్ చేరుకున్నాడు. అటుగా వెళ్తున్న ఆటోను ఆపి దిగాల్సిన చోటు చెప్పి ఎక్కి కూర్చున్నాడు. ఆటో ముందుకు కదిలింది.

బిజీరోడ్డు మీద ఆటో వేగంగా పరుగెడుతోంది. నిఖిలేష్ ఆటోలో వెనక్కు వాలి రోడ్డుమీద చూపులు నిలిపాడు.

అది మధ్యాహ్నం కావడంతో రోడ్డు పెద్ద రద్దీగా లేదు. రోడ్డుపక్కనే కొందరు జనం నడిచి వెళ్తున్నారు. వారిలో కొద్దిమంది వడివడిగా నడుస్తుంటే, మరికొందరు నెమ్మదిగా సాగిపోతున్నారు. ఆ జనంలో తక్కువ సంఖ్యలోనే కావచ్చు, ఆడవాళ్ళూ ఉన్నారు. అయితే ఆ ఆడవాళ్ళెవ్వరి చేతుల్లోనూ పసికందులేదు. మరి తన చేతిలోనే ఇలా...

ఆటో సిగ్నల్ దగ్గర ఆగింది. అప్పుడే పసివాడు కదిలాడు. నిద్రలోనుంచి మేలుకు

న్నాడేమో ఒక్కసారిగా ఏడుపు అందుకు న్నాడు. పక్కనే ఆగి ఉన్న వెహికల్స్‌లో నుండి జనం ఆటోలోకి తొంగిచూశారు. ఆటోడ్రైవర్ కూడా వెనక్కు తిరిగి అడిగాడు.

"గదేంటి సార్! బిడ్డను గట్లా తల్లి లేకుండా తీసుకొచ్చిండ్రు? "

వాడి ప్రశ్నకు సమాధానం ఏం చెప్పాలో అర్థంకాలేదు అతడికి. అందుకే నవ్వి ఊరు కున్నాడు. ఆటో డ్రైవర్ ముఖంలో అను మానం కదలాడింది. ఆ విషయం అతడూ గమనించాడు.

ఈసారి మనసులోనే విరక్తిగా నవ్వుకు న్నాడు. 'నా బతుకు చివరికి ఆటో డ్రైవర్ కూడా అనుమానించే స్థితికి దిగజారిందన్న మాట!' మనసులోనే అనుకున్నాడు. అయినా పసివాడిని మగాడు పట్టుకుని తీసుకెళుతుంటే జనాలకు అంత అను మానం ఎందుకు? పొత్తిళ్ళలో పాపను తీసుకెళ్ళే హక్కు ఆడవాళ్ళకే ఉందా? హక్కుల ప్రసక్తి కాకపోయినా ఇది అసహజ దృశ్యం కాబోలు..."

గ్రీన్‌సిగ్నల్ పడింది. ఆటో ముందుకు కదిలింది.

ఒక్కసారిగా చల్లగాలి తనను తాకడంవల్ల కాబోలు పసివాడు ఏడుపు ఆపేశాడు.

అతడు తిరిగి ఆలోచనల్లోకి జారిపో యాడు. ఈ సృష్టిలో తల్లి ప్రేమ అపురూ పమైనదంటారు. తల్లిప్రేమకు సాటి మరొ కటి లేదంటారు. బిడ్డకోసం ప్రాణాలనే త్యాగం చేసేది తల్లి. చివరికి బిడ్డ చేతిలోని తల్లి గుండె కూడా బిడ్డకు చిన్న దెబ్బ తగి లితేనే 'అయ్యో నాయనా! నీకు దెబ్బ తగి లిందా? పాపిష్టిదాన్ని. ప్రాణాలతో ఉండి ఉంటే నీకు సేవ చేసేదాన్ని. నాకా అదృష్టం లేకపోయింది' అని బాధపడే కథలు న్నాయి. మరి తల్లి ప్రేమ అంత గొప్పద యితే ప్రతిరోజూ పేపర్‌లో ఏదోమూల, ఎవర్నీ ఆకర్షించకుండా 'కుప్పతొట్టిలో పసి కందు', 'చెరువులో తేలిన శిశువు శవం' అన్న వార్తలు ఎలా పుట్టుకొస్తున్నాయి? బయటకు వస్తే వార్తవుతుంది. బయటకు రాని నిజాలు ఈ సమాజంలో ఎన్ని దాగి ఉన్నాయోకదా! పల్లెల్లో ఆడపిల్ల పుట్టిందని తెలిస్తే, ఆ శిశువు గొంతులో వడ్లగింజలు పోసి చంపేస్తారట. ఇక పట్నాలు, నగరా లలో ఇష్టంలేని బిడ్డను చంపేందుకు అధు నాతనమైన పద్ధతులు ఎన్నో ఉన్నాయి. ఏ తల్లిలోనో మానవత్వం ఇంకా మిగిలి ఉంటే, కడుపున పుట్టిన బిడ్డను చేజేతులా చంపలేక అనాథ శరణాలయాలలోనో లేక రోడ్డు పక్కనో సజీవంగా వదిలేస్తుంది. శిశు హత్యలు జరగడానికి, కొందరు బిడ్డలు అనాథలుగా మారడానికి కారణాలు ఏవయి తేనేం... ఒక దారుణ మారణకాండ నిరం తరం సాగిపోతూనే ఉంది'

"సార్! ఎటెళ్ళాలి? "

అతడు ఆలోచనల్లోనుండి తేరుకున్నాడు. తలతిప్పి అటూ ఇటూ చూసి తనెక్కడు న్నాడో గమనించి, "అదిగో అటు పోనివ్వు" చెప్పాడు.

ఆటో అటువైపు వెళ్ళింది.

నిఖిలేష్ ఆటో దిగాక, మీటర్ చూసి డబ్బులిచ్చాడు. అతడు మెట్లెక్కి పైకి వెళ్ళాడు.

చివరి మెట్టుమీద ఉండగా చూశాడు అతడు వాళ్ళిద్దర్నీ. రూమ్ పక్కనే నేలమీద కూర్చుని ఉన్నారు రమేష్, మౌనికలు. వారిని అలా చూడడంతోనే అతడి కళ్ళు విప్పారాయి.

"మీరు... మీరు ఎప్పుడొచ్చారు? "

"వచ్చి అర్థగంటయ్యింది. నువ్వొచ్చేవరకూ ఆగుదామని మౌనికగారు అంటేనూ..." చెప్పాడు రమేష్.

అతడు ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఈరోజు మీరు కాలేజీకి రాలేదు. రమేష్ గారిని అడిగితే 'మీరు రాలేనని చెప్పారని,

విషయం తెలియదని' అన్నాడు. విషయమే మిటో తెలియక, ఏదయినా ప్రాబ్లమ్... ఐ మీన్... బాబుతో ప్రాబ్లమ్ ఫేస్ చేస్తూ రాలేకపోయారనుకున్నాను. అయినా ఒక సారి కలిస్తే బాగుంటుందేమోనని, పసివా డినీ ఒకసారి చూసినట్టుంటుందని వచ్చాను"

"పోనీలెండి, నా తర్వాత మీరే కాస్త కొంతవరకూ పిల్లాడిమీద ఇంట్రెస్ట్ చూపిస్తు న్నారు"

నిఖిలేష్ ఆ మాట అనడంతోనే రమేష్ కొద్దిగా ఉలిక్కిపడడం మౌనిక గమనించి.

"పసికందును తీసుకుని మీరు ఎక్కడికె ళ్ళారు? " అడిగిందామె.

అతడు కొద్దిగా తడబడ్డాడు. నిజం చెప్పాలా, వద్దా అని సంశయించాడు. చివ రికి నిజం చెప్పడమే మేలనే నిర్ణయానికి వచ్చాడు.

అందుకే పలికాడు, "కొద్దిరోజుల్లోనే వీడితో విసిగిపోయానండీ... పసివాడి పెంపకం అంటే అది సామాన్య విషయం కాదని నాకిప్పుడిప్పుడే అర్థమవుతోంది. అందులోనూ పసివాళ్ళ పెంపకానికి మగాడు అసలు పనికిరాడు. పసివాడు చేసే అసహ్యాన్ని అసహ్యంగా భావించ కుండా, అది సహజమని, సృష్టిలోని ప్రతి మనిషి అలాంటి స్థితిలోనే పెరిగి పెద్దవాడ వుతాడని, వాడి ఏడుపుని ఆనందంగా భరిస్తూ, అల్లరిని అనుభూతిగా మార్చు కుంటూ పసివాడిని పెంచడం కేవలం స్త్రీకే సాధ్యపడే విషయం. ఆ విషయంలో స్త్రీకి మాత్రమే భూదేవంత ఓపిక ఉంటుంది. నేనీ విషయంలో ఓడిపోయాను. నాకు అంత ఓపికలేదని గ్రహించాను. పైగా... ఈ వారంలో ఇప్పటికే రెండు మూడురో జులు కేవలం వీడి కారణంగానే కాలేజీకి రాలేకపోయాను. ఇలా అయితే నేను డాక్టర్ డిగ్రీ తీసుకోవడం చాలా కష్టమయి పోతుంది" అతడు ఆగాడు.

ఆమె వెంటనే ప్రశ్నించింది, "అందు కని...? "

"వీడిని అనాథ శరణాలయంలో వదిలే ద్దామని వెళ్ళాను"

మౌనిక రమేష్‌కేసి కొద్దిక్షణాలు అదోలా చూసింది. ఆ చూపుల శక్తికి తట్టుకోలేనట్టు అతడు తల దించేశాడు.

"మరి అలా చేయకుండా వచ్చేశారేం? " అతడి చేతిలోని బిడ్డను చూస్తూ నిఖిలేష్‌ని అడిగింది.

"అక్కడుండే పెద్దాయన 'ఒక బిడ్డను అనాథను చేయకండి. అనాథగా పెరిగే బిడ్డల బతుకులు ఎలా ఉంటాయో ఒకసారి చూసి ఆ తర్వాత నిర్ణయం తీసుకోండి' అంటూ నాకు నచ్చచెప్పి పంపేశాడు" అంటూ అతడు పెద్దాయనతో జరిగిన సంభాషణ వివరించాడు.

వాళ్ళ ముగ్గురిమధ్యా కొద్దిసేపు నిశ్శబ్దం కదలాడింది.

చివరికి మౌనికనే మాట్లాడింది "మరి మరిప్పుడేం చేద్దామనుకుంటున్నారు? "

"అదే తోచడంలేదు. ఆ అనాథ శరణా లయం గేటుదగ్గర వదిలేస్తే, తప్పనిసరిగా వాళ్ళు తీసుకుంటారని తెలుసు. కానీ అలా చేయడానికి మనస్కరించడంలేదు"

కొద్ది క్షణాలాగి ఆమె చెప్పింది. "పోనీ ఆ పెద్దాయన చెప్పినట్టు అనాథగా పెరిగే బిడ్డల బతుకులెలా ఉంటాయో చూసి ఓ నిర్ణయం తీసుకోండి. మీరు సరేనంటే నేనూ మీతో వస్తాను"

"ఎందుకు? " అతడు విస్మయంగా చూశాడు మౌనికకేసి.

"నేను కాలేజీకి వచ్చేటప్పుడు సికింద్రాబా ద్‌లో రాష్ట్రపతిరోడ్, బైబిల్ హౌస్ దగ్గరగా ఓ పెద్ద బిల్డింగ్‌కి వేలాడుతూ ఉండే 'నైట్ షెల్టర్ ఫర్ స్ట్రీట్ చిల్డ్రన్' అనే బోర్డు చూస్తూ ఉంటాను. స్ట్రీట్ చిల్డ్రన్ అంటే అనాథపిల్లలని అర్థమవుతూనే ఉంది. కానీ అనాథ పిల్లల గురించి నాకేం వివరాలు

తెలియవు. అనాథ పిల్లలంటే ఎవరు? వాళ్ళు అనాథలుగా ఎందుకు మారుతారు? అనాథల బతుకులెలా ఉంటాయి? ఈ విష యాలు తెలుసుకోవాలన్న కోరిక ఆ బోర్డు చూసినప్పుడల్లా నాకు కలుగుతూ ఉంటుంది కానీ బస్సు దిగి లోపలికెళ్ళే సాహసం చేయలేదు నేనెప్పుడూ... అయితే ఇప్పుడు మీరు "సరేనంటే ఒక్కసారి అక్క డికి వెళ్ళి వద్దాం"

రమేష్‌కి అవసరంలేదు. అయినా అతడికి మౌనికతో కలిసి కాసేపు గడిపే అవకాశం వస్తుందన్న ఆశ కలిగింది. అందుకే అన్నాడు, "అవున్రా! మనం ఓసారి ఆ చోటుకి వెళ్ళివద్దాం"

మౌనిక మరీ రిక్వెస్టింగ్‌గా "ప్లీజ్! సరేన నండి" అనడంతో, అతడు నెమ్మదిగా తలా డించాడు.




మర్నాడు ఉదయమే ఆ ముగ్గురూ 'షెల్టర్ ఫర్ స్ట్రీట్ చిల్డ్రన్' భవనానికి వచ్చారు.

పాతకాలంనాటి భవనం అది. లోపల చాలా విశాలంగా ఉంది. అయితే ఆ బిల్డింగ్‌లో ఓ మూల లైబ్రరీ, మరోమూల ఆఫీసు ఉన్నాయి.

వాళ్ళు వెళ్లేసరికి ఆ బిల్డింగ్ ప్రహరీగోడల మీదా లోపల వరండాలో సుమారు యాభై మందికి పైగా పిల్లలు చిరిగిన బట్టలతో, మసి కొట్టుకుపోయిన ముఖాలతో, దీనమైన చూపులతో కనిపించారు. వారిలో కొందరు చాలా నీట్‌గా ఉండి లోపలికొస్తున్న ఆ ముగ్గురికేసీ భయంగానూ, ప్రశ్నార్థకం గానూ చూశారు.

నిఖిలేష్, మౌనికలు తమవెంట తెచ్చిన స్వీట్స్, అక్కడున్న పిల్లలందరికీ పంచిపె ట్టడం మొదలుపెట్టేసరికి ఆ పిల్లలకు భయం పోయింది. పైగా ఆ అనాథబాలల ముఖాలలో సంబరం కనిపించింది. అవును మరి! పండుగలు ఎరుగరు, ఫలహారాలు తినలేని పరిస్థితి. ఎవరూలేని, ఏమీలేని నిర్భాగ్యజీవులు. ఎవరైనా ఆప్యాయంగా నోరు తీపి చేస్తే వాళ్లకు అపరిమితానందం కలుగదా?

స్వీట్స్ పంచే కార్యక్రమం అయ్యాక అక్క డున్న ఓ వృద్ధుడిని ఏవో కబుర్లలో పెట్టి అసలు విషయంలోకొచ్చారు. అనాథ బాలల గురించి ఆయనకు తెలిసిన విష యాలు చెప్పమంటూ అడిగారు. ఆ వృద్ధుడు చెప్పడం మొదలుపెట్టాక ఆ మాటలు శ్రద్ధగా వినసాగారు.

"అనాథలనేవాళ్ళు ఎక్కడినుండో పుట్టుకు రారు. పుట్టుకతో ఏ వ్యక్తీ అనాథ కాడు. కన్నవాళ్ళు, కొంతవరకూ ఈ సమాజం, కొందరు పసివాళ్లను అనాథలుగా మారు స్తుంది. ఒక తల్లి తన భవిష్యత్తును దృష్టిలో ఉంచుకుని, ఆవేశంలో కన్నబిడ్డను కుప్పతొట్టిలో పడేస్తుంది. తల్లిదండ్రుల మితిమీరిన క్రమశిక్షణ, చిన్న తప్పుకే పసి వాడు భయపడిపోయి ఇంట్లోనుండి పారి పోయేలా చేస్తుంది. అలా పారిపోయే పసి వాడు ఏ పల్లెకో వెళ్ళడు పట్నం చేరుకుం టాడు. అక్కడ ఏ హోటల్‌లోనో గ్లాసులు కడగడానికి కుదిరిపోతాడు. మీరు ఏ హోటల్‌కైనా వెళ్ళి అడగండి. అక్కడ పని

చేసే కుర్రాళ్ళలో సగంమంది ఇంట్లోంచి పారిపోయి వచ్చినవాళ్ళే అయి ఉంటారు. అలా కొందరు అనాథలవుతారు. చాలా కొద్దిమంది మాత్రం అనుకోకుండా ఏ తిరు నాళ్ళలోనో, ప్రయాణాలలోనో పెద్దవాళ్ళ నుండి విడిపోయి, వాళ్ళకు తమ వాళ్ళను కలుసుకోవడం ఎలాగో తెలియక గాలికి కొట్టుకుపోతూ గడపడం మొదలెడతారు. ఈ మధ్యకాలంలో అడుక్కోవడంకోసం సెంటిమెంటల్‌గా అడ్డుపెట్టుకునేందుకు కొంతమంది బిచ్చగాళ్ళు హాస్పిటల్స్‌నుండి పిల్లలను దొంగిలిస్తున్నారు. ఇలా రకరకాల కారణాలవలన పెద్దలనుండి విడిపోయిన పిల్లలు అనాథలుగా మారుతారు"

నిఖిలేష్, మౌనికలు ఆ వృద్ధుడి మాటలు శ్రద్ధగా వింటుంటే రమేష్‌కి మాత్రం కొద్దిగా ఇబ్బందిగానే ఉంది. ఆ వాతావరణం, అక్కడ అటూ ఇటూ తిరుగుతున్న పిల్లలు... అతడికి వాంతి వచ్చేలా అనిపిస్తోంది.

"చూడండి! ఇలా ఏవేవో పరిస్థితుల ప్రభావం కారణంగా అనాథలుగా మారిన ఈ పిల్లల్ని జనం పట్టించుకోరు. ప్రభుత్వం వీళ్ళను నిర్లక్ష్యం చేస్తోంది. కానీ అనాథ బాలలను మనం పట్టించుకోకుండా నిర్లక్ష్యం చేస్తే అది ఈ సమాజానికే ప్రమాదం బాబూ..."

"అదెలా? " అడిగింది మౌనిక.

"ప్రతిమనిషీ జీవితంలో అభిమానం, ఆప్యాయతలు కోరుకుంటాడు. అందులోనూ చిన్నతనంలో ప్రేమానురాగాలు అత్యంత అవసరం. అలాంటి ప్రేమానురాగాలు పసివయసులో ఎవరికైతే దక్కవో, వాళ్ళు మొదట డిప్రెషన్‌కి లోనవుతారు. ఆ తర్వాత క్రమంగా మొండివాళ్ళుగా, కఠినాత్ములుగా మారిపోతారు. వీళ్ళకు ప్రాణ భయం అన్నది అసలే ఉండదు. అందులోనూ సమాజంపట్ల ఒకరకమైన ద్వేష భావం ఉంటుంది. తమ ప్రస్తుత పరిస్థితికి కారణం సమాజమేనన్న నమ్మకం బలంగా కలిగి ఉంటారు. నీతినియమాలు, సిగ్గు బిడియాలు అసలు పట్టించుకోరు... అయితే, ఈ కఠినాత్ములకు ఎవరు కాసింత ఆప్యాయత పంచినా చాలు. వీళ్ళు వాళ్ళకు దాసులైపోతారు. అభిమానం చూపిస్తే, వాళ్ళకు తమ ప్రాణాలు అర్పిస్తారు. నిలువ నీడ కల్పిస్తే జీవితాంతం కృతజ్ఞతగా పడి ఉంటారు. కొందరు సంఘ విద్రోహులకు ఇలాంటి మనుష్యులే కావాలి. వాళ్ళు ఇలాంటి అనాథలను చేరదీస్తారు. వీరికి కాస్త కొత్త రుచులు రుచి చూపిస్తారు. వినోద విలాసాలకు డబ్బులిస్తారు. ఆ మాత్రం ఆనందానికే ముఖం వాచి పోయినట్టున్న వీళ్ళు, ఆ తర్వాత వాళ్ళు చెప్పిన ఏ పని చేయడానికైనా వెనుకాడరు. స్మగ్లింగ్ చేయమన్నా, మనిషి ప్రాణం తీయమన్నా, ఎలాంటి ఫీలింగ్ లేకుండా పని పూర్తి చేస్తారు. అయితే అనాథలు సంఘ విద్రోహశక్తులుగా మారే జాడ్యం ఇంకా మన హైదరాబాద్ నగరానికి అంతగా అంటలేదు గానీ... ముంబాయిలో చాలామంది అనాథలు సంఘ విద్రోహశక్తులుగా మారిపోతున్నారు. అలా అంటున్నానంటే ప్రతి అనాథ ఒక సంఘవిద్రోహశక్తిగా మారతాడని నా ఉద్దేశ్యంకాదు. చాలామంది అనాథలు సంఘ విద్రోహశక్తులుగా తయారవుతున్నారనే నా ఆవేదనంతానూ..."

'నిజమేనన్నట్టు' ఆ ముగ్గురూ తలాడించారు.

మరి కాసేపు కూర్చున్నాక వాళ్ళు ఆ వృద్ధుడి దగ్గర సెలవు తీసుకున్నారు.

మౌనిక లేచాక ఆ పరిసరాలకేసి, అక్కడ తిరుగాడే పిల్లలకేసి జాలిగా చూసింది.

ఎవరు వీళ్ళు?

ఎవరి రక్తం పంచుకుపుట్టారు?

అమ్మానాన్నలు అర్ధగంట కనిపించక పోతే అల్లాడిపోతూ ఏడ్చేసే వయసులో ఉండి కూడా ఎలాంటి ప్రేమను పొంద

కుండా, లాలన లేకుండా ఎలా గడపగలుగుతున్నారు?

అనాథలారా...! అభాగ్యులారా! ఎవరో చేసిన పాపానికి శిక్ష అనుభవిస్తూన్న పసిపిల్లల్లారా! మీ కష్టాలకు ముగింపు కనుచూపుమేరలో కనుపించడం లేదర్రా! ఏ తల్లి పాపమో, ఏ తండ్రి మోసమో, ఏ దేవుడి శాపమో ఈ శిక్ష! తప్పు చేయకుండానే శిక్ష మీరు అనుభవిస్తున్నారు. వంటిమీద బట్ట లేదు. కడుపునిండా తిండిలేదు. శుభ్రత అసలే పట్టదు. నిరంతరం జానెడు కడుపు నింపుకోవడం కోసం వేట సాగిస్తూ మీరు ఆనాటి ఆదిమానవులను గుర్తుకు తెస్తున్నారు. సాటి పిల్లల్ని చూస్తే మీ కళ్లల్లో కదలాడే నిరాశ, రేపటి ప్రళయానికి నాందిలా అనిపిస్తుంది. మీరు ఆకలితో సొమ్మసిల్లి పడిపోయిన క్షణాలు, రేపటి మరో సంఘవిద్రోహచర్యకు ముహూర్తాన్ని నిర్ణయిస్తాయేమో

ఎవరు తీర్చగలరురా మీ కష్టాల్ని?

ఎవరు మార్చగలరురా మీ బతుకుల్ని?

"రండి" రమేష్ పిలిచాడు.

ఆమె ఈ లోకంలోకి వచ్చింది. తలతిప్పుకుని ముందుకు నడవసాగింది. కారు దగ్గర నిలబడ్డాక మౌనిక నిఖిలేష్‌ని చూస్తూ అడిగింది. "అనాథ బాలల బతుకులెలా ఉంటాయో చూశారుకదా నిఖిలేష్‌గారు... మరి మీ దగ్గరి పసివాడి విషయంలో మీరెలాంటి నిర్ణయం తీసుకోబోతున్నారు? "

అక్కడి అనాథబాలల పరిస్థితి చూశాక నిఖిలేష్ నిజంగానే డైలమాలో పడిపోయాడు. చూస్తూ... చూస్తూ ఓ పసివాడిని కష్టాలలోకి నెట్టడం లేదా రేపటి ఓ సంఘవిద్రోహిని చేతులారా తయారుచేయడం అసలిష్టం లేకపోయింది. అలా అని అప్పటికప్పుడు నిర్ణయమూ తీసుకోలేకపోతున్నాడు.

"నేను... నేను కాస్త ఆలోచించుకోవాలి. మౌనికగారు" చెప్పాడు అతడు.

"అంటే, ఇప్పటికీ మీరు 'ఈ పిల్లవాడిని ఎలా వదిలించుకోవాలి' అనే ఆలోచిస్తున్నారా? "

"వదిలించుకోవాలని అనుకోవడంలేదు. ఈ కొద్దిరోజులు కలిసి బతకడంతోనే వాడిమీద ఆప్యాయత ఏర్పడింది. అనురాగం పెరిగింది. వాడిని నా దగ్గరే ఉంచుకుని నేనే పెంచి పెద్ద చేయాలనుకుంటున్నాను...కాని..."

"మరి సంశయం ఎందుకు? " ఆమె అతడి ముఖంలోకి చూసింది.

"నా భవిష్యత్తును ఆలోచించుకుంటుంటే మాత్రం, నేనా పని చేయలేనేమోననిపిస్తోంది. అంతేకాకుండా పిల్లాడిని పెంచేందుకు కావలసిన ఓపిక కూడా నాలో లేదేమోననుకుంటున్నాను. అంటే ఒకవిధంగా నేను ద్వైదీభావంలో కొట్టుమిట్టాడుతున్నాను. అనాథల బతుకులెలా ఉంటాయో చూశాక చేజేతులా ఒక పసివాడిని అనాథను చేయలేక అలా అని వాడికోసం నా భవిష్యత్తును బలిపెట్టుకోలేక, అంత శ్రమను భరించలేక రకరకాల భావాలతో, మానసిక సంఘర్షణతో నేను అతలాకుతలమవుతున్నాను"

ఆమె దీర్ఘంగా నిశ్వసించింది.

"ఏదేమయినా మీరు బాగా ఆలోచించాకే ఒక నిర్ణయం తీసుకోండి. ఒకవేళ ఆ నిర్ణయం పిల్లాడికి కీడు చేసేలా ఉంటే మాత్రం ఐ మీన్ వాడిని వదిలేసే ఉద్దేశం ఉంటే మాత్రం నాకు తెలియజేయండి"

అతడు ఆమె ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు "ఎందుకు? "

"అలాంటి పరిస్థితే ఎదురయితే, వాడికి నాకు చేతనయిన సహాయం చేద్దామని అనుకుంటున్నాను"

'అది ఎలాంటి సహాయం? ' అని అతడు ప్రశ్నించలేదు.

అలా అనడం కాస్త ఇబ్బంది అనిపించినా అన్నాడు "అలాగే"

ఇద్దరూ ముందుకు నడుస్తుంటే, అప్పటివ రకూ వాళ్ళ సంభాషణను అసహనంగా విన్న రమేష్ తలవిదిలించి వారిని అనుస రించాడు.

ముగ్గురూ కారెక్కారు.

మౌనికను ఇంటి దగ్గర దించాక, మిత్రు లిద్దరూ ముందుకు సాగిపోయారు.

★ ★ ★

రెండు రోజులు గడిచాక మౌనిక అతడిని అడిగింది "పసివాడి పెంపకం ఎలా ఉంది నిఖిలేష్‌గారూ? "

అతడు మనసులోని మాటను యధాత థంగా చెప్పాడు, "పసివాడిని అనాథగా మార్చడం ఇష్టంలేదు. అలా అని నా చదు వును పాడుచేసుకుంటూ ఎలా వీడిని ఎంత కాలం పెంచగలనో కూడా అర్థం కావడం లేదు"

కొద్దిక్షణాలాగాక, మౌనిక అడిగింది. "పోనీ వాడిని రెండు రోజులపాటు మా ఇంటికి తీసుకెళ్ళనా? "

ఆమె అలా అనడం వెనుక గతరాత్రి నిద్రలేకుండా గడిపి చేసిన ఆలోచన ఉంది.

'తను కేవలం రెండురోజులపాటు పిల్లవా డిని తీసుకెళితే నిఖిలేష్ కొంత ఊపిరి పీల్చుకునే అవకాశం ఉంది. దాంతోపాటే అలవాటయిన పసివాడు హఠాత్తుగా దూర మయ్యేసరికి అతడూ ఏదో పోగొట్టుకున్న ఫీలింగ్‌తో బాధపడి తీరుతాడు. ఆ బాధ పసివాడిమీద ప్రేమ పెరిగేలా చేస్తుంది'

ఆమె ఆ మాట అనడంతోనే అతడు రిలీ ఫ్‌గా ఫీలవుతూ పలికాడు 'విత్ ప్లెజర్'

"సరే రేపు సాయంత్రం మీ ఇంటికి వస్తాను"

"అలాగే"

ఆమె లైబ్రరీ వైపు వెళ్ళిపోయింది.

మౌనిక, నిఖిలేష్‌లు మాట్లాడుకుంటున్నం తసేపూ దూరంగా ఉండిపోయిన రమేష్ ఆమె రెండడుగులు వేయడంతోనే వడివ డిగా అతడి దగ్గరగా వచ్చాడు. "ఏమిట్రా... మౌనిక... మౌనిక ఏదో అంటున్నట్లుంది నీతో"

నిఖిలేష్ నిట్టూర్చి చెప్పాడు. "పసివాడి విషయంరా... రేపు రూమ్‌కి వచ్చి పసివా డిని రెండురోజులపాటు తనింట్లో ఉంచుకు నేందుకు తీసుకెళ్తానంది"

"ఓస్... అంతేనా? "

నిఖిలేష్‌కి అప్పుడే తను మర్చిపోతున్న తన బాధ్యత గుర్తుకొచ్చింది. అందుకే అపా లజిటిక్‌గా అన్నాడు. "ఏమిటోరా! ఈ పసి వాడిగొడవలో పడి, నీ ప్రేమవిషయం మౌనికకి చెప్పడం అసలు కుదరడంలేదు. సమయం కుదిరితే విషయం గుర్తుకురావ డంలేదు. విషయం గుర్తొస్తే సమయం కుదరడంలేదు...."

రమేష్ మౌనంగా ఉన్నాడు. కానీ ముఖంలో మాత్రం అసంతృప్తి కదలా డింది. పసివాడి విషయంలో తనమాట వినని నిఖిలేష్ మీద కోపంగా ఉంది.

"ఏదేమయినా రేపు సాయంత్రం మౌని కకు నీ లవ్ గురించి చెప్పేస్తాను... ఏమం టావ్...? "

"నేనేమంటాను? ఆ పనేదో త్వరగా చేయమనే చెబుతాను. నా ఫస్ట్‌లవ్ ఏమవు తుందో ఏమో నాకర్థంకావడంలేదు. టెన్ష న్‌లో అసలు నిద్రపట్టడంలేదు. నీకు మాత్రం నాగురించి అసలు టెన్షనే లేదు."

నిఖిలేష్ మిత్రుడి భుజం మీద చెయ్యేసి ఆప్యాయంగా తట్టాడు. "ఒరేయ్! అయితే రేపు సాయంత్రం నువ్వు మా రూమ్‌కి రావద్దు. ఎందుకంటే నీ ఎదురుగా నేను ఆమెకు నీ ప్రేమను చెప్పలేను కదా!"

"అలాగే" రమేష్ తలూపాడు.

మర్నాడు పిల్లవాడ్ని తీసుకెళ్లడం కోసం మౌనిక తన వెంట వచ్చినప్పుడు... ఎలాగ యినాసరే రమేష్ ప్రేమ విషయం మౌని కకు చెప్పాలనే అనుకున్నాడు నిఖిలేష్.

★ ★ ★

పసివాడిని ఉదయమే తయారుచేసి బేబీ

కేర్ సెంటర్‌లో వదలడం, కాలేజీకి వెళ్లడం, వీలయినంతవరకూ పగలంతా వాడిని బేబీ కేర్ సెంటర్‌లోనే ఉంచేసి ఏ రాత్రివేళనో వెళ్లి తెచ్చుకోవడం... కొంత బాధయినా భరిస్తూనే ఉన్నాడు.

'ఇదిగో సాయంత్రం మౌనిక వచ్చి పిల్లవాడిని తీసుకెళ్లి రెండురోజులు ఉంచుకుని తిరిగి తెస్తుందట. రెండు రోజుల తర్వాతయినా పరిస్థితి మళ్లీ మామూలేకదా!'

'తనకు ఇప్పుడిప్పుడే ఆ ఆలోచన వస్తోంది. పిల్లాడిని అమ్మ దగ్గరకు పంపించేస్తే ఎలా ఉంటుందీ? అమ్మో! అది అసలే పల్లెటూరు. చిన్న విషయాన్ని కూడా భూతద్దంలో ఉంచి చూస్తారు. ఈ పసివాడి వెనుక ఉన్న కథ చెబితే నమ్మరు. మరేదేదో ఊహించేసి, తనను అనుమానంగా చూడడం మొదలెడతారు.'

ఆలోచనల మధ్య ఉన్న సమయంలో వాకిట దగ్గరనుండి వినిపించింది.

"హలో! గుడ్‌మార్నింగ్!"

నిఖిలేష్ తలతిప్పి చూశాడు. వాకిట దగ్గర మౌనికతోపాటు, ఆమె వదిన, ఆ పక్కనే ఆ వ్యక్తి... బహుశా ఆమె అన్నయ్య కావచ్చు అనుకున్నాడు అతడు.

అతడి కనుబొమ్మలు ముడివడ్డాయి.

సాయంత్రం వస్తానన్న మౌనిక ఉదయం రావడమే కాదు, తన వదిన, అన్నయ్యలను ఎందుకు వెంటబెట్టుకు వచ్చినట్టు?

అతడు ఆ ఆలోచనను పక్కకు నెట్టేస్తూ, పెదవుల మీద నవ్వు పులుముకుని "రండి.... రండి" అంటూ ఆహ్వానం పలికాడు.

మౌనికతో పాటు కృష్ణమోహన్, వైదేహిలు గదిలోపలికి వచ్చారు. ఆమె కృష్ణమోహన్‌ని చూపిస్తూ నిఖిలేష్‌తో చెప్పింది "ఈయన మా అన్నయ్య. పేరు కృష్ణమోహన్... అన్నయ్యా! ఈయన నిఖిలేష్.... నా క్లాస్‌మేట్"

నిఖిలేష్, కృష్ణమోహన్ ఒకరినొకరు విష్ చేసుకున్నారు.

కృష్ణమోహన్ అన్నాడు "మా చెల్లెలు చాలా సార్లు మీ గురించి చెప్పింది. నేను మిమ్మల్ని ఒకరోజు చూశాను కూడా..."

"అవును. క్యాంపస్‌లో నేను మౌనికగారితో మాట్లాడుతూంటే మీరు ఆమెను పికప్ చేసుకునేందుకు వచ్చారు... యామై రైట్?"

"యస్ కరెక్ట్" అన్నాడు కృష్ణమోహన్.

వాళ్లు తన గదికి ఎందుకొచ్చారో మాత్రం అర్థంకాలేదు. కొద్దిగా టెన్షన్ ఫీలవుతూనే ఉన్నాడు నిఖిలేష్.

"కూర్చోండి" చెప్పాడు వాళ్లతో.

వాళ్లు కూర్చోలేదు. పిల్లవాడు పడుకుని ఉన్న బెడ్ దగ్గరగా వెళ్లారు. అప్పుడే స్నానం చేయించి ఉండడంతో బెడ్ మీద పడుకుని కాళ్లు, చేతులు కదిలిస్తూ వాడు ఆడుకుంటున్నాడు. వైదేహి పిల్లవాడిని ఆప్యాయంగా చూసి రెండు చేతులతో పైకెత్తుకుంది. భర్తకేసి చూసి "పిల్లవాడు ముద్దొస్తున్నాడండీ" అంది.

నిఖిలేష్ కళ్లల్లో కొంత ఆశ్చర్యం కదలాడింది. విషయం కొంత అర్థమై, కొంత కానట్టుగా అనిపించింది.

అంతలో నిఖిలేష్‌కేసి చూస్తూ మౌనిక చెప్పింది "నిన్న పసివాడిని తీసుకెళ్లే ప్రస్తావన వచ్చాక అన్నయ్య 'రెండు రోజులు మాత్రమే ఎందుకు? కొద్దిరోజుల పాటు వాడిని మన ఇంట్లోనే ఉంచుకుందాం' అన్నాడు" అని చెబుతుండగా మధ్యలో నిఖిలేష్‌ని బయటనుంచి ఎవరో కేకేశారు. ఇప్పుడే వస్తానని అతను బయటకు వెళ్లేసరికి గబగబా వెనకాలే వెళ్లింది మౌనిక. పని మనిషి వెళ్లిపోతున్నానని చెప్పింది. లోపలికి రాబోతున్న నిఖిలేష్ తన వెనకాలే వచ్చిన మౌనికని చూసి అక్కడే ఆగిపోయాడు. ఆమె మెల్లిగా చెప్పింది.

"మీకో విషయం చెప్పాలి. అన్నయ్యకు ఎలాగూ పిల్లల్లేరు. వదినది ఇన్‌ఫెర్టిలిటీ కేసు. ఎవరో అన్నారట... ఒక పసివాడిని

తెచ్చుకుని పెంచుకుంటే, ఇంట్లోకి మరో పసి వాడు వస్తాడని... అన్నయ్య ఆ మాటలు నమ్మాడు. అంటే టోటల్‌గా ఏమిటంటే ఇంతకాలం అని కాదుగాని కొంతకాలం పసి వాడు మా ఇంట్లో పెరుగుతాడు. అది ఓ ఆరునెలలు కావచ్చు లేదా ఓ ఆరేళ్లు కావచ్చు అదీ సంగతి... అందుకే వాళ్లు సాయంత్రం కాకుండా ఇప్పుడే పరిగెత్తుకొ చ్చారు. ఇప్పుడు మీరు మీ అభిప్రాయం చెప్పండి.." అంటూ లోపలికి నడిచింది. నిఖిలేష్ కూడా లోపలికి వచ్చాడు.

మౌనిక పిల్లవాడిని తీసుకెళ్లి రెండురోజు లుంచుకుంటానంటే ఆనందంగా అనిపిం చింది. కానీ ఇప్పుడు వాళ్లిద్దరూ ఏ సెంటి మెంట్ కోసమో లేదా తమ అవసరార్థం, ఇంకా ఆనందం కోసమే పిల్లవాడిని ఓ ఆరు నెలలు పెంచుకుని ఆ తర్వాత తిరిగి ఇచ్చే స్తామంటే ఏదో తెలియని ఇబ్బందిలాంటిది కలిగింది. వెంటనే వాళ్ళకు ఏం సమా ధానం చెప్పాలో అర్థం కాలేదు అతడికి. అంతేకాదు, మౌనికకు తన ప్రియమిత్రుడు రమేష్ యొక్క ప్రేమ సందేశం వినిపిం చాల్సి ఉంది. అందుకే వెనువెంటనే పరిస్థితి సీరియస్‌గా మార్చటం కూడా ఇష్టం లేకపో యింది. అతడు ఏం చేయాలి- ఎలా చెప్పాలి అని ఆలోచిస్తున్నంతలో మౌనిక అడిగింది.

"చెప్పండి ఈ విషయంలో మీ అభి ప్రాయం ఏమిటి? "

అప్పటికి అతడు ఓ నిర్ణయానికి రావ డంతో చెప్పాడు. "మీరు ప్రస్తుతానికి రెండు రోజులపాటు పసివాడిని తీసుకెళ్ళండి. ఎక్కువ రోజులు ఉంచుకునే విషయం నేను కాస్త ఆలోచించుకుని చెపుతాను"

మౌనిక ఏదో అర్థమయినట్టు నవ్వింది "అలాగే" అంది.

అతడు అతిథి మర్యాదలకోసం అటూ ఇటూ తిరుగుతున్నప్పుడు మౌనిక తనవా ళ్ళకు ఆ విషయం వివరించినట్టుంది. వాళ్ళు అయిష్టంగానే తలాడించినట్టున్నారు.

మరో పది నిమిషాల తర్వాత వాళ్ళు అతడి చేతిలోని కాఫీ కప్పులు అందుకు న్నారు.

కృష్ణమోహన్ చెప్పాడు. "మీరు ఆలోచిం చుకునే చెప్పండి నిఖిలేష్‌గారూ! ఈలోపు రెండు రోజులుపాటు పసివాడిని మా ఇంట్లో ఉంచుకుంటాం"

"అలాగే తీసుకెళ్ళండి" అన్నాడు నిఖి లేష్.

వాళ్ళు పసివాడికి ముద్దులు కురిపిస్తూ గుండెలకు హత్తుకున్నారు.

కొద్దిసేపటి తర్వాత "మేం బయల్దే రుతాం" అన్నాడు కృష్ణమోహన్.

అతడు తలాడించాడు. ముగ్గురూ పిల్లవా డితోసహా బయటకు నడిచారు.

నిఖిలేష్ తలుపు తాళంవేసి తనూ వాళ్ళ వెంట నడిచాడు. నలుగురూ మెట్లు దిగారు.

కృష్ణమోహన్ స్కూటర్ స్టార్ట్ చేశాక, వైదేహి పిల్లవాడితో సహా వెనుకసీట్లో కూర్చుంది.

మౌనిక వాళ్ళతోపాటే వెళ్ళిపోతుందేమో అనుకున్నాడు నిఖిలేష్. అతడికి ఆ క్షణం రమేష్ ప్రేమ విషయం మనసులో మెదలా డింది. అయితే అదృష్టవశాత్తు మౌనిక వాళ్ళతో వెళ్ళకుండా ఆగింది. అప్పుడు గమ నించాడు అతడు ఆమె చేతిలోని పుస్తకాలు.

"బై అన్నయ్యా! నేను కాలేజీకి వెళ్తాను. ఉంటాను వదినా" వాళ్ళతో చెప్పింది మౌనిక.

వాళ్ళిద్దరూ తలలాడించారు. నిఖిలేష్ రిలాక్స్ అయ్యాడు.

స్కూటర్ ముందుకెళ్ళిపోయింది.

మౌనిక అతడివైపు తిరిగి "మీరూ కాలే జీకే కదూ? " అడిగింది.

"అవును" అని ఆగి "వన్ మినిట్" అంటూ అతడు మెట్లెక్కి తన రూమ్‌వైపు పరుగెత్తాడు. ఓ నిమిషం తర్వాత బుక్స్

తీసుకుని కిందకి వచ్చాడు.

ఇద్దరూ అడుగులు ముందుకేశారు.

పదడుగులు నడిచాక మౌనిక అడిగింది. "బస్సులో వెళ్ళిపోదామా లేక ఆటో ఎక్కుదామా? "

అతడు చెప్పాడు, "కాలేజీకి ఇంకా చాలా టైముంది. కాబట్టి కాస్త దూరం నడుద్దాం. సెంటర్ చేరుకున్నాక ఏదయినా రెస్టారెంట్‌లో కాస్త టిఫిన్ తిని ఆటోలో కాలేజీకి వెళ్ళిపోదాం"

"మీరింకా టిఫిన్ తినలేదా? "

"పిల్లవాడి గొడవ మధ్య ఉదయం ఇంట్లో టిఫిన్ చేసుకోవడం అసలు వీలుపడడం లేదు. వాడిని బేబీకేర్ సెంటర్‌లో వదిలేశాకనే టిఫినయినా, చదువయినా..." అతడు నవ్వాడు.

ఆమె అతడికేసి అప్రిషియేటింగ్‌గా చూసింది.

"ఏంటలా చూస్తున్నారు? "

"ఏదేమయినా మీరు చాలా రిస్క్ తీసుకుంటున్నారు. దారిన వెళ్తున్నప్పుడు మన పక్కన ఘోరం జరిగిపోతున్నా, మనకెందుకులే అనుకునే జనం మధ్య ఉండి కూడా ఓ పసివాడిని వదిలించుకునే ఛాన్స్ ఉండీ మీరు వాడికోసం ఇంతగా శ్రమపడుతున్నారంటే, మిమ్మల్ని అభినందించక తప్పదు"

"ఈ విషయంలో నామీద మీ వత్తిడి కూడా కొంత ఉందని చెప్పక తప్పదు"

"ఎలా? "

"నేను మానసికంగా బలహీనపడిన క్షణాల్లో నన్ను బలవంతంగా అనాథ శరణాలయానికి తీసుకెళ్ళి, అక్కడ అనాథపిల్లల పరిస్థితి ఏమిటో చూపించి చచ్చిపోతున్న నాలోని మానవత్వాన్ని మేలుకొలిపారు"

ఆమె నవ్వి ఊరుకుంది.

అప్పటికే వారిద్దరూ సెంటర్‌కి చేరుకున్నారు. ఎదురుగా కనిపిస్తున్న ఓ రెస్టారెంట్‌ని చూపిస్తూ, "మనం అక్కడ టిఫిన్ తిందాం" చెప్పాడు నిఖిలేష్.

"నేను మార్నింగ్ ఇంట్లో టిఫిన్‌చేసి వచ్చాను. అయినా మీకు కంపెనీ కోసం వస్తాను పదండి"

ఇద్దరూ రెస్టారెంట్‌వైపు నడుస్తున్నప్పుడు మౌనికకు అప్పుడే గుర్తుకొచ్చిందేమో "అన్నట్టు మర్చిపోయాను! రోజూ మిమ్మల్ని పికప్ చేసుకుంటూ ఉండే మీ మిత్రుడు రాకముందే మీరు బయలుదేరేశారేం? "

"ఈరోజు వాడు డైరెక్ట్‌గా కాలేజీకి వచ్చేస్తానని, నిన్ననే చెప్పేశాడు"

"అదేం? "

"వాళ్ళ నాన్నగారు ఫారిన్ వెళ్తున్నారట. ఆయనను ఎయిర్‌పోర్ట్‌లో దించేసి అటు నుండి అటే కాలేజీకి వచ్చేస్తానన్నాడు"

"అలాగా"

ఇద్దరూ రెస్టారెంట్‌లో ప్రవేశించారు.

రెస్టారెంట్‌లో కెళ్ళాక ఓ కార్నర్ టేబుల్ ముందు ఎదురెదురుగా కూర్చున్నాడు. బేరర్ వచ్చాక అతడు ఆమెను అడిగాడు, "చెప్పండి! ఏం తీసుకుంటారు? "

"చెప్పాను కదండీ, ఇంట్లోనే టిఫిన్ తినేసి వచ్చాను. కాకపోతే, మీ కంపెనీ కోసం మీరు టిఫిన్ తిన్నాక వన్‌బైటూ కాఫీ తాగుదాం"

అతడు భుజాలెగరేశాడు. ఆ తర్వాత బేరర్‌వైపు తిరిగి ఇడ్లీ, దోసె ఆర్డరిచ్చాడు.

రెస్టారెంట్‌లో సందడిగా ఉంది. నిఖిలేష్ మనసులోనూ సందడి మొదలయి, అది గొడవగా మారింది.

'చెప్పేద్దామా! రమేష్ లవ్ గురించి చెప్పేద్దామా? ఇంతకుమించిన ఏకాంతం మళ్ళీ దొరకదు. అందుకే చెప్పేయాలి. మౌనికకు రమేష్ లవ్ గురించి చెప్పేయాలి'

బేరర్ ఇడ్లీ ప్లేటు తెచ్చి టేబుల్ మీద పెట్టి వెళ్ళిపోయాడు.

అతడు టేబుల్‌మీదకు వంగి, ఒక్కక్షణం తటపటాయించి ఆమెతో అన్నాడు. "నేను... నేను మీకో విషయం చెప్పొచ్చా? "

"చెప్పండి" చాలా క్యాజువల్‌గా అందామె.

ఆమె అంత క్యాజువల్‌గా అనేసరికి, వెంటనే ఏం మాట్లాడాలో అతడికి అర్థం కాలేదు.

"నేను... నేనేదయినా తప్పు మాట్లాడితే, మీరు బాధపడకూడదు"

ఆమె ముఖంలో నవ్వు చెదరలేదు. "మీరు ఎప్పుడూ తప్పు మాట్లాడరనే నా నమ్మకం"

అతడు ఈసారి సంశయించలేదు. తనేం తప్పు మాట్లాడబోవడం లేదనే అతడి నమ్మకం.

"నా ఫ్రెండ్ రమేష్ గురించి మీ అభిప్రాయం ఏమిటో చెప్పండి? "

ఆ క్షణం ఆమెకు కొద్దిరోజుల క్రితం బస్టాప్‌లో రమేష్ కారులో లిఫ్ట్ ఆఫర్ చేయడం గుర్తుకొచ్చింది. ఆమె నవ్వి, "మీ గురించి నాకో స్థిరమైన అభిప్రాయం ఉంది గానీ, రమేష్ గురించి నేనెప్పుడూ ఆలోచించలేదు. అందువల్లే అతడిమీద ఎలాంటి అభిప్రాయం వ్యక్తం చేయలేను" అంది.

"అతడి గురించి మీరు ఆలోచించకపోయినా, అతడు మాత్రం అనుక్షణం మీ గురించే ఆలోచిస్తున్నాడు"

నిఖిలేష్ ఏమన్నాడో అర్థమయ్యేందుకు ఆమెకు ఆరుసెకనులు అవసరపడ్డాయి. అర్థం కాగానే ఆమె చప్పున కుర్చీలో వెనక్కు వాలింది. అయోమయంగా అతడికేసి చూసింది.

అతడు మాత్రం ఆమె చూపులు పట్టించుకోలేదు. చెప్పదలచుకున్నది చెప్పుకుంటూ వెళ్ళిపోయాడు.

"...రమేష్‌కి మీరంటే చాలా ఇష్టం మౌనికగారూ. అతడు తన ప్రేమను మీకు చెప్పాలని ఎన్నోసార్లు ప్రయత్నించి, పిరికితనంతో చెప్పలేక ఆగిపోయాడు. అందుకే అతడి ప్రేమను మీకు తెలియజేసే బాధ్యతను నేను తీసుకున్నాను. ఇక రమేష్ కోటీశ్వరుడు. అతడి తండ్రికి కొడుకంటే చాలా ఇష్టం. రమేష్ ఏదడిగినా ఆ తండ్రి కాదనడు. సో! మీ ప్రేమ వివాహానికి ఎలాంటి అడ్డూ ఉండదని నేను హామీ ఇస్తున్నాను..."

ఇక ఓర్చుకోలేనట్టు "ఇక ఆపండి నిఖిలేష్‌గారు..." ఇంచుమించు అరిచినట్టుగా అంది మౌనిక.

నిఖిలేష్ చప్పున మాటలాపి ఆమె ముఖంలోకి చూశాడు. అప్పుడు గమనించాడు- ఆమె ముఖంలోని అసహనం!

బేరర్ అప్పుడే దోసె తెచ్చి టేబుల్‌మీద పెట్టి వెళ్ళిపోయాడు. అప్పటికి ఇడ్లీ తినడం కూడా పూర్తికాలేదు.

నిఖిలేష్ కొద్దిగా ఇబ్బందిగా ఫీలవుతూ "నేను... నేనేమయినా తప్పుగా మాట్లాడానా మౌనికగారూ" అడిగాడు.

"తప్పుగా మాట్లాడలేదు. మనసు తెలుసుకోకుండా మాట్లాడారు" అనబోయి ఆగిపోయింది.

"చెప్పండి" అతడు రెట్టించాడు.

ఆమె అతికష్టంమీద పెదవి విప్పింది. "దయచేసి ప్రస్తుతానికి ఈ టాపిక్ ఆపుదాం"

"అంటే... అంటే రమేష్‌మీద మీకు..." ఆ తర్వాత మరేమనాలో అతడికి అర్థం కాలేదు.

"చెప్పానుకదండీ! ప్రస్తుతానికి ఎలాంటి అభిప్రాయం లేదు"

నిఖిలేష్‌కి ఆ సమయంలో మరేం మాట్లాడాలో అర్థం కాలేదు. ఆమె 'నా అభిప్రాయం ఇదీ' అంటూ చెప్పాక, 'మా వాడిని ప్రేమించండి. పెళ్ళి చేసుకోండి' అంటూ తనెలా బతిమిలాడగలడు? ఏదేమయినా ఒక్కటి మాత్రం సంతోషం కలిగించింది. రమేష్ ప్రేమ గురించి ఆమెకు చెప్పేశాడు. అభిప్రాయం తెలుసుకున్నాడు. మనసు తెలిశాక రేపు ఆమె తన నిర్ణయం మార్చుకోకూడదని ఏమీలేదు కదా? '

అతడు ఇక తప్పదన్నట్టుగానే టిఫిన్ తినడం పూర్తిచేశాడు. బేరర్ వచ్చాక కాఫీ ఆర్డరిచ్చాడు. తలెత్తి చూస్తే మౌనిక తల దించుకుని కూర్చుని ఉంది.

ఆమెను అలా చూస్తుంటే అతడికి మనసులో ముల్లు గుచ్చుకున్నంత బాధ కలిగింది. తను పొరపాటుగా మాట్లాడాడేమో! ఆమె మనసు ముందుగా తెలుసుకుని, ఆ తర్వాత విషయం చెప్పి ఉండాల్సింది. ఒకవేళ ఇప్పటికే ఆమె మనసులో మరెవరయినా...

బేరర్ కాఫీ తెచ్చి వారి ముందుంచి వెళ్ళిపోయాడు.

నిఖిలేష్ కాఫీని వన్‌బైటూ చేసి ఓ కప్పు ఆమె ముందుకు తోస్తూ "తీసుకోండి" అని చెప్పాడు.

ఆమె తలదించుకునే ఆ కాఫీ కప్పు అందుకుంది. ఎందుకనో ఇద్దరి మధ్యా ఓ ఇబ్బందికరమైన పరిస్థితి ఏర్పడి, అది నిశ్శబ్దంగా రూపుదిద్దుకున్నట్టు అనిపించింది అతడికి. ఆ నిశ్శబ్దం చాలా బాధాకరమైనది.

బేరర్ బిల్లు తెచ్చిపెట్టాడు.

అతడు బిల్లు చూసి ప్లేట్‌లో డబ్బులేశాక, కాసింత తటపటాయించి ఆమెతో అన్నాడు "మనం వెళ్దామా మౌనికగారూ"

ఆమె జవాబు చెప్పకుండానే లేచి నిలబడింది.

ఇద్దరూ రోడ్డెక్కారు. అతడు అటుగా వెళ్తున్న ఆటోను ఆపి, వెళ్ళాల్సినచోటు చెప్పాడు. ఆటోడ్రైవర్ మీటరేశాడు. వాళ్ళిద్దరూ ఆటోలో కూర్చున్నారు.

ఆటో ముందుకు కదిలిందిగానీ, ఇద్దరి మధ్యా మాటలు మాత్రం లేవు. కాలేజీ ముందు ఆటో దిగేవరకూ ఆ నిశ్శబ్దం అలా కొనసాగింది.

మౌనిక ఆటో దిగాక కూడా మౌనంగా ముందుకెళ్ళిపోయింది.

నిఖిలేష్ ఆటోఫేర్ చెల్లించి, గేటు దాటి లోపలికి వెళ్ళేసరికి ఆమె చాలా దూరం వెళ్ళిపోయింది.

అతడు ఆమె వెంట క్లాస్‌రూమ్‌లోకి వెళ్ళలేదు. క్యాంటిన్‌లోకి వెళ్ళి కూర్చున్నాడు.

మనసంతా అదోలా ఉంది.

కొన్ని విషయాల గురించి మనం ఎంతో గొప్పగా ఊహించుకుంటాం. రెస్పాన్స్ అద్భుతంగా ఉండొచ్చని భావిస్తాం. అలా ఊహించుకున్నవీ, భావించుకున్నవీ, ఊహాతీతంగా, మనిషి ఊపిరి పీల్చుకోలేని విధంగా మారుతాయి.

ఇప్పుడు... ఇప్పుడు మౌనిక ప్రవర్తన తనకు నిజంగానే ఊపిరి పీల్చుకోలేని పరిస్థితిని కల్పించింది.

'అసలు తనేమనుకునేవాడు? రమేష్ కోటీశ్వరుడు. మెరిట్ స్టూడెంట్. అతడు తన ప్రేమను వ్యక్తం చేస్తే ఏ అమ్మాయయినా 'నో' అనే అవకాశమే లేదు ఒకవేళ అప్పటికే మరెవరి ప్రేమలోనయినా పడివుంటే తప్ప? అంటే రమేష్‌కి అన్ని ప్లస్ పాయింట్స్ ఉన్నాయి.

మరి ఇన్ని ప్లస్‌పాయింట్స్ ఉన్న అతడిని మౌనిక ఎందుకు కాదన్నట్టు? '

అలా అనుకుంటున్నప్పుడే... అప్పుడొచ్చిందా అనుమానం. అయితే ఒకవేళ నిజంగానే ఆమె ఇప్పటికే ఎవరినయినా ప్రేమిస్తోందా?

ఎందుకో అలా అనుకోవడానికి అతడికి మనస్కరించలేదు.

సాధారణంగా మెడికోల ప్రేమలు మెడికల్ కాలేజీలోనే పుట్టి, క్యాంపస్‌లోనే పెరిగి, అందరికీ తెలిసేలానే దగ్గరయి ఆ తర్వాత ఒకటవ్వడమో, విడిపోవడమో జరుగుతుంది.

మౌనికతో తమకు మూడేళ్ళ పరిచయం. రమేష్, మౌనిక, తను- ఒకే సంవత్సరం ఈ కాలేజీలో చేరారు. ఒకే క్లాసులో చదువుకుంటున్నారు.

తనకు తెలిసినంతలో ఈ మూడేళ్ళలో

మౌనిక ఏ అబ్బాయితోనూ కనీసం నవ్వుతూ మాట్లాడినట్టు కూడా తను చూడ లేదు. ఆమె ఒకటీ, రెండుసార్లు మాట్లా డినా, కలిసి తిరిగినా అది రమేష్‌తోనూ, తనతోనూ అంతే.

అలాంటి ఆమె ఇలా ఎందుకు మాట్లా డింది?

మనసు పరిపరివిధాల ఆలోచిస్తోంది. ఒక సమస్య ఎదురయినప్పుడు ఎన్నెన్నో కోణాలనుండి పరిశీలించి చూస్తుంది అది.

అందువల్లే అతడు అంతలోనే అనుకు న్నాడు.

'ఒకవేళ మౌనికకు 'ప్రేమా-గీమా' అంటే అసలు నచ్చదేమో'

కొంతమందికి ప్రేమలన్నా, ఆ పేరుతో కలిసి తిరగాలన్నా అంతగా ఇష్టం ఉండదు.

మౌనికది అలాంటి మనస్తత్వమే కావ చ్చేమో!

అది కూడా ఎంతవరకూ నిజం?

తన అనుమానమే అది!

ఏది ఏమయినా మౌనికనుండి ఇలాంటి రియాక్షన్ రావడం తననే ఇంత డిసప్పా యింట్ చేస్తే ఇక ఈ విషయం వినగానే రమేష్ పరిస్థితి ఏమిటి?

ఈ వార్త అతడికి ఖచ్చితంగా షాక్ లాంటిదే!

మూ...డే...ళ్ళు...!

గత మూడేళ్ళుగా రమేష్ ఆమెను ప్రేమిస్తూ ఉన్నాడు. తొలిచూపులో మొదల యిన ప్రేమ మెల్లగా పెరిగి అతడి మన సంతా ఆక్రమించుకుంది.

మౌనిక ఒక్కరోజు కాలేజీకి రాకపోతే రమేష్ అల్లాడిపోతాడు. ఆదివారం సెలవు కాబట్టి ఆమె కనిపించదని తెలిసి శనివా రమే ఎంతో బాధపడి 'ఎవడ్రా ఈ సెల వును కనిపెట్టింది? ఈ సెలవులను మొద లుపెట్టిన వాడెవడయినా సరే, వాడు ఖచ్చి తంగా ఎవర్నీ ప్రేమించి ఉండడు. వాడు ప్రేమ తెలియని శాడిస్ట్' అంటూ తన దగ్గర వాపోతాడు. ఇక ఎక్కువరోజులపాటు సెల వులొస్తే చెప్పనక్కర్లేదు. అప్పుడు కూడా రూమ్‌కొచ్చి ఏదోలా ఆమె టాపిక్ తీసు కొచ్చి ఏవేవో కబుర్లు చెపుతుంటాడు.

రమేష్ మూడేళ్ళుగా పెంచుకున్న ప్రేమను చూశాక మొన్నటికి మొన్న తనొక నిర్ణయం తీసుకున్నాడు. వాడు పిరికివాడు కాబట్టి వాడి ప్రేమకు తను రాయబారిగా మారదలచుకున్నాడు.

కాని... బ్యాడ్‌లక్... తన రాయబారం ఫలించలేదు.

ఈ విషయం వాడికి చెపితే?

మూడేళ్ళుగా పెంచుకున్న ప్రేమకు అటు వైపునుండి పాజిటివ్ రెస్పాన్స్ రాలేదని తెలిస్తే...?



సుపరిచితమైన స్పర్శే భుజాన్ని తాకింది.

నిఖిలేష్ తలతిప్పి చూశాడు.

రమేష్!

"ఇక్కడ కూర్చుని ఉన్నావా? నీ కోసం క్లాస్‌కి వెళ్లాను. అక్కడ లేకపోయేసరికి లైబ్రె రీలోనూ చూశాను. నువ్విక్కడ ఉంటావని అనుకోలేదు"

# ఏరిన ముత్యాలు

★ న్యాయ సమ్మతంగా వ్యవహరించే ముందు ఉదారంగా ఉండండి.

– మెనిసియస్

ఇద్దరు ఒక విషయాన్ని గురించి ఏకాభిప్రాయం కలిగిఉంటే అందులో ఒకరి అవసరం బొత్తిగా ఉండదు.

– విలియం రింగ్‌లే

★ దూరాలోచన గల వ్యక్తి తన వ్యక్తిగత అనుభవాల ద్వారా లాభాన్ని పొందితే వివేకవంతుడు ఇతరుల అనుభవం ద్వారా లాభాన్ని పొందుతాడు.

– డా.జోసెఫ్ కోలిన్స్

★ మనల్ని మనం వంచించుకోవడం అన్నది అన్ని వంచనలకంటే హీనమైనది.

– జి.బెయిలే

★ తప్పులున్నాయని తెలుసుకున్న తరువాత వాటిని సరిదిద్దుకోలేకపోవడం అన్నదే నిజమైన తప్పు

– కన్‌ఫ్యూషియన్

★ దానంగా మీరిచ్చినదంతా మీ సొంతం అవుతుంది. ఇవ్వనిది మీ సొంతం కానేకాదు.

– గురునానక్

★ శారీరక బలం యజమానిగా ఉన్నచోట న్యాయం బానిసగా ఉంటుంది.

– చిన్మయానంద

★ ఏదీకూడా ముందు అనుకున్నంత మధురంగా చేతికి వచ్చిన తరువాత ఉండదు.

– ఎలియట్

★ తాగుబోతులకు రుచి తెలియదు. వాగుడుకాయలకు ఆలోచన ఉండదు.

– మాథ్యూ

★ తప్పు చేస్తామేమోననే నిరంతర భయోత్పాతానికి మించిన తప్పిదం లేదు.

– హబ్బార్డ్

★ గుణానికి మనకంటే ఎక్కువ వాళ్లతోనూ, ధనానికి మనకంటే తక్కువ వాళ్లతోనూ పోల్చుకోవాలి.

– మాతృశ్రీ

★ నిన్ను పొగిడి నీముందు ఇంకొకరిని నిందిస్తే సహించకు. ఇంకొకరి దగ్గర వారిని పొగిడి నిన్ను నిందించడని ఎలా నమ్మటం?

– మీరావలి

★ మంచి సలహాను మించిన విలువైన కానుక మరొకటి లేదు.

– జాన్ హెచ్.క్రో

సేకరణ: పి.వి.రమణకుమార్

నిఖిలేష్ మాట్లాడలేదు.

రమేష్ వచ్చి అతడికి ఎదురుగా కూర్చుంటూ, "క్లాస్‌కి టైమయింది. వెళ్దాం పద" అన్నాడు.

నిఖిలేష్ తలదించుకునే "లేదురా... నేను క్లాస్‌కి రాలేను. నువ్వెళ్ళు" అన్నాడు.

"ఎందుకని? "

"మనసేం బాగోలేదు"

రమేష్ ముఖంలో కంగారు కదలాడింది. "మనసు బాగోలేదా? ఏవిట్రా... ఏమయిందసలు? "

ఏ నిర్ణయమయినా తను చాలా త్వరితంగా తీసుకుంటానని అనుకునేవాడు అతడు. కాని ఆ నిమిషంలో జరిగినది 'చెప్పాలా- వద్దా' అన్న సందిగ్ధంలో అతడు చాలాసేపు ఉండిపోయాడు.

ఎప్పుడయినా చెప్పక తప్పని నిర్ణయం అని అర్థమయ్యాక, చెప్పాలనే అనుకున్నాడు.

"రేయ్ రమేష్! నేను... నేనీ ఉదయం మౌనికకు నీ ప్రేమ గురించి చెప్పానా!"

రమేష్ ఒక్కసారిగా టేబుల్ మీదకు ఒరిగి, "ఏమన్నావ్... నువ్వు... నువ్వు మౌనికకు నా ప్రేమ గురించి చెప్పావా? "

నిఖిలేష్ నిలువుగా తలాడించాడు "అవును"

అప్పటివరకూ అతడు కాసింత ముభావంగా ఉండడానికి కారణం ఆమెనుండి నెగటివ్ రిప్లయ్ వచ్చి ఉండొచ్చేమో అన్న అనుమానమూ రమేష్‌కి రాలేదు. ఆమె పాజిటివ్ రిప్లయ్ ఇచ్చి ఉంటే నిఖిలేష్ ఈసరికి ఆనందం పట్టలేక తనను గాల్లోకి లేపి తిప్పేస్తూ 'సక్సస్... గ్రాండ్ సక్సస్' అని ఉండేవాడనీ అనుకోలేదు.

అసలు ఊహకు భిన్నంగా జరగొచ్చు అన్న ఆలోచనే రమేష్‌కి లేదు.

"మరి... మరి మౌనిక ఏమందిరా? నా ప్రేమ గురించి వినడంతో సిగ్గుపడి వెళ్ళిపోయిందా? "

"లేదురా... ఆమె... ఆమె..."

అప్పుడొచ్చినట్టుంది రమేష్‌కి ఆ అనుమానం. మనసులో బీజంగా నాటుకున్న అనుమానం క్షణాల్లోనే పెరిగి పెద్దదయిపోయింది.

"ఏమన్నది? "

మిత్రుడి కంగారు చూస్తుంటే బాధ కలిగింది నిఖిలేష్‌కి. జరిగిన విషయం ఎలా వివరించాలో తెలియక ఇబ్బందిపడ్డాడు. అయినా జరిగింది. చెప్పక తప్పదు కాబట్టి, రెస్టారెంట్‌లో తమ మధ్య జరిగిన సంభాషణ యధాతథంగా అతడికి వివరించాడు.

అంతా విన్నాక రమేష్ కొద్దిక్షణాలు మాట్లాడలేకపోయాడు. అతడి ముఖంలో నిరాశామేఘాలు కమ్ముకున్నాయి.

అతడి బాధ తను అర్థం చేసుకోగలడు. మూడేళ్లుగా పెంచుకున్న ప్రేమ అది. ఆమె ఇచ్చిన సమాధానం మనసును బాధపెట్టడం సహజం.

అయితే అంతలోనే అతడికి అనిపించింది- ఆమెకు ప్రస్తుతం అతడిమీద ఎలాంటి అభిప్రాయంలేదని చెప్పింది. భవిష్యత్‌లో సదభిప్రాయం ఏర్పడి, అది ప్రేమగా మారొచ్చేమో.

అందుకే మిత్రుడిని ఓదారుస్తున్నట్టు "మరీ అంతగా బాధపడాల్సిన అవసరమేం లేదు కదరా! ఆమెకు నీమీద ఎలాంటి అభిప్రాయం లేదు. అంటే అయిష్టత కూడా లేదన్నమాట. ఒక్కోసారి అయిష్టతలో నుంచి కూడా ప్రేమ పుట్టుకొస్తున్నప్పుడు, రేపు ఆమెకు నీమీద ప్రేమ భావం కలగకూడదని ఎలా అనుకుంటావ్? సో! ఆమె కాస్త ఆలోచించుకున్నాక, ఈలోపు నీ దగ్గరితనం ఆమె అభిప్రాయాన్ని మారిస్తే ప్రేమ పెళ్లి సంభవమే! డోంట్ వర్రీ యార్" అన్నాడు నిఖిలేష్.

అప్పటికి రమేష్ ముఖంలో కాస్త వెలు

గొచ్చింది.

★ ★ ★

అదేరోజు నిఖిలేష్ ఇంటికి చేరుకుని బెడ్ మీద నడుం వాల్చాడు.

వెంటనే నిద్రపట్టేసింది.

సాయంత్రం అతడు స్నానం ముగించి రిలాక్సింగ్‌గా బయటకు బయలుదేరుతూ అనుకున్నాడు. 'బేబీకేర్ సెంటర్‌కి వెళ్లి బాబుని తెచ్చుకోవాలి'.

అలా అనుకుంటూ నాలుగడుగులు ముందుకేశాకే గుర్తుకొచ్చింది. 'అవునూ! బాబును మౌనిక తీసుకెళ్ళిందికదా? మరి తను బేబీకేర్ సెంటర్‌కి వెళ్ళడమేమిటి?'

అతడికి అప్రయత్నంగానే నవ్వొచ్చింది.

నిఖిలేష్ తిరిగి రూమ్‌లోకొచ్చి బెడ్‌మీద వాలిపోయాడు.

ఎందుకనో ఆ క్షణం అతడికి ఏదో పోగొట్టుకున్నట్టనిపించింది. తను పోగొట్టుకున్నది ఏమిటా అని ఆలోచిస్తే పసివాడు గుర్తుకొచ్చాడు. వాడి ఏడుపు, నవ్వు, వాడికి తను చేసిన పనులు... అన్నీ కళ్ళముందు కదలాడాయి.

వెనువెంటనే పసివాడిని ఒకసారి చూడాలనిపించింది. అయితే తను మౌనిక ఇంటికి వెళ్లడం.

బహుశా ఓ పదిరోజులు కలిసి బతికితే ఒకరిమీద ఒకరికి అభిమానం, ఆప్యాయతలు ఏర్పడడం సహజం.

అయితే ఒక్కోసారి ఆ సహజం అసహజంగా మారుతుంది. ఆ అసహజానికి కారణం స్వార్థమే అవుతుంది.

ఒక అనాథను పెంచుకోవడంలోనూ స్వార్థం చూపించే మనుష్యులు మన మధ్య ఉన్నారు.

పిల్లవాడిని పెంచుకుంటే, తమకూ ఓ బిడ్డ పుడతాడన్న ఆశ, అనాథను పెంచుకుంటే ఇంట్లో పనీపాటకు ఉచితంగా దొరికే కూలివాడులా పడి ఉంటాడని మరికొందరి స్వార్థం. హోటళ్ళల్లాంటి బిజినెస్‌లలోనూ అనాథలను చేరదీస్తారందుకే. వారికి రూపాయో, రెండు రూపాయలో ముట్టచెప్పి అంత ముద్ద అన్నంపెట్టి వారిచేత అడ్డమైన పనులన్నీ చేయిస్తారు.

తమ బతుక్కి అర్థం తెలియని ఆ పసివాళ్లను స్వార్థం కోసం ఉపయోగించుకునే నరరూప రాక్షసులను ఎవరేం చేస్తారు?

అలాంటి ఆలోచన రాగానే మనసులో ఒక ఇబ్బందికర భావం కదలాడింది.

తను పసివాడిని వాళ్ళ వెంట పంపి తప్పు చేశాడా?

వాళ్ళు ఆ పసివాడిని వాడిమీద ప్రేమతోనో, జాలితోనో తీసుకెళ్ళలేదు. వాడిని పెంచుకుంటే తమ ఇంట ఒక నలుసు పుడుతుందన్న స్వార్థంతోనే తీసుకెళ్ళారు.

తమ స్వార్థం కోసమే పసివాడిని వెంట తీసుకెళ్ళిన కృష్ణమోహన్, వైదేహిల నుండి వాడిని తను తెచ్చేసుకోవాలనిపిస్తోంది.

కానీ...

ఆ ఇంట మౌనిక ఉంది. మౌనికను బాధపెట్టడం తనకిష్టంలేదు. పైగా మౌనికకు పసివాడంటే ఇష్టమే ఉంది. వాడికి ఆ ఇంట ఏ కష్టం కలగకుండా ఆమె చూసుకోగలదు.

అలా ఆలోచించుకున్నాక, అతడు కొంతవరకూ స్థిమితపడ్డాడు.

అయితే మర్నాడు మాత్రం అతడు ఉండబట్టలేకపోయాడు.

కాలేజీకి వెళ్ళగానే మౌనికను తనే పలకరించి అడిగాడు "బాబు ఎలా ఉన్నాడు?"

నిన్నటి విషయాన్ని అతడు ఆ సమయంలో తాత్కాలికంగా మరచిపోయాడు. ఆమె కూడా మరచిపోయినట్టే నవ్వుతూ సమాధానం చెప్పింది. "వాడు హ్యాపీగానే ఉన్నాడు. రాత్రి అన్నయ్య బెడ్‌రూమ్‌లోనే పడుకున్నాడు. వాళ్ళిద్దరూ వాడిని ముద్దులతో ముంచేస్తున్నారు. వాళ్ళూ సంబరపడిపోతున్నారు"

నిఖిలేష్‌కి నిశ్చింతగా అనిపించింది.

"థాంక్స్" అని అతడు ముందుకెళుతుంటే వినిపించింది.

"ఫస్ట్అవర్ క్లాస్ జరగట్లేదు. మనం అలా క్యాంటీన్‌కి వెళదామా? "

నిఖిలేష్ మౌనికకేసి అదోలా చూశాడు. మౌనిక స్వయంగా తనను క్యాంటిన్‌కి పిల వడమా? అతడికి ఆశ్చర్యంగా అనిపించింది.

అంతలోనే నిఖిలేష్‌కి నిన్నటి సంభాషణ గుర్తుకొచ్చింది. రమేష్‌ని కలవరపెట్టి కలత పడేలా చేసిన సంభాషణ అది.

'ఓహ్! నిన్నటి విషయం మాట్లాడటానికి కాబోలు మౌనిక క్యాంటిన్‌కి రమ్మంటోంది' మనసులోనే అనుకున్నాడు. అలా అనుకోవడంతో ఉత్సాహం కదలాడింది. 'ఒకవేళ ఈమె ఈరోజు పాజిటివ్ రిజల్ట్ తెలియజేయబోతోందేమో. అవున్లే! రమేష్‌ని కాదు అనడానికి కారణం కనిపించి ఉండదు. బహుశా రాత్రంతా ఆలోచించుకున్నాక ఆమె ఈరోజు ఈ నిర్ణయం తెలియజేయబోతున్నట్టుంది'

"పదండి" చెప్పాడామెతో ఇద్దరూ పక్క పక్కనే నడుస్తూ క్యాంటిన్‌వైపు సాగారు.

మౌనిక, నిఖిలేష్‌లు క్యాంటిన్‌వైపు నడవడం దూరంనుండే రమేష్ చూశాడు. సాలోచనగా వారినే చూస్తుండిపోయాడు.

అతడికి వాళ్ళను అనుసరించాలనిపించినా, ఎందుకో ఆ పని చేయలేకపోయాడు.

క్యాంటిన్‌లో కూడా చాలామంది జంటగా వచ్చిన వారిద్దర్నీ అదోలా చూశారు.

మౌనిక, నిఖిలేష్‌లు ఓ మూలగా కూర్చున్నారు.

నిఖిలేష్ టేబుల్ మీదకు వాలుతూ "చెప్పండి" అన్నాడు.

ఆమె ఎటువంటి తడబాటు లేకుండా చెప్పింది. "నిన్న మీరు చెప్పిన విషయం గురించి కొంత మాట్లాడాలని పిలిచాను"

'నేను ఊహించిందే కరక్ట్' అతడు మనసులోనే అనుకున్నాడు. 'అయితే... ఇప్పుడు మౌనిక రమేష్‌ని తనూ ప్రేమిస్తున్నానని చెపుతుందన్నమాట'

అతడు ఆలోచనల మధ్య ఉండగానే ఆమె పలికింది. "నిన్న మీరు రమేష్ ప్రేమ గురించి చెప్పారు. ఈరోజు నేను నా ప్రేమ గురించి మీకు చెప్పాలనుకుంటున్నాను"

అతడు పెదవులు బిగపట్టాడు. 'ఏదో... ఏదో ఊహించని చర్చనే జరగబోతోంది' మనసు కీడు శంకించింది.

"చెప్పండి" అతడు అతికష్టంమీద పలికాడు.

"మీ మిత్రుడు నన్ను ప్రేమించినట్టే, నేను మరో వ్యక్తిని ప్రేమించాను"

అతడు ముందుకు తూలినా, చేతులు బలంగా టేబుల్‌ని పట్టుకోవడంతో ముఖం టేబుల్‌ని తాకలేదు. అయినా అతడు అదేం పట్టించుకోకుండా రెప్పవాల్చడం మర్చిపోయి ఆమెనే చూడసాగాడు.

ఆమె కూడా అతడి ఫీలింగ్స్‌ని పట్టించుకోలేదు.

"నిఖిలేష్‌గారూ అసలు అప్పటికి నాకు ప్రేమ అంటే ఏమిటో తెలియదు. కానీ అతడే 'ప్రేమమీద మీ అభిప్రాయం ఏమిటి? ' అని నన్ను ప్రశ్నించాడు. ఆరోజు మా అన్నయ్య రావడంతో ఆ టాపిక్ కట్ అయిందిగానీ, లేకపోతే అప్పుడే ఆ వ్యక్తి నామీద తన మనసులోని ప్రేమను వ్యక్తం చేసి ఉండేవాడని అనుకున్నాను. అప్పటి నుండే నేను అతడిని పరిశీలించడం మొదలుపెట్టాను. అతడు చాలా మంచివాడు. అంతకుమించి మానవత్వం ఉన్నవాడు. ముఖ్యంగా ఓ అనాథ బిడ్డమీద అతడు చూపించిన ప్రేమాభిమానాలు నన్ను కదిలించాయి. అతడిలోని సేవాగుణం నన్ను మురిపించింది. డాక్టర్ పట్టా పుచ్చుకున్నాక మా పల్లె వెళ్ళి అక్కడి పేదప్రజలకు వైద్య సహాయం చేయాలన్నది నా ఆశయం. నా ఆశయానికి సహకరించి, నా జీవితానికి తోడుగా నిలిచే వ్యక్తి అతడే అనిపించింది

నాకు. నేను క్రమంగా అతడిని ప్రేమించడం మొదలుపెట్టాను"

ఆమె ఎవరిని ప్రేమిస్తోందో అతడికి అర్థమైపోయింది. ఆ క్షణం అతడికి నోటమాట రాలేదు. ఇలాంటి మలుపు అతడు ఊహించనేలేదు. చుట్టూ జనం మాయమైపోయారు. భూమి తన చుట్టూ గిర్రున తిరుగుతోంది. అలా ఎంతసేపు గడిచిందో తెలియదు.

"ఏమండీ... ఏమండీ..."

అతడు ఈ లోకంలోకి వచ్చాడు. అటు చూస్తే ఆమె తన చెయ్యి పట్టుకుని కుదుపుతోంది. అతడు నెమ్మదిగా తలెత్తి ఆమె ముఖంలోకి చూశాడు.

"ఏమిటి? ఒక్కసారిగా ఎక్కడికో వెళ్ళిపోయారు? " ఆమె నవ్వుతోంది.

అతడికి నవ్వు రాలేదు. ఆ క్షణం రమేష్ అతడి కనులముందు నిలబడి రోదిస్తున్నాడు. అతడికి ఏ అజ్ఞాత వ్యక్తో మనసు పిడికిటపట్టి పిండేస్తున్నంత బాధ కలిగింది.

అతడు మెల్లగా లేచాడు. కలలో ఉన్నట్టుగా ముందుకు నడిచాడు.

ఆమె అతడికేసి చిత్రంగా చూసి, "ఎక్కడికి... ఎక్కడికెళుతున్నారు? " ప్రశ్నించింది.

అతడు జవాబు చెప్పలేదు. జవాబు చెప్పేందుకు అతడికి ఆ ప్రశ్న వినిపించనేలేదు.

ఆమె కూడా మరేం తోచనట్టు అతడి వెనుకే నడవసాగింది.

అతడు కొద్దిదూరం అలా నడిచాక, రమేష్ ఎదురుపడ్డాడు. పక్కనే నడుస్తూ కూడా తనని గమనించకుండానే వెళ్ళిపోతున్న అతడిని చూసి "రేయ్ నిఖిలేష్! ఎక్కడికిరా... ఎక్కడికిరా అటు వెళ్తున్నావ్? " అన్నాడు.

నిఖిలేష్ జవాబు చెప్పలేదు.

రమేష్ అతడి భుజంమీద చెయ్యేసి కుదుపుతూ, "రేయ్ నిఖిల్! ఏంట్రా పరధ్యాస..." అన్న తర్వాతే అతడీ లోకంలోకి వచ్చాడు.

అయోమయంగా రమేష్ ముఖంలోకి చూశాడు. ఆ క్షణం అతడికి మౌనిక మాటలు గుర్తుకొచ్చాయి. చూపులు జాలిని కురిపించాయి.

అతడు చప్పున తలతిప్పుకుని "నన్ను ఆపకు. నన్ను రూమ్‌కి వెళ్ళనివ్వు" అంటూ ముందుకు నడవసాగాడు.

ఈసారి రమేష్ అతడిని ఆపే ప్రయత్నం చేయలేదు. అతడి వింత ప్రవర్తన అర్థంకాక అయోమయంగా చూస్తూ ఉండిపోయాడు.



మనిషి ఊహించినట్టే అన్నీ జరగవు. ఊహించని మలుపులు ఎదురవ్వడం ప్రతి మనిషి జీవితంలో అనివార్యం.

'నిజానికి తను కలలో కూడా ఇలాంటి మలుపును ఊహించలేదు. ఊహాతీత సంఘటన ఎదుట నిలిస్తే దిక్కుతోచని పరిస్థితి ఏర్పడుతుంది'

తనకిప్పుడు దిక్కుతోచడం లేదని చెప్పాలి. 'లేకపోతే తన ప్రియమిత్రుడు రమేష్ ప్రేమను మౌనికకు తెలియజేయాలనుకున్న తననే ఆమె ప్రేమించడం ఏమిటి? ఇన్నేళ్ళుగా రమేష్ ప్రేమను చూస్తూ, వాడి ప్రేమ ఫలించాలని కోరుకునే తను, తనకిలాంటి విషమ పరిస్థితి ఎదుర

వుతుందని ఏనాడయినా అనుకున్నాడా? జీవితమంటే ఇదేనేమో!'

కాని ఈ మలుపు తన జీవితంలో సుడి గుండాలు సృష్టించడానికే వచ్చినట్టుంది.

రమేష్ మౌనికను ప్రేమించాడు. మౌనిక తనని ప్రేమిస్తోంది. మరి తను మౌనికను ప్రేమించగలడా? అది సాధ్యపడే విషయం కాదు.

ప్రస్తుతం ఆ సాధ్యాసాధ్యాల గురించి ఆలోచించడంకన్నా మౌనిక ప్రేమ విషయం రమేష్‌కి తెలియకుండా జాగ్రత్తపడటం అవసరం. మౌనిక తనను ప్రేమిస్తోందని తెలిసిపోతే, ఇప్పటివరకూ అతడి మనసులో మిణుకు మిణుకుమంటున్న ఆశ పూర్తిగా అడుగంటిపోతుంది.

దాంతో వాడు నీరసపడిపోయి, నిస్సారమైన జీవితం గడపడం మొదలుపెడతాడు.

అందుకే-

మౌనిక మనసులోని మాట రమేష్‌కి తెలియకుండా చేయాలి.

రెండు రోజుల తర్వాత క్యాంపస్‌లో నిఖిలేష్ మౌనికను పలకరించి చెప్పాడు. "నేను మీతో ఓ విషయం చెప్పాలి"

"ఏమిటది? "

"దయచేసి మీ మనసులోని మాట ఎట్టి పరిస్థితుల్లోనూ రమేష్‌కి చెప్పకండి"

"అలా ఎందుకు? "

"ఇప్పుడీ విషయం వింటే వాడు తట్టుకోలేడు. వాడి చదువు మధ్యలో డిస్టబ్ అవుతుంది. కాబట్టి మన చదువులు ముగిసేంతవరకూ లేదా కనీసం సాధ్యమైనంత కాలం మీరీ విషయాన్ని దాచిపెట్టాలి"

"అయితే మీరు నా ప్రేమని వప్పుకుంటున్నట్టేనా? "

అతడు వెంటనే జవాబు చెప్పాడు. "లేదు నా మనసులో మీపట్ల అలాంటి భావమేదీ ప్రస్తుతానికి లేదు"

ఆమె నవ్వుతూనే అంది, "పోనీ ముందు ముందు కలగొచ్చేమో"

"దయచేసి అలాంటి ఆశలేమీ పెట్టుకోకండి. నా మిత్రుడి ప్రేమ సందేశం తీసుకొచ్చిన నేను మీ ప్రేమను అంగీకరించలేను. మావాడు మీపట్ల ప్రేమను పెంచుకున్నాడు. మీరు తన ప్రేమను కాదన్నారన్న విషయమే వాడికి తెలియకుండా జాగ్రత్తపడుతున్న నేను, మిమ్మల్ని ప్రేమించడం అన్నది జరగనిపని"

"మనం ఎట్టి పరిస్థితుల్లోనూ చేయకూడదనుకున్న పనే ఒక్కోసారి చేయక తప్పని పరిస్థితి ఏర్పడుతుంది నిఖిలేష్‌గారూ!"

అతడు మరేం మాట్లాడలేదు.

"సరే! మీ ఇష్టప్రకారమే నా మనసులో ఉన్న మీ మీద ప్రేమ గురించి నా నోటితో రమేష్‌కి చెప్పను. సరేనా? "

"థాంక్స్" అతడు అక్కడినుండి వెళ్ళిపోయాడు.

★ ★ ★

కృష్ణమోహన్, వైదేహిలు నిఖిలేష్‌ని సంప్రదించాకే పిల్లవాడికి 'కార్తీక్' అనే పేరు పెట్టారు.

ఆ దంపతులిద్దరూ కార్తీక్‌ని బాగానే చూసుకుంటున్నారు.

అయితే వాళ్ళు పసివాడిని బాగా చూసుకుంటున్నారుకదా అని నిఖిలేష్ పిల్లవాడి విషయం పూర్తిగా వదిలేయలేదు. వారంలో కనీసం రెండుసార్లయినా ఆ ఇంటికెళ్ళి పిల్లవాడి బాగోగులు విచారిస్తున్నాడు. వాడితో కాసేపు గడిపి ఆ తర్వాతే రూమ్ చేరుకుంటాడు. పిల్లాడి బాధ్యత ఇంకా తనకున్నట్లే అతడు ఫీలవుతున్నాడు.

అతడి బాధ్యాతాయుత ప్రవర్తన చూసి ఓరోజు మౌనిక నవ్వుతూనే అంది "పసివాడిపట్ల మీరు చూపిస్తున్న ప్రేమాభిమానాలు చూస్తే మీరే వాడికి కన్నతండ్రేమో అన్న అనుమానం వస్తుంది ఎవరికయినా..."

నిఖిలేష్ కూడా నవ్వాడు. అప్పుడే తన ప్రవర్తనను తను సమీక్షించుకుని తన

మనసు లోతుల్లోకి తొంగి చూసుకుని చెప్పాడు. "నిజమే! ఈ పసివాడిపట్ల నేను చాలా బాధ్యతగా ఉంటున్నాను. అయితే అలా ఎందుకు చేస్తున్నాను అని నా మనసు లోతుల్లోకి తొంగిచూసుకుని నన్ను నేను ప్రశ్నించుకుంటే దొరికే జవాబు ఏమిటంటే- ఆ పసివాడు ఏం పాపం చేశాడని వాడిని మనం నిర్లక్ష్యం చేయాలి. ఎవరి బిడ్డయితేనేం వాడికి కాసింత ప్రేమాభిమానాలు పంచకూడదా? అంతేకాదు ఓ పసివాడిని అనాథగా వదిలేస్తే ఈ సమాజానికి జరిగే కీడు కూడా నా మనసులో మెదలాడుతూ ఉంటుంది. అందుకే వాడిపట్ల ఇలా బాధ్యత చూపిస్తున్నాను. అయినా ఆ పసివాడికి మీ అన్నావదినలు అమ్మా నాన్నల్లా దొరికాక కూడా నేను ఆత్రుత ప్రదర్శించడం అర్థరహితమేమోకదూ? "

"లేదు... లేదు. మా అన్నా వదినలు మురిపెంతోనో లేదా పిల్లలమీద మోజుతోనో పెంచుకుంటున్నారే తప్ప వాళ్ళు వాడి బాధ్యతను మనస్ఫూర్తిగా తీసుకోలేదు. వాళ్ళు వాడిని పెంచి పెద్దచేసి ప్రయోజకుడిని చేస్తారన్న నమ్మకం నాకు లేదు"

"అదేం? "

"రేపు వాళ్ళకి పిల్లలు పుడితే వాళ్ళు ఈ పసివాడిని ఇప్పటిలాగే మురిపెంగా పెంచుకుంటారని మీరు అనుకుంటున్నారా? "

"అలా జరగాలని నేను కోరుకుంటున్నాను"

మౌనిక నీరసంగా నవ్వింది. "మీ కోరిక తీరదనే నా నమ్మకం. మా అన్నావదినలు పిల్లలు పుట్టేవరకే ఈ పసివాడిని దగ్గరుంచుకుంటారు. ఆ తార్వత వాడిని తీసుకొచ్చి తిరిగి మీకే అప్పగించినా ఆశ్చర్యం లేదు. ఏదేమయినా అలా జరుగుతుందనే మీరు భావించి అందుకు సిద్ధంగా ఉండడమే మంచిది"

అతడు నెమ్మదిగా తలాడించాడు. "ఏమో! నాకైతే కొంతకాలం మురిపెంగా పెంచుకున్న బిడ్డను అంత సులభంగా వదిలించుకోలేరని అనిపిస్తూ ఉంది"

"నవమాసాలు మోసి రక్తం పంచి ఇచ్చిన తల్లిని తన సర్వసుఖాలు వదులుకుని పెంచి పోషించిన తండ్రిని గడ్డిపోచలకన్నా సులభంగా తీసేసి, వాళ్ళను ఏ హోం ఫర్ ఏజ్డ్‌లోనో చేర్పించేస్తున్న మనుషులున్న సమాజం ఇది. కృతజ్ఞత అన్నది మచ్చుకయినా కానరాని సంఘం మనది. ఇలాంటి సమాజంలో నేను చెప్పినట్టు జరక్కపోతేనే మనం ఆశ్చర్యపడవలసి ఉంటుంది"

"మీరు మీ అన్నయ్య, వదినల గురించి అలా మాట్లాడకూడదేమోనని నేను అనుకుంటున్నాను"

"నేను మా అన్నా, వదినల గురించి కాదు. లోకం తీరు గురించి చెపుతున్నాను. ఓ అనాథ పౌరుడికి పంచి ఇచ్చే ప్రేమలోనూ స్వార్థం ఉంటుందని తెలియజేస్తున్నాను"

కొద్దిసేపు ఆలోచించాక అతడు అన్నాడు, "నిజమే కావచ్చు. పసివాడికి వాళ్ళు పంచే ప్రేమలో స్వార్థం ఉండొచ్చు. అది గ్రహించి నేను మాత్రం ఏమి చేయగలను; పోనీ పసివాడిని వెనక్కు తెచ్చేసుకోనా? "

"నో... నో... పిల్లాడ్ని వెనక్కు తీసుకొచ్చేయడం అంత తెలివయిన పనికాబోదు. ఎందుకంటే ఇంత చిన్న వయసులో వాడి ఆలనా పాలనా చూడటం మీలాంటి బ్రహ్మచారులకు సాధ్యం కాదు. అంచేత వాడు వీలైనన్ని రోజులు అక్కడ ఉండటమే మంచిది. అంతేకాదు మనం కీడు మాత్రమే ఎందుకు ఆలోచించాలి. పసివాడికి మంచి జరుగుతుందనే అనుకుందాం"

"అదీ నిజమే!"

"అందుకే మంచితోపాటు చెడు కూడా ఆలోచించి పెట్టుకుని ఎలాంటి స్థితినైనా ఎదుర్కునేందుకు మానసికంగా సిద్ధంగా ఉండమని చెపుతున్నాను. పిల్లవాడు

మాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ తిరిగి అనాథ కాకూడదు. అదే మన ఆశయం"

అతడు తలాడించాడు.

అలా మాట్లాడుకుంటూనే వాళ్ళు కొద్ది దూరం నడిచాక ఆమె అడిగింది. "మనం అలా పార్కులోకి వెళ్ళి కూర్చుందామా? "

అతడు నిలువుగా తలాడించాడు.

ఇద్దరూ పక్కనే ఉన్న పార్కులోకి నడిచారు.

అప్పుడే ఓ జంట ఒకరి భుజం మీద మరొకరు చెయ్యివేసి ప్రపంచమే మర్చిపోయినట్టు, వాళ్ళలోకంలో వాళ్ళుండి కబుర్లు చెప్పుకుంటూ నడవడం చూశారు మౌనిక, నిఖిలేష్‌లు.

మౌనిక ఆ జంటను చూసి అదోలా నవ్వింది. నిఖిలేష్ ఆ విషయం గమనించి అడిగాడు. "వాళ్ళను చూసి ఎందుకు నవ్వారు మీరు? "

"ఆ అమ్మాయి గురించి మీకు తెలుసా? " మౌనిక అతడిని ఎదురు ప్రశ్నించింది.

"తెలియదు" అతడు ఆ అమ్మాయికేసి పరిశీలనగా చూస్తూ చెప్పాడు. వాళ్ళిద్దరూ



మెడికోలే. వాళ్ళను తను కాలేజీలో చూశా దేతప్ప, పర్సనల్ విషయాలేవీ తనకు తెలియదు.

మౌనిక చెప్పింది "ఆ అమ్మాయి పేరు రాగిణి. మా వీధిలోనే ఉంటోంది. ఆ అమ్మాయి నాన్న రిటైర్డ్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్. ఈ అమ్మాయి మెడిసిన్ ఫైన లియర్ చదువుతోంది...." ఆగిందామె.

"అయితే? "

"రాగిణి ఇప్పటికి ముగ్గుర్ని ప్రేమించింది"

అతడు ముందుకు తూలిపడబోయి "ము...ముగ్గుర్నా? " అన్నాడు.

"అవును! ముగ్గుర్నే! మొదటివాడు కోటీశ్వరుడు. అతడు ఈ అమ్మాయిని సిన్సియర్గానే ప్రేమించాడు. అయితే అతగాడి నాన్న 'ఈ అమ్మాయిని పెళ్లిచేసుకుంటే ఆస్తిలో చిల్లిగవ్వ కూడా ఇవ్వన'న్నాడట... అప్పటికీ అతడేమో తెగించి పెళ్ళిచేసుకుందామంటే 'ఎంత డాక్టరయినా, డబ్బులేని డాక్టర్ని పెళ్ళిచేసుకోవడం నాకిష్టంలేదు' అంటూ ఈమె అతడిని ఛీకొట్టింది. పాపం! ఆ మానవుడు ఈమె నమ్మక ద్రోహాన్ని భరించలేక సూయిసైడ్ చేసుకుని చనిపోయాడు..." మౌనిక పెదవులు బిగపట్టింది.

ఓ ప్రేమికుడి మరణం మనసుని కదిలించగా అతడు కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా ఉండిపోయాడు.

కొద్దిసేపటి తర్వాత ఆమె కంటిన్యూ చేసింది. "రెండోవాడుమాత్రం తనో కోటీశ్వరుడినన్నట్టు ఈమె ముందు ఫోజులు కొట్టి ఆకట్టుకున్నాడు. వాళ్ళిద్దరి వ్యవహారం చాలాదూరం వెళ్ళిందని మా వీధిలో గుసగుసలు వినిపించాయి. అయితే అతగాడికి ఊళ్ళో అర ఎకరం పొలం కూడా లేదని తెలిసి, రాగిణి అతడినీ ఎలాగోలా వదిలించుకుంది. ఇప్పుడు ఆమె ఈ సరికొత్త వ్యక్తితో ప్రేమాయణం... నాకు ఇలాంటి ప్రేమికులను చూస్తుంటే నవ్వు వస్తుంటుంది. ప్రేమ అన్న పదం మీద నమ్మకం తగ్గిపోతోంది"

అతడు చప్పున అన్నాడు, "అలా అనకండి. ఈ ప్రపంచంలో నిజమైన ప్రేమికులు చాలామందే ఉన్నారు"

"కాదనను. అయితే ఈ ప్రేమభావం మరింత విశాలమైతే ఎంత బాగుణ్ణో కదా అనిపిస్తుంటుంది నాకు"

"అంటే? "

"ఇద్దరి మనసులు కలుస్తాయి. వారిద్దరికీ ఏకమవ్వాలనే కోరిక కలుగుతుంది. అయితే ఆ ప్రేమ తన స్వార్థంకోసం కాక, ఓ సత్కార్యం కోసం ఉపయోగిస్తే ఎలా ఉంటుంది? "

"మీరనేదేమిటో నాకర్థం కావడంలేదు"

"మీకు అర్థమయ్యేలా చెప్పేరోజు త్వరలోనే వస్తుందని నా నమ్మకం"

అతడు మరేం మాట్లాడలేదు.

"రండి అలా కూర్చుందాం"

ఆమె చూపించినవైపు మారుమాట్లాడకుండా అనుసరించాడు అతడు.

ఇద్దరూ ఓ పొదచాటున పచ్చికమీద కూర్చున్నారు.

నిశ్శబ్దం కొద్దిసేపు ఇద్దరిమధ్యా తిరుగాడుతూ ఉండిపోయాక, ఆమే పెదవి విప్పి నిశ్శబ్దాన్ని పారద్రోలింది.

"ఏదయినా మాట్లాడండి"

"ఏంమాట్లాడను? "

"ఏదయినా"

"ఏదయినా అంటే"

"మీకు తోచిందేదయినా"

"పోనీ ఆపని మీరే చేయకూడదూ" అతడు నవ్వాడు.

ఇతడు నవ్వడంతో ఆమె కూడా నవ్వేసింది. "సరయితే, నేనే మాట్లాడుతాను..." అన్నాక ఆలోచించుకుంటున్నట్టుగా స్వగతంగా అంది, "ఏంమాట్లాడను"

అంతలోనే తోచిందేమో ఆమె హుషారుగా పలికింది. "అయితే సమయం వచ్చింది కాబట్టి, మీతో పరిచయమయ్యాక

నాలో కలిగిన ఒకానొక మార్పు గురించి, నా ఆలోచనా దృక్పథం ఎలా మారిపోయిందన్న విషయం మీకు చెప్పాలనుకుంటున్నాను"

నిఖిలేష్ ఆమెకేసి ఆశ్చర్యంగా చూశాడు. "మీరనేదేమిటో నాకర్థం కావడంలేదు"

"అర్థమయ్యేలా చెపుతాను వినండి..." ఆమె కొద్దిక్షణాలాగాక కంటిన్యూ చేసింది "మీతో పరిచయం కాకముందు నాకు అనాథ అన్న పదం మాత్రమే తెలుసుగానీ, ఆ పదానికి అర్థం తెలియదు. అనాథల బతుకుల గురించి తెలియదు. మీ ద్వారా నేను తొలిసారిగా ఓ అనాథ బాలుడిని చూశాను. అనాథల కష్టాల గురించి తెలుసుకున్నాను. మనం తెలుసుకోకపోతే మనం గమనించంగానీ, ఒక్కసారి తెలుసుకున్నాక గమనించడం మొదలు పెడతాం. కార్తీక్ పరిచయమయ్యాక నేను అనాథల్ని మరింత పరిశీలనగా గమనించడం మొదలుపెట్టాను. మనం గమనించంగానీ మనకు ప్రతిదినం, ప్రతిచోటా వీళ్లు దర్శనమిస్తూనే ఉంటారు. అనాథల్లా, అభాగ్యుల్లా, భ్రష్టుల్లా, బాధాసర్వభ్రష్టుల్లా కనిపిస్తూనే ఉంటారు. ఇంట్లో ఉంటే, "అమ్మా, ఆకలేస్తోంది, ఒక ముద్దెట్టండమ్మా" అన్న అరుపు వినిపిస్తుంది. మనకు ఓపికుంటే, వెయ్యాలనిపిస్తే ఒక ముద్దేసి పంపిస్తాం. లేదంటే నిర్దాక్షిణ్యంగా 'లేదుపోరా' అని కసురుకుని పంపేస్తాం. కడుపునిండా తింటూ కొత్త రుచులు ప్రతిదినం కోరుకునే మనం ఒక పసివాడి 'ఆకలిని' అసలు పట్టించుకోం. ఈ ప్రపంచంలో ఆకలిబాధను మించినబాధ మరోటిలేదని తెలిసీ ఇంట్లో మిగిలిపోయిన అన్నం పెట్టడానికి కూడా బద్ధకిస్తాం..."

ఆమె మాటలను కట్ చేస్తూ అన్నాడు అతడు, "ఇక్కడో చిన్న సవరణ"

ఆమె అతడి ముఖంలోకి చూసింది "ఏమిటి? "

"ప్రస్తుతం అనాథలకు, అభాగ్యులకు అడుక్కునే అవకాశమూ తగ్గిపోతోంది. ఎందుకంటే సిటీలలో అపార్ట్‌మెంట్స్ పుట్టుకొచ్చేస్తున్నాయి. అపార్ట్‌మెంట్స్‌లోకెళ్ళి అడుక్కోవడం అసలు వీలుపడదు కదా? "

"అదీ నిజమే" మౌనిక నవ్వింది. కాసేపాగాక చెప్పింది. "అలా వాళ్ళను ఇళ్ళ దగ్గర నుండి తరిమేస్తాం. ఆ తర్వాత వీధిలో అడుగుపెడితే మరో అనాథ రోడ్డుపక్క అడుక్కుంటూనో లేక చిత్తు కాగితాలు ఏరుకుంటూనో కనిపిస్తాడు. మనం వెహికల్ మీద వెళుతూ సిగ్నల్ ముందు ఆపితే మన అనుమతి లేకుండానే బట్టతో వెహికల్‌ని తుడిచి చెయ్యి చాపుతాడు. అప్పుడు మన దయాదాక్షిణ్యాలే వాడి కడుపు నింపుతాయి. మన వెహికల్ హోటల్ ముందు ఆగుతుంది. లోపలికెళ్ళి మనకు కావలసిన ఐటమ్స్ ఆర్డరిచ్చేలోపు ఓ పసివాడొచ్చి టేబుల్ శుభ్రంచేసి వెళతాడు. అలాగే రైలెక్కితే, కనీస జ్ఞానం లేకుండా పల్లీ తొక్కలతో రైలు పెట్టెను ప్యాసింజర్స్ అసహ్యకరంగా మార్చివేస్తే, చీపురుతోనో, తన చొక్కాతోనో ఆ పెట్టెను శుభ్రం చేశాక చెయ్యి ముందుకు చాపి దీనంగా నిలబడతాడో పసివాడు... వీళ్ళు...వీళ్ళంతా మన చుట్టూ తిరుగాడుతూ, నిరంతరం మన కళ్ళకు కనిపిస్తుంటారు. ఇంకా కొందరు రైలుపెట్టెల్లోంచి బొగ్గు దొంగతనం చేసి అమ్ముకుంటూ, వేశ్యాగృహసముదాయాల దగ్గర చాయ్‌కప్పులు అందిస్తూ, ఇంకా విదేశాలకు అమ్మివేయబడుతూ మనకు కనిపించని అనాథలూ కొందరున్నారు. వీళ్ళంతా ఎవరు? వీళ్ళేం ఆకాశంనుండి ఊడిపడలేదు కదా? ఎక్కడో పుట్టి మనమధ్యకు రాలేదు. వీళ్ళు మన మధ్యనే పుట్టారు. మనమధ్యనే పెరుగుతున్నారు. వీళ్ళను సృష్టించిందీ ఈ సమాజమే. వీళ్ళను నిర్లక్ష్యంచేస్తున్నదీ ఈ సమాజమే. వాళ్ళ కష్టాలకు, బాధలకూ కారణం ఈ సమాజమే. వాళ్ళు సంఘవిద్రోహ శక్తులుగా మారడానికీ కారణం ఈ

సంఘమే...మరి ఎవరి పాపాన్నో మోస్తూ అష్టకష్టాలు అనుభవిస్తున్న ఈ అనాథలను ఆదుకునేవాళ్ళేలేరా? పేరుకు కొన్ని అనాథ శరణాలయాలున్నాయి. వాళ్ళకు ఆశ్రయమిస్తున్నాయి. అది కొంతవరకూ మేలే. కాని... కడుపునిండిన అనాథ, సాటిపిల్లలను చూసి, వాళ్ళను తనతో పోల్చుకుని, వాళ్ళు పొందే సుఖాలు, అందుకునే ప్రేమాభిమానాలు చూస్తూ తనెంతో కుమిలిపోతాడు. అలా కుమిలిపోతూనే పెరిగి పెద్దవాడవుతాడు. లేకపోతే ముంబాయిలాంటి నేరపూరిత వాతావరణమున్న ప్రదేశమయితే తప్పక సంఘవిద్రోహశక్తిగా మారుతాడు...అలాకాకుండా సంఘమే విత్తుగా నాటి పెంచి పోషించిన ఈ అనాథ పూల మొక్కలను, అనాథ దేవుళ్ళుగా భావించి ఎవరయినా దగ్గరకు తీస్తే ఎంత బాగుణ్ణు-అని అనిపిస్తూ ఉంటుంది"

మౌనిక చెపుతున్నంతసేపు ఆమెనే చూస్తున్నాడు నిఖిలేష్. ఆమె చెప్పడం ఆపాక, "వాహ్! అనాథల గురించి చాలా ఎక్కువగా ఆలోచిస్తున్నారు" అన్నాడు.

"చెప్పానుగా! కార్తీక్ పరిచయమయ్యాక నా ఆలోచనా ధోరణిలో మార్పొచ్చిందని"

"అలాగా"

"అంతేకాదు, మరోటి కూడా అనుకుంటున్నాను"

"ఏమిటది? "

"కార్తీక్‌ని ఎట్టిపరిస్థితుల్లోనూ అనాథను చేయకూడదని"

అతడు నిలువుగా తలాడించాడు.

అప్పటికే పార్కుకొచ్చి చాలాసేపు కావడంతో ఆమె అడిగింది, "వెళదామా" అతడు సరేనంటూ తలాడించాడు.

ఇద్దరూ పార్కులోనుండి బయటకు నడిచారు.

★ ★ ★

కాలం ముందుకు సాగుతోంది.

మార్పులతో ముందుకు సాగేది కాలం.

కాలంతోపాటే కార్తీక్ వయసు పెరుగుతోంది.

అయితే రమేష్‌కి మౌనికమీదున్న ప్రేమ మాత్రం కాలానుగుణంగా ఎలాంటి మార్పుకి లోనుకాలేదు. అతడికి ఆమె మీదున్న ప్రేమ అలాగే ఉంది. ఆమె ఎన్నటికయినా తన ప్రేమను అంగీకరిస్తుందనే అతడి ఆశ. అందుకే అతడు నిఖిలేష్‌ని కలసినప్పుడల్లా మౌనిక ప్రస్తావన తీసుకువస్తాడు. "మౌనికకు నామీద ప్రేమ ఎందుకు కలగట్లేదో నాకర్థంకావటంలేదు. నాకేం తక్కువ? ... ఆస్తి లేదా, అంతస్థు లేదా అందంలేదా సంస్కారంలేదా? ... అన్నీ ఉన్న నన్ను తను ఎందుకు కాదంటున్నట్టు? నేనెప్పుడూ ఆమెపట్ల తప్పుగా ప్రవర్తించలేదే... అలాంటప్పుడు ఆమె ఈమధ్య నాకు మరింత దూరంగా ఉంటోంది... ఏమిట్రా ఇది? "

నిఖిలేష్‌కి ఆ సమయంలో విపరీతమయిన బాధ కలుగుతుంది. 'మౌనిక రమేష్‌ని కాదనుకోవడం నిజంగా మూర్ఖత్వం... ఆమె తన వెంట పడటం అమాయకత్వం... ఆమె వెంటబడితే తను మాత్రం ఆమె విషయంలో వీలయినంత దూరంగానే ఉండదలచుకున్నాడు. ఎందుకంటే, ఆమెను తన మిత్రుడు ప్రేమించాడు కాబట్టి, అతడి తరపున మాట్లాడటానికే తను ఆమెకు దగ్గరగా వెళ్ళాడు. అయితే కథ అడ్డం తిరిగింది. ఆమె తనను ప్రేమిస్తున్నట్టు చెప్పింది. ఈ విషయం రమేష్‌కి చెప్పేస్తే? ... అమ్మో! ఈ నిజం విని వాడు తట్టుకోలేడు. అందుకే వీలయినంతకాలం వాడినుండి ఆ నిజం దాయాలి. కాలేజీలైఫ్ అయిపోయాకా ఎవరిదారినవారు విడిపోతే ఆ నిజం కూడా సమాధి అయిపోతుంది. సో... ఇప్పుడు ఆ నిజం మాట్లాడకుండా కాలాన్ని దొర్లించడమే!

★ ★ ★

నిఖిలేష్ అలా కాలాన్ని దొర్లిస్తుంటే, కాలే

జీకి వేసవి శెలవులొచ్చాయి.

వేసవి శెలవులకు నిఖిలేష్ తన పల్లెకు వెళ్ళాడు.

అందమైన ప్రకృతి, సిటీలో దొరకని ప్రశాంత వాతావరణం ఉండేచోటు అది.

పల్లెకు వెళ్ళిన మర్నాడు అతడు ఏటిగట్టుకు వెళ్లాడు.

ఆ ఏటిగట్టున కూర్చోవడం అంటే అతడికి ఎంతో ఇష్టం.

ఏటికి అవతలి గట్టుమీద అరటిచెట్లు, కొబ్బరిచెట్లు ఏపుగా పెరిగి, పచ్చగా కనిపిస్తున్నాయి. పాయగా పారే ఏటిలో చేపలు ఎగిరెగిరి పడుతున్నాయి. చేపలకోసం ఓ పక్షి నీటిపైనే తిరుగుతోంది. ఏటినుండి వచ్చే గాలి చల్లగా ఉంది. ఆ చల్లని గాలి ఆహ్లాదం కలిగిస్తోంది.

ఆ పల్లెలో అతడికి ఫ్రెండ్స్ అంటూ ఎవరూలేరు. అతడు చిన్నప్పటినుండి తన పనేదో, తన చదువేదో అన్నట్టు ఎవ్వరితోనూ ఎక్కువగా కలిసేవాడుకాదు. చదువు... చదువు... చదువు! అందువల్లే ఎలాంటి కోచింగ్, మరెలాంటి డొనేషన్ లేకుండా ఎంట్రన్స్‌లో రాంక్, మెడికల్ కాలేజీలో సీటు సంపాదించాడు.

కష్టపడి చదువుకుని పైకొచ్చిన అతడిని చూస్తే, ఇప్పుడు ఆ పల్లెలోని చాలామందికి గౌరవభావం. కొద్దిమందికి ఈర్ష్య, అసూయలు కూడా ఉండి ఉండొచ్చు అయితే బంధుగణంలో వరసయిన వాళ్లు, అతడిని తమ అల్లుడిగా చేసుకోవాలని అప్పుడే ప్రయత్నాలు మొదలుపెట్టేశారు.

అతడికి ఆ విషయాలేవీ తెలియవు. ఇతరులు తన గురించి ఏమనుకుంటున్నారన్న విషయమూ అతడు పట్టించుకోడు. తన ప్రపంచం తనది. అందులోనే ఆనందం, విషాదం అనుభవించడమే అతడికి తెలుసు.

అందువల్లే అతడు ఆ సాయంత్రం తన పల్లె ఏటిగట్టున కూర్చుని ప్రశాంతమయిన వాతావరణంలో ప్రకృతి అందాన్ని ఆస్వాదిస్తున్నాడు.

అతడు చాలాసేపు పరిసరాలను పరిశీలనగా, తాదాత్మ్యతతో చూసుకుంటూ అక్కడే ఇసుకలో కూర్చున్నాడు.

అప్పుడే అతడికి రమేష్, మౌనిక, కార్తీక్‌లు గుర్తుకొచ్చారు.

రమేష్ తనముందు నిలబడి 'నిఖిలేష్! నా ప్రేమ విషయం ఏం చేశావురా? మౌనిక ఎలాగయినా నన్ను ప్రేమించేలా చూడరా. ఆమె లేకపోతే నేను బతకలేను' అంటున్నాడు.

మౌనిక నవ్వుతూనే ఛాలెంజింగ్‌గానే చెపుతోంది. 'నీపట్ల నా ప్రేమ మారదు నిఖిలేష్! నేను పెళ్ళంటూ చేసుకుంటే అది నిన్నే! లేకపోతే నేను అసలు పెళ్లే చేసుకోను'

మరోవైపు కార్తీక్ "నేనిక నిశ్చింతగా ఉండొచ్చా? లేక మీరందరూ కలసి నన్ను మళ్ళీ రోడ్డుమీదకు గెంటేస్తారా? " అని ప్రశ్నార్థకంగా చూస్తున్నాడు.

ఆ విషయాలన్నీ గుర్తుకురావడంతో అతడి మనసు వికలమయింది.

ప్రశాంత మానస సరోవరంలో రాయి విసిరినట్టనిపించింది.

అతడు చాలాసేపు అలాగే కూర్చుండిపోయాడు. అలా ఎంతసేపు కూర్చుండిపోయాడో తెలియదు. తిరిగి ఈ లోకంలోకి వచ్చేసరికి ప్రకృతి దృశ్యం మారిపోయి ఉంది.

సూర్యుడు పడమటి కొండల్లో నడుం వాల్చి చాలాసేపయింది. చుట్టూ చీకట్లు ముసురుకోసాగాయి. బతుకుపోరాటం అప్పటికి ముగిసినట్టు పక్షులు గుంపుగా ఆకాశంలో ఎగురుతూ, తమ నివాసాలవైపు సాగిపోతున్నాయి. సాయంకాలం పూజా కార్యక్రమాలు నిర్వర్తిస్తున్నట్టు గుడిగంటల చప్పుడు వినిపించింది.

అతడు లేచాడు. ఏటిగట్టునుండి ఊళ్లోకి

నడిచాడు.

పట్టణ వాతావరణానికి దూరంగా ఉండే మారుమూల పల్లె కావడంతో, ఆ ఊళ్ళో ఇంకా మట్టిరోడ్లే దర్శనమిస్తున్నాయి. ఆ పల్లెలో కరెంట్ లేని ఇళ్ళు చాలానే ఉన్నాయి. ఇక వైద్యసౌకర్యం అన్నది వాళ్ళకి అందుబాటులో లేని అత్యంత అవసరం. ఏ చిన్న ప్రమాదం జరిగినా, ఏ అనారోగ్యమయినా పట్టణానికి తీసుకెళ్ళవలసిందే! మరి పట్టణం చేరేవరకూ రోగి ప్రాణాలు నిలుస్తాయా అంటే అది అతడి 'నుదిటిరాత' అనే అనుకోవలసి ఉంటుంది. పాము కరిచాక తన తండ్రికి వైద్యసౌకర్యం సమయానికి అందకపోవడంవల్లనే అకాల మరణం సంభవించింది. ఆ కారణమే తనను డాక్టరయ్యేలా ఉత్తేజపరిచింది'

అతడు ఆ ఆలోచనల మధ్యనే తన ఇంటికి చేరుకున్నాడు. గేటు తీసుకుని లోపలికి అడుగుపెట్టబోతూ అప్రయత్నంగా ఆగిపోయాడు.

అటు చూస్తే వరండాలో ముగ్గురు, నలుగురు అపరిచితులు కూర్చుని ఉన్నారు. వాళ్ళముందు టీపాయ్‌మీద ఫలహారాల ప్లేట్స్ ఉన్నాయి. గడపకి అవతల నిలబడి తన తల్లి వాళ్ళతో నవ్వుతూ మాట్లాడుతోంది.

'వాళ్ళెవరు? ... ఎందుకొచ్చారు? ' ఆలోచిస్తూ, అతడు గేటు తీసుకుని లోపలికి అడుగుపెట్టాడు. అప్పుడే అతడిని చూసి ఆ ఐదుగురు లేచి నిలబడి, రెండుచేతులూ జోడించి నిలబడ్డారు.

అతడు కూడా వాళ్ళకేసి ప్రశ్నార్థకంగానే చూస్తూ ప్రతి నమస్కారం చేసి "కూర్చోండి" అన్నాడు. వాళ్ళు కూర్చున్నారు.

అప్పుడే పార్వతమ్మ అతడిని లోపలికి రమ్మంటూ సైగచేయడం అతడి కంటబడింది. అతడు ఇంట్లోకి వెళ్ళాడు.

అతడిని హాలులోని మరోమూలకు తీసుకెళ్ళాక చెప్పిందామె. "వాళ్ళది ఆత్రేయపురం. ఎవరో పెళ్ళిళ్ళ పేరయ్య నీ గురించి చెపితే, చూసుకుని వెళ్ళేందుకు వచ్చారు"

"మరి నువ్వేం చెప్పావమ్మా? " అతడు అడిగాడు.

"నాదేంలేదు అంతా అబ్బాయి ఇష్టమేనని చెప్పాను. వాళ్ళు మాత్రం వాళ్ళమ్మాయి వివరాలు, కట్నకానుకలు ఎంత ఇవ్వగలరో చెప్పారు. డాక్టర్‌ని అల్లుడిగా చేసుకోవాలని కోరికట. అందుకే తమ స్థోమతకి మించినా ఐదు లక్షల వరకూ కట్నం ఇవ్వగలమంటున్నారు" పార్వతమ్మ గొంతులో కాసింత ఆశ ధ్వనించింది.

"సర్లే... సర్లే!" అన్నాడు నిఖిలేష్. తను బయటకు నడిచివెళ్ళి వరండాలో వాళ్ళ ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు.

ఆ ఐదుగురూ తనకేసి సంతృప్తిగా చూడడం గమనించాడు.

వాళ్ళు మొదట ఆ వివరాలూ, ఈ వివరాలూ అడిగాక చివరగా "మీరు ఓసారి మా అమ్మాయిని చూసుకునేందుకు వస్తే..." అంటూ నసిగాడు.

నిఖిలేష్‌కి వాళ్ళను ఆశలో ఉంచి, వంచించడం ఇష్టంలేకపోయింది. "చూడండి! నాకు ఇప్పట్లో పెళ్ళిచేసుకోవాలని లేదు. నా చదువు ముగిసేందుకే మరో రెండేళ్ళవుతుంది ఆ తర్వాత ఎప్పటికో"

"ఫర్వాలేదు బాబూ! మనం నిశ్చితార్థం లాంటిది చేసేసుకుంటే, ఆ తర్వాత మీరు ఎప్పటివరకూ ఆగమంటే, అప్పటివరకూ ఆగుతాం" వాళ్ళలో ఓ వ్యక్తి చెప్పాడు. బహుశా ఆయనే ఆడపిల్ల తండ్రి కావచ్చు.

"నాకు అలా చేయడం ఇష్టంలేదండి. దయచేసి మీరేమీ మరోలా భావించకండి" అంటూ చేతులు జోడించాడు.

వాళ్ళు మరేం చేయాలో తోచనట్టు "మంచిది బాబూ" అని చెప్పి లేచి వెళ్ళిపోయారు.

అతడు ఇంట్లోకి వెళ్ళాక పార్వతమ్మ ముఖంలో నిరాశ కదలాడడం చూశాడు.

ఆమె దగ్గరగా వెళ్ళి చుబుకంపట్టి పైకెత్తి, కళ్ళలోకి చూస్తూ, "నామీద కోపంగా ఉందామ్మా" ప్రశ్నించాడు.

"బంగారంలాంటి సంబంధం. నువ్వు కాదన్నాక కోపం రాదా మరి? " ఆమె కొడుక్కేసి సీరియస్‌గా చూసింది.

"బంగారానికన్నా విలువయినవి ఈ లోకంలో చాలా ఉన్నాయమ్మా"

ఆమె అర్థంకానట్టు, నిఖిలేష్‌కేసి చూసి, అంతలోనే నవ్వి "మాటలకేమీ తక్కువ లేదు" అంది. అప్పటికే ఆమెకోపం కొంతవ రకూ తగ్గుముఖం పట్టింది.

అతడు ఆప్యాయంగా తల్లిభుజం చుట్టూ చేతులు వేసి నడిపించి, హాలులో మరో మూల ఉన్న కుర్చీ దగ్గరకు తీసుకెళ్ళి అందులో కూర్చోబెట్టాడు. తనేమో ఆమె ఎదురుగా నేలమీదనే కూర్చున్నాడు.

"నాకు ఇప్పుడే పెళ్ళిచేసుకోవాలనిపించలే దమ్మా... అలాంటప్పుడు ఓ అమ్మాయికి నా కారణంగా పెళ్ళి మరో రెండేళ్ళు వాయిదా పడడం ఇష్టంలేకపోయింది. అందుకే వాళ్ళకు అలా నిర్మొహమాటంగా చెప్పాను"

పార్వతమ్మ అతడికేసి చూడకుండా, ఇంటి పైకప్పు కేసి చూస్తూ అనేసింది "ఆ అమ్మాయి గురించి ఆలోచించి చెప్పావా లేక నువ్వే ఇప్పటికే మరో అమ్మాయిని చూసేసుకున్నావా? "

"అదేం మాటమ్మా" అతడు తల్లి ముఖం లోకి చూశాడు.

అప్పటికీ ఆమె కొడుకు ముఖంలోకి చూడలేదు. "అలా చూసుకోవడం తప్పు అని కూడా నేను అనడంలేదురా. నువ్వు ఈ సంబంధం వద్దనగానే నాకు ఆ అను మానమే వచ్చింది. అయినా అలాంటిదేద యినా ఉంటే ముందే చెప్పు నేనెలాంటి ప్రయత్నాలు చేయకుండా ఉంటాను"

అతడికి తల్లి మనసు అర్థమయింది. చిన్నగా నవ్వేశాడు.

"ప్రస్తుతానికి అలాంటిదేమీ లేదమ్మా! అలాంటిదేదయినా ఉంటే నీకు నిర్భయంగా చెపుతాను, సరేనా? "

అప్పుడు చూసిందామె కొడుక్కేసి ఆప్యా యంగా. అతడి మెడచుట్టూ చేతులేసి దగ్గ రగా తీసుకుంది.

తల్లీ కొడుకులప్రేమ ఎప్పటికైనా అపురూ పమైనదే!

మరి అనాథల పరిస్థితి? ... వాళ్లకు ఇలాంటి మధురానుభూతి లభ్యంకాదు కదా? ...

నిఖిలేష్ తననుతాను తిట్టుకున్నాడు. అదేక్షణం తనలోతను అనుకున్నాడు 'ఇదే మిటి! ఈమధ్య నాకు అనాథల బతుకుల గురించి ఆలోచన ఎక్కువయిపోయింది. ఎదురయ్యే ప్రతి సంఘటననూ వాళ్ళ జీవి తంతో పోల్చిచూసుకుంటున్నాడు. బహుశా ఇది కార్తీక్ ప్రభావం కావచ్చు..

ఏదేమయినా కృష్ణమోహన్, వైదేహిలు వాడిని ఎప్పటికీ పెంచుకుంటే బాగుణ్ణు. తన జీవితంలో తను తల్లి దగ్గర పొందే అనుభూతి, ఆప్యాయతలు వాడు వైదేహి దగ్గర పొందవచ్చు..

అతడు ఉన్నట్టుండి ఆలోచనల్లోకి జారు కున్న విషయం గమనించిన పార్వతమ్మ కొడుకును కుదుపుతూ అడిగింది. "ఏమిట్రా ఎక్కడికో వెళ్ళిపోయినట్టున్నావ్... ఏ మాలోచిస్తున్నావ్? "

"అనాథ పిల్లల గురించమ్మా" అతడు వెంటనే చెప్పాడు.

ఆమె అతడిని దూరం చేసి, ముఖంలోకి అదోలా చూస్తూ "అ...అనాథల గురించా? " అంది.

"అవునమ్మా! అనాథల గురించే" అతడు చెప్పాడు.

"నువ్వు అనాథల గురించి ఆలోచించడం ఏమిట్రా? " ఈసారి ఆమె గొంతులో ఆదుర్దా కదలాడింది. ముఖంలో అయో మయం చోటుచేసుకుంది.

"అవునమ్మా! నేనిప్పుడు ఓ అనాథకు గార్డియన్‌ని. అందువల్లే అలాంటి పిల్లల కష్టనష్టాలు నాకు ఎక్కువగా తెలిసొస్తున్నాయి. అందుకే వాళ్ళ గురించి ఎక్కువగా ఆలోచిస్తున్నాను"

"గార్డియన్ అంటే? "

"సంరక్షకుడు అని అర్థం. అంటే తల్లిదండ్రుల బాధ్యతలు నిర్వహించేవాడు"

ఈసారి ఆమె యించుమించు అవాక్కయింది. "నువ్వు... నువ్వు ఓ బిడ్డకు తల్లీదండ్రివా? ... అసలు నువ్వేం మాట్లాడుతున్నావురా బాబూ? "

"అబ్బా! నువ్వు మరీ ఏదేదో ఊహించుకుని కంగారుపడిపోకే... అసలేం జరిగిందంటే..." అంటూ అతడు, ఆరోజు ఆమెను రైలెక్కించేరోజు, భారతి రోడ్డు పక్కన ప్రసవవేదన పడడం మొదలుకుని, బిడ్డను కృష్ణమోహన్, వైదేహిలకు అప్పగించడం వరకూ క్లుప్తంగా వివరించాడు.

అంతా విన్నాక పార్వతమ్మ అంది, "అలా దొరికిన బిడ్డను ఏ అనాథశరణాలయంలోనో వదిలేయక, ఆ బరువు నువ్వెందుకెత్తుకున్నావ్‌రా? "

"చెప్పాను కదమ్మా! వాడిని వదిలేయాలనే అనాథ శరణాలయం వెళ్లాను. కాని తనాథ బాలల బతుకుల చూశాక మాత్రం ఆ పని చేయలేకపోయాను" చెప్పాడు అతడు.

"అయితే మానవత్వంతో మనం దగ్గర తీస్తే ఆ పిల్లవాడి బాధ్యత మనదేనా? "

"మానవత్వంతో దగ్గరకు తీశాం కాబట్టే బాధ్యత మనదయింది"

"మరీ అంత బాధ్యత చూపించడం మంచిది కాదురా"

అతడు తల అడ్డంగా ఆడిస్తూ, "అలా అనకమ్మా" అన్నాడు. తల్లి ముఖంలోకి చూడకుండా కిటికీలోంచి కనపడే ఆకాశం కేసి చూస్తూ చెప్పాడు. "మనకు తారసపడే అనాథపిల్లల గురించి మనకెందుకులే అనుకుంటారు కొందరు. వాళ్ళ గురించి అసలు ఆలోచించరు. ఎక్కడైనా, ఎప్పుడైనా, ఎవరికైనా ఓ పసికందు ఏడుస్తూ కనిపిస్తే, అటు చూడడమే పాపమన్నట్టు తల తిప్పుకుని వెళ్ళిపోతారు చాలామంది. ఏ కాస్తో మానవత్వం ఉన్నవాడు ఆ పసికందుని అనాథశరణాలయంలో వదిలివెళ్తాడు. నిజానికి పసికందుని అనాథశరణాలయంలో అప్పగించడంతోనే తామేదో గొప్ప కార్యం చేశామని ఆనందపడిపోవడం మంచిది కాదమ్మా... ఎందుకంటే నాకు తెలిసి హైదరాబాద్‌లో ఎన్నో పసిపిల్లల అనాథశరణాలయాలున్నాయి. వాటన్నింటిలో కలిపి. ఓ ఐదారు వందలమంది అనాథపిల్లలు ఉన్నారు. ఎవరైనా ఆ అనాథశరణాలయం నుండి పిల్లవాణ్ణి దత్తత తీసుకోవాలనుకుంటే ముందుగా రిజిస్ట్రేషన్ చేసుకోవాలి. ఆ తర్వాత ప్రొబేషన్ ఆఫీసరు వెళ్ళి దత్తత తీసుకునే వారింట్లో పరిస్థితులు, దత్తత తీసుకునే దంపతులుకాక, ఆ ఇంట్లో ఇతర కుటుంబసభ్యులూ ఆ పసివాడిని ప్రేమగా చూసుకుంటారా లేదా అన్నది పరిశీలిస్తారు. ఆ పరిస్థితులన్నీ గమనించాకే న్యాయస్థానం చట్టబద్ధంగా పసివాడిని దత్తత ఇస్తుంది. దత్తత ఇచ్చాక కూడా కొంతకాలం ప్రొబేషనరీ ఆఫీసర్ కుటుంబసభ్యులు ఆ పసివాడిని ఎలా చూసుకుంటున్నారు అన్న విషయం నిఘావేస్తాడు. అనాథశరణాలయాలు ఇంత జాగ్రత్తగా దేశవిదేశాలలో పిల్లల్ని దత్తతకు ఇస్తున్నా... ఎక్కడో ఏదో లోపం, బహుశా పెంపకంలో చూపించే తేడా అనుకుంటా, దత్తతకెళ్ళిన పిల్లల్లో కొందరు పారిపోతున్నారు. అందుకు ఓ కారణం, దత్తత సమయంలో పిల్లల్లేని దంపతులకు, ఆ తర్వాత పిల్లలు పుడితే చూపించే ప్రేమలో తేడా ఈ పసివాడి మనసుని గాయపరుస్తుంది. కొండొక చోట దత్తత పిల్లాడిని వదిలించుకోవాలని కొందరు దంపతులు పిల్లవాడ్ని హెరాస్

# ఏరిన ముత్యాలు

★ నీ నడవడికయే నీకు మిత్రులను, శత్రువులని లభింపచేస్తుంది.

— చాణుక్యుడు

★ శ్రమ ద్వారానే ఆరోగ్యదాయకమైన ఆలోచనలు కలుగుతాయి.

— రస్కిన్

★ ఆవేశకావేషాలతో ఆలోచనకు, హేతువాదానికి తావుండదు.

— థోరో

★ వ్యక్తిగత ఆస్తులవల్ల సమాజానికి ఎలాంటి లాభం చేకూరదు. మనుషులు వివేకవంతులు అయితే వ్యక్తిగత ఆస్తిని రేపే రద్దు చేస్తారు.

— బెర్ట్రాండ్ రస్సెల్

★ యుద్ధోన్మాదం అంటే శాంతి సమస్యలనుంచి పిరికితనంగా తప్పించుకోవడమే గానీ ఇంకేంకాదు.

— థామస్‌మాన్

★ అజ్ఞానం అన్ని దురదృష్టాలకూ హేతువు. ఏదో ఒకటి నేర్చుకోవడానికి నోచుకోక పోవడం కంటే అసలు పుట్టకుండా ఉండడమే మంచిది.

— ప్లేటో

★ పుస్తకాలు లేకుండా గడిపే విశ్రాంతి చావుతో సమానం. సజీవంగా సమాధి కావడంలాంటిది.

— సెనెకా

★ అసమానత, ద్వేషంపై ఆధారపడే వర్తమాన సామాజిక వ్యవస్థ అంతరించి, సమానత్వం పరస్పర సహకార ప్రాతిపదికపై నూతన సమాజం ఏర్పడకపోతే మానవజాతికి విముక్తి ఉండదు.

— వినోబాభావే

★ మనుషులను జయించడానికి శక్తియుక్తులు చాలవు. మహోదాత్తమైన మనసు, ప్రేమపాశం అవసరం.

— స్పినోజా

★ యుద్ధానికి దారితీసే పరిస్థితులను బయటపెట్టడం ద్వారా మాత్రమే యుద్ధాన్ని నివారించగలం.

— హెమింగ్వే

★ సోమరిపోతు దొంగతో సమానం.

— ఒకసూక్తి

★ విశ్వంలో చాలా ఖరీదైన వస్తువు హృదయం.

— వివేకానంద

సేకరణ: పట్నం శేషంశెట్టి

చేస్తారట. ఏ కారణాలేవయితేనేం అమ్మా! అనాథ పిల్లవాడు అనాథ శరణాలయం చేరగానే, వాడి బతుకు గాడిన పడిందని మనం అనుకోకూడదు. అందుకే... కార్తీక్ భవిష్యత్ ఏమౌతుందోనన్న భయం నా మనసులో ఉండబట్టే వాడిని అలా వదిలేయలేకపోయాను. ఇక కృష్ణమోహన్ దంపతులు వాడిని చట్టబద్ధంగా దత్తత తీసుకోలేదు కాబట్టి, రేపు వాడిని వారు తిరిగి ఇచ్చేసినా మారుమాట్లాడకుండా తీసుకోవాలి. ఇది ఎక్కువ బాధ్యత చూపించడం అంటే నేనేం మాట్లాడలేను"

పార్వతమ్మ చాలా సేపు మాట్లాడకుండా మౌనంగా ఉండిపోయింది.

తల్లి తన మాటలు విని మానవత్వంతో ఆలోచిస్తోందని అతడికి అర్థమయిపోయింది.

చాలా సేపటి తర్వాత ఆమె అంది "నువ్వు చేసింది తప్పని నేను అనడంలేదురా. కాని బాధ ఏమిటంటే... ఆ బుడతడ్ని నా దగ్గరకు పంపిస్తే నేను బతికున్నంతకాలం, నిన్ను పెంచినట్టే వాడిని ప్రేమతో పెంచుతా. అయితే... రేపు నీకొచ్చే భార్య వీడిని భరిస్తుందా అని? "

"అలా భరించే మనస్తత్వం ఉన్న ఇల్లాలినే చూసి తెచ్చుకుంటాలే. నువ్వేం దిగులు పడకు" అతడు నవ్వాడు.

మనసులో కొంత అసంతృప్తి ఉన్నా, అది కనబడనివ్వకుండా జాగ్రత్తపడుతూ, "సరే నీ ఇష్టం" అంటూ ఆమె కూడా నవ్వేసింది.

అతడికి మనసులోని భారం కొంత తగ్గినట్టనిపించింది.

★ ★ ★

ఆరోజు ఉదయమే నిఖిలేష్ ఇంట్లోంచి బయటకు రాబోతూ అటుచూసి కళ్ళు పెద్దవి చేశాడు. వెంటనే అతడి పెదాలు విచ్చుకున్నాయి.

"రేయ్ రమేష్! నువ్వు... నువ్వు" అన్నాడు ఆశ్చర్యంగా.

రమేష్ అతడి దగ్గరగా వచ్చి చెప్పాడు. "సిటీలో బోర్ కొట్టేసిందిరా. అందుకే ఓ వారంరోజులు నీతో గడుపుదామని ఇలా వచ్చేశాను"

"అమ్మా... అమ్మా" నిఖిలేష్ వెనక్కి తిరిగి అరిచాడు.

జవాబుగా వినిపించింది "ఏంట్రా? "

"ఇలా రామ్మా... ఎవరొచ్చారో చూడు"

పెరట్లోనుండి హాల్లోకి వచ్చిన పార్వతమ్మ రమేష్‌ని చూసి ఆశ్చర్యపోయింది. "రమేష్... ఏమిటయ్యా! హఠాత్తుగా ఏమిటీ రాక? "

"కారణమంటూ ఏమీలేదమ్మా... ఏదో మా వాడితో వారంరోజులు కలిసి ఉండాలనిపించింది. వచ్చేశాను"

"చాలా మంచి పని చేశావ్"

రమేష్ ఆ పల్లెకు రావడం అదే మొదటిసారి. అతడి దగ్గర నిఖిలేష్ ఇంటి అడ్రస్ ఉండడంతో పెద్ద ఇబ్బంది పడకుండానే తిన్నగా ఇంటికి రాగలిగాడు.

"ఎన్నోసార్లు మా ఊరు రమ్మంటూ నిన్ను పిలిచాను. కానీ అప్పుడెప్పుడూ నీకు రావాలనిపించలేదు. కానీ నేను పిలవకుండానే రావాలనిపించిందన్నమాట" నవ్వుతూనే అన్నాడు నిఖిలేష్.

"కరెక్ట్!... అప్పుడెప్పుడూ నాకీ పల్లెకు రావాలనిపించలేదు. కానీ ఇప్పుడు ఆ సిటీలో ఉండాలనిపించలేదు"

"అదేంటి? "

మిత్రులిద్దరూ మాట్లాడుకోవడం చూసి పార్వతమ్మ మంచినీళ్ళు తేవడంకోసం వంటగదివైపు నడిచింది.

రమేష్ దీర్ఘంగా నిశ్వసించి జవాబు చెప్పాడు. "ఏమిటోరా! ఈ మధ్య మౌనిక గురించి మరీ ఎక్కువగా ఆలోచించేస్తున్నాను. ఆమె తాలూకూ ఆలోచనలతో అసలు నిద్ర పట్టడంలేదు. కనీసం పుస్తకం పట్టుకుని చదవాలనే అనిపించడం లేదు. అక్కడే ఉంటే ఆలోచనలతో తల పగిలిపో

తుందేమోననిపించి, నీ దగ్గరకు పరుగెత్తు కొచ్చాను"

నిఖిలేష్ కనీసం నవ్వడానికి కూడా ప్రయత్నించలేదు.

ఒక ఇబ్బందికరమైన భావం మనసులో కదలాడి, దానిని అతలాకుతలం చేస్తుంటే అతడు పెదవులు బిగపట్టాడు.

రమేష్ అలా అంటుంటే తనకెందుకీ ఇబ్బందికరమైన భావం... ఒకప్పుడు రమేష్ మౌనిక ప్రస్తావన తీసుకొస్తే తనెంతో ఉత్సాహపడేవాడు. అతడిని ఉత్సాహపరిచేవాడు. కానీ ఇప్పుడు తనలో ఎందుకీ మార్పు?

మౌనిక తనను ప్రేమిస్తోందని తెలియడం వల్లనా?

కాదనుకుంటా!

పోనీ రమేష్ ప్రేమను మౌనిక ఎట్టి పరిస్థితుల్లోనూ అంగీకరించదని తెలిసిపోవడం వల్లనా?

కొంతవరకూ అది నిజమేనేమో!

ఏదేమయినా ఇప్పుడు రమేష్, అతడి ప్రేమను గురించి చెప్పినప్పుడు తనకు తెలియకుండానే తను కొంత ఇబ్బందికి లోనవుతున్నాడు.

నిఖిలేష్ ఆలోచనల్లోంచి బయటపడి, "సరే పదరా! బట్టలు మార్చుకుని స్నానం చేద్దువు" చెప్పాడు.

అప్పుడే మంచినీళ్ళ గ్లాసుతో వాళ్ళముందుకు వచ్చిన పార్వతమ్మ గ్లాసు రమేష్‌కి అందిస్తూ చెప్పింది, "నువ్వు పళ్ళు తోముకునేలోపు నీళ్ళు వేడెక్కిపోతాయి... వేన్నీళ్ళ స్నానం చేస్తే కాస్త బడలిక తీరుతుంది"

రమేష్ తలాడించి, "అలాగేనమ్మా" అన్నాడు.

అతడు స్నానాదికాలు ముగించాక మిత్రుడితో కబుర్లలో పడ్డాడు.

"ఏరా నిఖిలేష్. నీకు పల్లెలో టైమ్ ఎలా గడుస్తుందిరా? "

"అంటే...? "

"మనం సిటీలో బతికే మనుషులంకదరా! అక్కడ ఫ్రెండ్స్‌తో కబుర్లు, చాయ్ దుకాణాల్లో అరుపులు, వాహనాల్లో పరుగులు, సినిమాలు, షికార్లు... ఏదేమయినా సందడిలేని పల్లెలో ఎక్కువరోజులు ఉండగలమా అని"

"మరి నేను ఉంటున్నాను కదరా" నవ్వాడు నిఖిలేష్.

"నువ్వు ఉంటున్నావనుకో కానీ..."

అతడి మాటల్ని మధ్యలోనే కట్ చేస్తూ నిఖిలేష్ పలికాడు. "మరి నువ్వు వచ్చావ్‌గా"

"నేనొచ్చింది నిన్ను చూసి వెళ్దామని. ఏదో నువ్వు ఉన్నావ్ కాబట్టి అతి కష్టం మీద ఓ వారంరోజులు ఉండగలను. అంతేగానీ నీలా నెలల తరబడి ఇక్కడ ఉండడం నావల్లకాదు. ఇంత నిశ్శబ్ద వాతావరణమయితే నాకు పిచ్చెక్కిపోతుంది"

నిఖిలేష్ నిలువుగా తలాడించాడు. "శబ్దానికన్నా, నిశ్శబ్దం మనిషిని ఎక్కువగా భయపెడుతుంది. కాబట్టి శబ్ద కాలుష్యంలో నిశ్శబ్దాన్ని వెతుక్కోగలిగేవాడు ధైర్యవంతుడిగా ఉంటాడు. అంతేకాదు... మనిషి తనేమిటో తను ఆలోచించుకోవాలంటే ప్రశాంత వాతావరణం కావాలి"

రమేష్, నిఖిలేష్ ముఖంలోకి కొద్ది క్షణాలు అదోలా చూసి అన్నాడు, "నువ్వేం మాట్లాడుతున్నావో, నాకొక్కముక్కా అర్థం కావడంలేదంటే నమ్ము"

నిఖిలేష్ ఈసారి పెద్దగా నవ్వేశాడు. "కరెక్టేరా! నేనేదో మాట్లాడేస్తున్నానుగానీ, అది నీకు అర్థమవుతుందో లేదోనన్న విషయం ఆలోచించడంలేదు" అన్నాక, కాస్సేపాగాక చెప్పాడు. "పల్లెజీవితం ప్రశాంతతకు మారుపేరు. ఉరుకులు, పరుగులు లేని ఈ ప్రశాంత వాతావరణంలో మనిషి తన గురించి కాదు ఇతరుల గురించి తీరికగా ఆలోచించగలుగుతాడు. అలా ఆలోచించగలడు కాబట్టే ఎవరేమనుకుంటారో

నన్న భయం అతడిలో ఉంటుంది. దాంతో పాటే నీతి, నిజాయితీలకోసం ధైర్యంగా నిలబడగలుగుతాడు. అందుకే చూడు, పల్లెటూర్లో 'అనాథ' పిల్లలు మనకు చాలా... చాలా అరుదుగా కనిపిస్తారు. అదెలాగంటే, అక్కడ ఓ తల్లి తన బిడ్డను ఏదోవిధంగా వదిలించుకోవాలని ఆలోచిస్తే దాన్ని అక్కడివాళ్ళెవ్వరూ సమర్థించరు. సిటీలోలా మనకెందుకులే అని పట్టించుకోకుండానూ ఉండరు. అప్పటికీ ఒకవేళ ఆ తల్లి బిడ్డను వదిలేస్తే వేరెవరైనా ఆ బిడ్డను దగ్గరకు తీసుకుని ప్రేమాభిమానాలు పంచుతారు... పల్లెలోని ప్రశాంత వాతావరణంలోని గొప్పతనమే అది"

రమేష్ అదోలా నవ్వాడు.

అతడి నవ్వు చూసి నిఖిలేష్ ప్రశ్నించాడు. "ఎందుకు నవ్వుతున్నావ్?"

"ఏదో సామెత చెప్పినట్టు నువ్వీమధ్య ఏ విషయాన్నయినా అక్కడికే తీసుకెళుతున్నావ్. అది మరోసారి అర్థం కాగానే నవ్వొచ్చింది"

"అంటే?"

"ఆఖరికి పల్లెటూరి గొప్పతనం చెప్పడంలోనూ అనాథల టాపిక్ తీసుకొచ్చావ్ నువ్వు... మరి నాకు నవ్వు రాదా?"

అతడెందుకు నవ్వాడో అర్థమయి, నిఖిలేష్ కూడా నవ్వాడు.

★ ★ ★

ఓ రోజంతా ఇంట్లోనే గడిపాక, రెండో రోజు సాయంత్రం రమేష్ నిఖిలేష్‌తో అన్నాడు, "మనం అలా ఎటయినా వెళ్దామా?"

"ఎటెళ్దాం?"

"ఇదేమయినా సిటీనా... అలా ఇందిరా పార్కుకి వెళ్దాం, లేదా పిజ్జా కార్నర్‌కి వెళ్దాం అని చెప్పడానికి. పల్లెటూరు... ఇక్కడ షికారుగా వెళ్ళాలంటే పొలాలు లేదా చెరువు గట్లు అంతేకదా...!"

పల్లె పక్కనే పారే నది గట్టున కూర్చోవడం అద్భుతమైన ఆనందాన్నిస్తుందన్న విషయం నిఖిలేష్ అతడికి చెప్పలేదు. "అవును... అంతేకదా" అని మాత్రం అన్నాడు.

"అందుకే ఎక్కడికో అన్నది తెలియకుండానే అలా వెళ్తూ ఉందాం. ఎక్కడ కాస్త బాగుందనిపిస్తే అక్కడ కూర్చుండిపోదాం"

"సరే పద"

పార్వతమ్మకు చెప్పి ఇద్దరూ ఇంట్లోంచి బయటకు నడిచారు.

ఇరుకైన మట్టి రోడ్డుమీద నడుస్తూనే రమేష్ ఆ పల్లె వాతావరణాన్ని పరిశీలనగా చూడసాగాడు.

చాలా చిన్న పల్లెటూరు. ఓ రెండువేల జనాభా ఉండొచ్చేమో 'మరి ఈ రెండువేల జనాభాను దృష్టిలో పెట్టుకునేనా నిఖిలేష్ 'సిటీలో ప్రాక్టీస్ పెట్టను, ఈ పల్లెకే వచ్చేస్తానంటున్నాడు. ఈ పల్లెటూరి జనం దగ్గరనుండి పెద్దగా ఫీజులు వసూలు చేయలేం. ప్రాక్టీసు అంతంత మాత్రమే ఉంటుంది. ఎప్పుడో ఏదో ఒకటీ, అరా కేసు. కేసు లేనప్పుడు ఈగలు తోలుకుంటూ కూర్చోవాలి. అదే సిటీలోనయితే హాస్పిటల్ ఓపెన్ చేస్తే చాలు జనం గుంపులుగా వచ్చి పడుతుంటారు. అక్కడ ఎంత ఫీజయినా వసూలు చేయవచ్చు ఎంత డబ్బయినా సంపాదించవచ్చు అందులోనూ సిటీలో డాక్టర్‌కి వచ్చే పేరు పల్లెటూరి డాక్టర్‌కి రాదుగాక రాదు'

"ఇక్కడ కూర్చుందామా?"

రమేష్ ఆలోచనలను కట్టిపెట్టి అటు చూశాడు.

తామిద్దరూ ఊరిచివరికొచ్చేశారు. ఊరి చివర రావిచెట్టు కింద గ్రామదేవత విగ్రహం కాబోలు ఉంది. ఆ విగ్రహానికి ఎదురుగా ఓ చింతచెట్టు కింద చప్టాలాంటిది తయారుచేసి ఉన్నారు. కూర్చోవడానికి ఆచోటు అనుకూలంగానే అనిపించింది.

"అలాగే"

ఇద్దరూ చెట్టుకింద కూర్చున్నారు.

అప్పటిదాకా నిఖిలేష్ అడగలేదు. అప్పుడే అడిగాడు. "మా పల్లె ఎలా ఉంది?"

రమేష్ వెంటనే పలికాడు, "పల్లెలన్నీ ఎలా ఉన్నాయో, అలాగే"

"అంటే?"

"పొలాలు, పొలాలను పండించే రైతులు, మట్టిరోడ్లు, రోడ్లమీద కనిపించే పశువులు... ఇవేకదా పల్లెటూర్లంటే"

నిఖిలేష్ మనసులోనే నవ్వుకున్నాడు.

'సిటీలోనే పుట్టి పెరిగిన మనిషికి పల్లెల గురించి ఇంతకన్నా ఎక్కువ అవగాహన ఉండాలనుకోవడం పొరపాటే. ఇతడు పొలాలను, పొలాలను పండించే రైతులనూ చూశాడేగానీ, వాళ్ళమధ్య పెనవేసుకుని ఉన్న చక్కని అనుబంధాలను చూడలేకపోతున్నాడు. మట్టిరోడ్లు చూడగలుగుతున్నాడే గానీ మమతల వెల్లువను గమనించలేకపోతున్నాడు. పల్లెటూరి గురించి పూర్తిగా తెలుసుకోవాలంటే ఆ చోట కొంతకాలమయినా ఉండితీరాలి'

"ఏమిట్రా మాట్లాడవు?"

"ఏం మాట్లాడను?... నేనూ నీ కోణంలోంచి అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నా"

"నన్ను అర్థం చేసుకోకపోతే పోయింది గానీ, ఇలాంటిచోట ప్రాక్టీస్ పెట్టాలనుకునే ప్రయత్నాన్ని మాత్రం మానుకో. ఆ విషయంలో నేను ఎందుకు చెపుతున్నానో అర్థం చేసుకోగలిగితే చాలు"

నిఖిలేష్ పెదాలమీద చిరునవ్వు ఉదయించింది. "మనసులో బలంగా నాటుకున్న భావాలు మాటలతో మారిపోవు"

"నిన్ను ఆ దేవుడు కూడా రక్షించలేడు"

"ఆయన నన్ను రక్షించకపోయినా ఫర్వాలేదు. నేను నా వృత్తి ద్వారా కొంతమందినయినా రక్షించడానికి ప్రయత్నిస్తాను"

రమేష్ దీర్ఘంగా నిశ్వసించాడు. "సరే... ముందే చెప్పేశావ్‌గా, మనసులో బలంగా నాటుకున్న భావాలు మాటలతో మారిపోవని. అలా నిర్ణయించేసుకున్న నీకు ఎంత చెపితే మాత్రం ప్రయోజనం ఏముంటుంది? లీవిట్"

ఇద్దరూ కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా ఉండిపోయారు.

సంధ్యవేళ కావడంతో పొలాలనుంచి ఇంటికి తిరిగొస్తున్నారు రైతులు.

రైతులకన్నా పదడుగుల ముందు పశువులు హుషారుగా పరుగెడుతున్నాయి.

రోడ్డుపక్క చెట్టుకింద కూర్చుని ఉన్న వాళ్ళిద్దర్నీ చూసి, వాళ్ళలో నిఖిలేష్‌ని గుర్తుపట్టి పలకరింపుగా నవ్వుతున్నారు కొందరు.

"ఏం నిఖిలేష్‌బాబూ! ఇక్కడ కూర్చున్నావేంటి?" అడుగుతున్నారు మరికొందరు.

నిఖిలేష్ వారికి వినయంగానే జవాబిస్తున్నాడు.

ఆ తంతు గమనించిన రమేష్ నిఖిలేష్‌ని అడిగాడు, "చూస్తుంటే మనం ఇక్కడ కూర్చుని ఒక్కమాట కూడా మాట్లాడుకోలేమనుకుంటా"

"ఏం చేద్దాం! అందరూ పరిచయస్తులే. అందులోనూ నేను పల్లెలో ఉన్నప్పటికీ అంతగా రోడ్డుమీద తిరగడం, ఇలా ఊరిచివర కూర్చోవడం చేయను. నేనిలా కనిపించేసరికి వాళ్ళు కాస్త ఆశ్చర్యపోతూనే ఆప్యాయంగా పలకరిస్తున్నారు"

"సర్లే! ఏమయినా కబుర్లు చెప్పు"

"ఏం చెప్పను..."

అతడు అలా అనడంతోనే రమేష్ అన్నాడు, "ఈ క్షణంలో నాకు మౌనిక గుర్తుకొస్తోందిరా"

నిఖిలేష్‌కి గొంతు పెగల్చుకోవడం కష్టమయింది. "ఎందుకు?"

"మౌనిక ఇంతవరకూ తన మనసులోని మాట నాకు చెప్పలేదు. ఆమె మనసులో ఏముందో నాకర్థం కావడంలేదు. అసలు మా ప్రేమకథ ఏం కాబోతోందో తెలియడంలేదు"

నిఖిలేష్‌కి ఏం చెప్పాలో అర్థంకాలేదు. ఒక సత్యాన్ని మనసులో దాచుకోవడం ఎంత కష్టమో అప్పుడే అతడికి అర్థమయింది.

"పోనీ... రేపు మనం సిటీకెళ్ళగానే మౌనికకు మరోసారి నా ప్రేమను గురించి చెప్పకూడదూ? "

'ఇప్పుడితడికి మౌనిక మనసులోని మాట చెప్పేస్తే...' ఎట్టి పరిస్థితుల్లోనూ మౌనిక మనసులోని మాట తను బయటపెట్టలేడు.

అందుకే అతి కష్టంమీద గొంతు పెగల్చుకుని "అలాగే" అన్నాడు.

అప్పుడే తల తిప్పిన రమేష్ తదేకంగా అటే చూడసాగాడు.

అది గమనించిన నిఖిలేష్ తనూ తల తిప్పి అటు చూశాడు. పదహారేళ్ళుంటాయి ఆ అమ్మాయికి. ఆ అమ్మాయి పేరేమిటో తనకు తెలియదు. తమ వీధికి రెండు వీధుల అవతల ఉంది వారి ఇల్లు. ఆ అమ్మాయి నాన్నగారి పేరు రామరాజు. ఆయనతో మాత్రం తనకు కొద్దిగా పరిచయం ఉందంతే.

"ఏమిటి రమేష్! ఆ అమ్మాయినే చూస్తున్నావ్? " తల తిప్పి అడిగాడు నిఖిలేష్.

"ఆ అమ్మాయి... చాలా... చాలా అందంగా ఉందిరా" అటే చూస్తూ జవాబిచ్చాడు రమేష్.

"వివరాలు చెప్పమంటావా? "

"చెప్పు"

"వాళ్ళది మధ్యతరగతి కుటుంబం. ఆ అమ్మాయి నాన్నగారి పేరు రామరాజు. ఓ ఐదెకరాల ఆస్తి ఉంది. చాలా మంచి మనుషులని అమ్మ చెపుతూ వుంటుంది"

"ఆ అమ్మాయి పేరు చెప్పలేదు"

"తెలియదురా"

"ఏంటి, ఒక ఊళ్ళోనే ఉండి, ఈ ఊరి అమ్మాయి పేరు తెలియదా? "

"మా ఊరి ఆడపిల్లల వ్యవహారంలో నేను చాలా పూర్. ఏదో పెద్దవాళ్ళతో కాస్త పరిచయం, మరికాస్త చనువు ఉంటాయేగానీ, ఆడపిల్లలనగానే ఆమడదూరంలో ఉంటాను"

"ఆ విషయం మెడిసిన్ ఫస్ట్ ఇయర్‌లోనే నాకర్థమయిందిలే"

ఇద్దరూ నవ్వుకున్నారు.

రమేష్ జస్ట్ క్యూరియాసిటీతోనే ఆ అమ్మాయి వివరాలు అడుగుతున్నాడని నిఖిలేష్‌కి తెలుసు. అందువల్లే తనూ చాలా క్యాజువల్‌గానే ఆ వివరాలు చెప్పాడు.

ఆ అమ్మాయి వాళ్ళిద్దర్నీ దాటుకుని వెళ్ళి కనుమరుగయింది.

మరికొద్దిసేపు ఆ చోటనే కూర్చుని కబుర్లు చెప్పుకున్నాక ఇద్దరూ లేచి ఇంటివైపు రాసాగారు.

ఇంటికి వస్తున్న నిఖిలేష్‌కి ఆ సమయంలో కార్తీక్ గుర్తుకొచ్చాడు.

'లోకం తెలియని పసివాడు. ఆ ఇంట్లో ఎలా ఉన్నాడో ఏమో...' అనుకున్నాడు అతడు. అంతలోనే అనిపించింది, 'మౌనిక ఆ ఇంట ఉన్నంతకాలం పసివాడి గురించి దిగులుపడాల్సిన అవసరముండదులే'

ఇద్దరూ ఇల్లు చేరుకున్నారు.



అదేరోజు రాత్రి...

ఎవరో ఇంటి తలుపు తడుతుంటే ముందుగా రమేష్‌కి మెలుకువొచ్చింది. రిస్ట్ వాచ్‌కేసి చూసుకుంటే పన్నెండుగంటలు కావస్తోంది.

పక్కనే మరో మంచంమీద పడుకుని ఉన్న నిఖిలేష్‌ని తడుతూ "రేయ్ నిఖిలేష్... రేయ్... ఎవరో తలుపు తడుతున్నారు"

నిఖిలేష్ బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ లేచి కూర్చుని "ఎవర్రా అది" అన్నాడు.

"నాకేం తెలుసు, వెళ్ళి చూస్తే నీకే తెలుస్తుంది"

నిఖిలేష్ మంచం దిగి తలుపువైపు నడుస్తుంటే అప్పుడే నిద్ర లేచిన పార్వతమ్మ లైట్ స్విచ్ ఆన్ చేసింది.

అతడు తలుపు తెరిచాడు.

అప్పుడే వెనుక పార్వతమ్మ వచ్చి నిలబడింది.

అటు చూడడంతోనే నిఖిలేష్ విస్మయంతో కళ్ళు పెద్దవి చేశాడు.

ఎదురుగా రామరాజు.

"మీరు... మీరు..." అన్నాడు నిఖిలేష్ ఆశ్చర్యంగా.

ఆయన తమ ఇంటికి రావడం అదే మొదటిసారి. అందులోనూ అంత రాత్రివేళ రావడం అంటే అది ఆశ్చర్యం కలిగించే విషయమే. అయితే ఆ ఆశ్చర్యం వెనుక ఎంత ఆత్రుత దాగి ఉందో ఇంకా తెలియాల్సి ఉంది.

"బాబూ! మా అమ్మాయి... మా అమ్మాయి వందన పురుగుల మందు తాగింది. మీరొకసారి వస్తే..."

నిఖిలేష్ అదిరిపడ్డాడు. ఆ సాయంత్రమే ఊరిచివర తను, రమేష్ కూర్చుని ఉంటే ఆ అమ్మాయి దారమ్మట వెళ్ళడం, ఆ అమ్మాయి గురించే రమేష్ వివరాలడగడం గుర్తొచ్చింది.

ఆ అమ్మాయి ఇంతలోనే...

"పదండి నేను వస్తున్నాను"

రామరాజుగారు వెళ్ళిపోగానే నిఖిలేష్, రమేష్ దగ్గరకెళ్ళి చెప్పాడు. "రమేష్! సాయంత్రం నువ్వో అమ్మాయిని చూసి వివరాలడిగావ్ చూడు... ఆ... ఆ అమ్మాయి పురుగులమందు తాగిందట"

రమేష్‌కి నిద్ర మత్తు వదిలిపోయింది.

"ఏంటి, ఆ అమ్మాయి... ఆ అమ్మాయి మందు తాగిందా?"

"అవును"

"మరి ఆయన ఇక్కడకు రావడం...?"

"నేను డాక్టర్‌ని కదా...! ఏదయినా చేయగలనేమోనని"

"సరే, పద వెళ్దాం"

ఇద్దరూ బయల్దేరాక పార్వతమ్మతో నిఖిలేష్ చెప్పాడు. "అమ్మా! అటెళ్ళొస్తాం"

"మీరు వెళ్ళండి... ఇంటికి తాళం వేసి నేనూ వెనుకే వస్తున్నాను"

ఇద్దరూ వడివడిగా ఆ ఇంటివైపు వెళ్ళారు.

వాళ్ళు ఇల్లు చేరేసరికి ఇంటిముందు జనం గుమిగూడి వున్నారు.

వీరిద్దర్నీ చూడడంతోనే వారంతా వినయంగా పక్కకు తప్పుకున్నారు.

వరండాలో చాపమీద పడుకోబెట్టి ఉన్న ఆ అమ్మాయి చెయ్యి పట్టుకుని చూశాడు నిఖిలేష్.

పురుగులమందు తాగితే మొదట కడుపులోకి పైప్ పోనిచ్చి తాగిన మందు కక్కించేలా చూడాలి. ఆ తర్వాత సెలైన్ ఎక్కించాలి. ఇంజెక్షన్స్ చేయాలి. మందులు వాడాలి.

కానీ తనకు ప్రొసీజర్ కొంతవరకూ తెలుసేగానీ, ఒక డాక్టర్‌కి ఉండాల్సిన ఎక్విప్‌మెంట్ ఏదీ తన దగ్గర లేదు.

అయినాసరే అతడు తాత్సారం చేయదలచుకోలేదు. వాళ్ళింట్లోనే ఉండే ఒక చిన్న ప్లాస్టిక్ పైప్‌ని ఆ అమ్మాయి కడుపులోకి పంపి, వాంతయ్యేలా చేశాడు.

ప్రథమ చికిత్సలాంటిది చేశాకే చెప్పాడు. "ఈమెను వీలయినంత త్వరగా హాస్పిట

ల్ కి తీసుకెళ్ళండి"

రామరాజుగారు భయపడిపోతూ అడిగారు, "బాబూ! టౌన్ కి తీసుకెళ్ళడమంటే అక్కడికెళ్ళేసరికి..." ఆయనకే మిగిలిన మాటలు ఎలా పూర్తిచేయాలో అర్ధంకానట్టుంది.

"ఏమీ కాదండీ... ఎందుకంటే కడుపులోని మందు బయటపడిపోయింది. కాకపోతే ఆ అమ్మాయి స్పృహలో లేదు. ఇంకా కొంత రికవరీ కావలసిన అవసరం ఉంది. కాబట్టి హాస్పిటల్ కి తీసుకెళ్ళమంటున్నాను. ప్రమాదం ఏమీలేదు"

రామరాజుగారు నిఖిలేష్ రెండుచేతులూ పట్టుకున్నాడు. ఆ క్షణం ఆయన కళ్ళల్లో ఆనందంతో కరిగి బయటపడిన కన్నీటి ముత్యాలను రమేష్ చూశాడు.

ఆపదలో ఉన్న వ్యక్తి ఆనందంతో కరిగిపోవడం... అందులోనూ ఏ మనీ మ్యాటర్లోనూ కాదు. తన బిడ్డ ప్రాణాలకు సంబంధించిన విషయంలో!

ఒక మనిషి సాటి మనిషికి చేయగల సాయం అంతకన్నా ఏముంటుంది?

తను ప్రాణం పోసి పుట్టించిన జీవి ప్రాణాలను కాపాడే శక్తి ఆ దేవుడే ఈ డాక్టర్లకు ప్రసాదించాడేమో.

కానీ డాక్టర్లెవ్వరూ తమకున్న ఆ గొప్ప శక్తిని గుర్తించడంలేదు. తాము డబ్బు సంపాదించే యంత్రాలమనే అనుకుంటున్నారు.

ఒక డాక్టర్ తనకున్న ఆ గొప్ప శక్తిని గుర్తించి, దాన్ని సద్వినియోగపరిస్తే అతడు ఖచ్చితంగా భూమ్మీద తిరుగాడే దేవుడే అవుతాడు.

మరి నిఖిలేష్ ఆ విషయంలో అలాంటి నిర్ణయమే తీసుకున్నాడంటే అతడి గొప్పతనాన్ని గుర్తించి తీరాలి.

రామరాజుగారి ఇంటినుండి తమ ఇంటివైపు వెళ్తున్నప్పుడు రమేష్ మౌనంగా ఉండడం గమనించి నిఖిలేష్ అడిగాడు.

"ఏమిట్రా అలా ఉన్నావ్?"

రమేష్ తలెత్తి నిఖిలేష్ ముఖంలోకి చూశాడు. నిఖిలేష్ రమేష్ కళ్ళలోకి చూశాడు.

అతడు మిత్రుడి కళ్ళలోకి చూడగానే, అదిరిపడ్డట్టుగా అడుగు ముందుకు పడక ఆగిపోయాడు.

"రమేష్...".

రమేష్ కన్నులలో నీరు...

అతడు కంగారుగా మిత్రుడి భుజాలమీద చేతులేసి "ఏమిట్రా ఏమయింది నీకు?" అన్నాడు.

"ఏమీ... ఏమీ కాలేదు"

"మరి ఆ కన్నీరెందుకు?"

"అది... అది..."

రమేష్ జవాబు చెప్పేలోపే నిఖిలేష్ మనసు పరిపరివిధాలా ఆలోచించింది.

'ఆ అమ్మాయి... ఆ రామరాజు కూతురికి ఏదయినా ప్రమాదం జరుగుతుందేమోనని వీడు భయపడిపోతున్నాడా? ... లేక ఆ అమ్మాయిని ఆ స్థితిలో చూసి తట్టుకోలేకపోతున్నాడా?'

ఏమీ మనసుకు తోచలేదుగానీ, రమేష్ మాత్రం ఇంకా నసుగుతూ ఉండడం కనిపించింది.

"చెప్పరా... బాబూ! ఎందుకు ఆ కన్నీళ్ళు?"

"అది... ఒకప్పటి నా మాటలు నాకు గుర్తుకువచ్చాయిరా"

"ఏ మాటలు?"

"నువ్వు పల్లెటూరు వెళ్ళి పేదవాళ్ళకు వైద్యసహాయం చేస్తానంటే నేను నిన్ను ఎగతాళి చేశాను"

"అవును... అయితే?"

"పల్లెటూరివారికి డాక్టర్ అవసరం ఎంతుందో నాకిప్పుడే అర్థమయిందిరా... పల్లెటూరి జనాలకు వైద్యసేవలు అందించడం ఒక గొప్ప వరం... అలాంటి గొప్ప పని చేస్తానన్న నిన్ను నేను విమర్శించడం

ఎంత అల్పత్వమో నాకిప్పుడే అర్థమయింది. అలాంటి మాటలు మాట్లాడినందుకు సిగ్గుతో చితికిపోతూ... బాధపడిపోతు న్నాను"

"భలేవాడివిరా" మిత్రుడిని దగ్గరగా తీసు కున్నాడు నిఖిలేష్.

కొద్దిరోజుల తర్వాత మిత్రులిద్దరూ సిటీ చేరుకున్నారు.

★ ★ ★

ఒక్కోసారి ఆనందం, విషాదం ఒకదా నితో ఒకటి ముడిపెట్టుకుని జీవితంలో ప్రవేశిస్తాయి. పెద్ద ఉద్యోగం రావడం ఆనందరకమైన వార్త అయితే, ఆ ఉద్యోగం కోసం తన వాళ్ళను వదిలి దూరప్రాంతా నికి వెళ్ళాల్సిరావడం దుఃఖ కారణం.

నిఖిలేష్ పల్లెనుండి సిటీకి చేరుకోగానే కార్తీక్‌ను చూసుకునేందుకు కృష్ణమోహన్ ఇంటికెళ్ళాడు. పిల్లవాడిని చూసి అతడు చాలా సంబరపడ్డాడు. పదిమంది పిల్లల మధ్య ఎవరో పట్టిన పాలు తాగి, మరె వరో పెట్టిన తిండి తిని బతకడం వేరు, ఒక ఇంట్లో తనదే రాజ్యంగా ప్రేమాభిమా నాల మధ్య సుష్టుగా తిని పెరగడం వేరు. కార్తీక్ ముద్దుగా బొద్దుగా తయారయ్యాడు.

ఊయలలోని కార్తీక్‌ని రెండు చేతులతో పైకెత్తి నిఖిలేష్ ముద్దుల వర్షం కురిపిస్తూ మురిసిపోతుంటే కృష్ణమోహన్, వైదేహిలు అతడికేసి ఇబ్బందిగా చూశారు. అయితే అతడు వాళ్ళ ముఖాలలోని ఫీలింగ్‌ని అసలు గమనించలేదు.

చాలారోజుల తర్వాత అతడిని చూశా నన్న ఆనందంతో ఉన్న మౌనిక అప్పుడే తలతిప్పి వారిద్దరి ముఖాలలోని ఇబ్బందిని చూసింది.

ఇప్పుడే కాదు. గత నెలరోజులుగా తన అన్నయ్య వదినలిద్దరూ ఒక రకమైన ఇబ్బందికర భావంతో బాధపడడం గమని స్తూనే ఉంది.

అందుకు కారణమూ అర్థంచేసుకుంది.

ఆ కారణం అర్థమయ్యాకే ఆమెకు వారి ద్దరి మీద 'అసహ్యం' పుట్టుకొచ్చింది.

మనుష్యులు ఎంత స్వార్థంతో ఆలోచి స్తారో ఇప్పుడిప్పుడే ఆమెకు అర్థమవుతోంది.

అందుకే ప్రస్తుత పరిస్థితిని ఆమె పరిశీల నగా చూస్తోంది.

చాలాసేపటి తర్వాత అతడు బాబుని తిరిగి ఊయల్లో పడుకోబెట్టాక వాళ్ళతో అన్నాడు "కార్తీక్ మీ దగ్గరకొచ్చాక బాగా ముద్దొచ్చేలా తయారయ్యాడు"

కృష్ణమోహన్, వైదేహిలు ముఖాలు చూసుకుని నవ్వలేక నవ్వినట్టు నవ్వారు.

వారి ఇబ్బంది చూడలేనన్నట్టు మౌనిక అంది. "రండి! అలా మేడమీద కూర్చుందాం"

అతడు తలాడించి ఆమె వెనుకే నడి చాడు.

ఇద్దరూ మేడమీదకు చేరుకున్నాక అక్కడే ఉన్న ఓ సిమెంట్ చప్టామీద పక్కపక్కనే కూర్చున్నారు.

అది సాయం సంధ్య వేళ.

ముందున్న బిల్డింగ్ కారణంగా సూర్యాస్త మయం అసలు కనిపించడంలేదు 'నిత్యం దర్శించదగిన ఓ అద్భుత దృశ్యం సిటీ వాతావరణంలో మనం మిస్ అవుతున్నాం' అనుకున్నాడు అతడు. పైగా చుట్టూ ఎటు చూసినా కాంక్రీట్ కట్టడాలే. ఆచోట నిల బడి చుట్టూ ఉన్న పరిసరాలను పరిశీలిస్తే 'మనం కాంక్రీట్ జంగిల్ మధ్య ఇరుక్కుపో యిన భావం కలగకమానదు' అనిపిం చింది.

నిఖిలేష్ చుట్టూ ఉన్న వాతావరణాన్ని పరిశీలిస్తూ ఎటో చూస్తుంటే మౌనిక అత డినే గమనిస్తోంది. ఎందుకో తెలియదు. అతడి ముఖంలోకి చూస్తూ ఉంటే అలాగే చూస్తూ ఉండిపోవాలనిపిస్తుంది ఆమెకు.

ఎటో చూస్తూ హఠాత్తుగా తలతిప్పిన అతడికి ఆమె తన ముఖంలోకే తదేకంగా చూడడం కనిపించింది అతడే తడబడి

"ఏమిటి.... ఏమిటలా చూస్తున్నారు? " అన్నాడు.

అప్పుడు ఈ లోకంలోకి వచ్చినట్టు ఆమె కూడా తడబడి "ఏం లేదు" అంటూ తలతిప్పుకుంది.

మరి కొద్దిసేపటి తర్వాత తలతిప్పి అతడిని చూస్తూ చెప్పిందామె. "మీకో విషయం చెప్పాలనే, నేను మిమ్మల్ని ఇక్కడకు తీసుకొచ్చాను"

"ఏమిటా విషయం? "

"ఇప్పుడు మా వదినగారు ప్రెగ్నెంట్"

"అలాగా!... కంగ్రాట్స్..." అన్నాకే కార్తీక్ గుర్తుకొచ్చాడు. ఒక్కసారిగా అదోరకమైన ఇబ్బంది... అదే... సంతోషం వెంట దుఃఖం కలగలసి వచ్చిన ఫీలింగ్.

"ఏదో గొడ్డొచ్చిన వేళ, బిడ్డొచ్చినవేళ అంటుంటారుకదా పెద్దలు... అలా కార్తీక్ వచ్చిన వేళావిశేషం బాగుంది. పెద్ద లోపం కాకపోయినా, ఎంతోమంది డాక్టర్లకు చూపించుకున్నా ఫలితం కనిపించలేదు. ఇప్పుడు ఇదంతా కార్తీక్ అడుగుపెట్టిన వేళావిశేషమే అంటున్నారు వాళ్ళు"

"ఎలాగయితేనేం వాళ్ళకు మంచే జరిగింది"

"కానీ కార్తీక్‌కి చెడు జరగబోతోంది"

అతడు చప్పున ఆమె కళ్ళల్లోకి చూశాడు. "మీరు... మీరేమంటున్నారు? "

"కార్తీక్‌కి అన్యాయం జరగబోతోందని చెపుతున్నాను" ఆమె చాలా కూల్‌గానే చెప్పింది.

"ఎలా? "

ఆమె కొద్దిక్షణాలపాటు మౌనంగా ఉంది. అయితే ఆ కొద్ది సమయంలోనే మనసులో ఎంతో సంఘర్షణ జరిగింది. 'ఇలా జరగబోతోందని మనసు చెపుతోంది. ఇంట్లో అన్నా వదినల వాలకమూ ఆ నిజాన్ని నిర్ధారణ చేస్తోంది. అనుమానం లేదు... మరికొద్దికాలంలో వాళ్ళు ఆ పసివాడిని తిరిగి అనాథను చేసేస్తారు. లేదా ఒకవేళ లోకానికి భయపడి ఇంట్లో ఉంచుకున్నా పనివాడిగా మార్చేస్తారు. ఇది ఈ ఇంట్లో జరగబోతున్నదే కాదు. చాలాచోట్ల సహజంగా జరిగిపోతున్నదే. ఆప్యాయత పంచడానికి ఎవరూ లేనప్పుడు అనాథను తెచ్చుకుని, బిడ్డ పుట్టాక వాడిని వదిలించుకోవడమో లేదా, పనివాడిగా మార్చేయడమో చేస్తుంటారు. ఈ విషయం తనకు అర్థమయ్యాక నిఖిలేష్‌కి చెప్పడం చాలా అవసరం. ఎందుకంటే ఈ రోజుకి కూడా అతడు కార్తీక్ బాధ్యత అతడిదే అన్నట్టుగా ఫీలవుతున్నాడు. ఈ విషయం కాస్త ముందుగా తెలిస్తే మెంటల్‌గా ప్రిపేరయ్యి, ఏ పరిస్థితి ఎదురయినా తట్టుకునేందుకు సిద్ధంగా ఉంటాడు.

ఆమె చెప్పింది "ఈ సృష్టిలో ఎవరయినా తమ కడుపున పుట్టిన బిడ్డలమీద చూపినంత ప్రేమాభిమానాలు ఇతరులమీద చూపలేరు. అవసరార్థమో లేక తప్పనిసరయ్యో తెచ్చుకున్నవాళ్ళమీద ప్రేమ చూపినా, కన్నబిడ్డలు కళ్ళ ఎదుట నిలిచే సరికే, మొదటి తరహా ప్రేమ మాయమవుతుంది"

"అంటే మీరనేది? "

"కడుపులో బిడ్డ ఉండగానే కళ్ళ ఎదుట బిడ్డను ఎలా దూరం చేయాలా అన్న ఆలోచన మా అన్నయ్యా వదినలకు వచ్చేసింది. అఫ్‌కోర్స్! కార్తీక్‌ను మీకు తిరిగి ఇచ్చేస్తే కాదనరు అని తెలిసినా, ఎలా సంజాయిషీ చెప్పుకోవాలా అని వాళ్ళు తర్జన భర్జన పడుతున్నారు"

అతడికి మనసులో ముల్లు గుచ్చుకున్నట్టు బాధ కలిగింది. అయితే అంతలోనే అతడు సర్దుకుని నవ్వేశాడు.

"ఎందుకు నవ్వుతున్నారు? "

"నేను కార్తీక్‌ను వాళ్లకు దత్తత ఇవ్వలేదు. కాబట్టి వాడిని తిరిగి ఇచ్చేందుకు సంజాయిషీలేమీ అక్కరలేదు. ఈరోజే వాళ్ళతో చెపుతాను. కార్తీక్‌ను నేను తిరిగి

తీసుకెళ్ళిపోతానని"

"వద్దొద్దు" ఆమె వెంటనే చెప్పింది.

"ఎందుకని? " అతడు ప్రశ్నించాడు.

"ఇప్పుడే మీరు ఎందుకు తొందరపడడం? కొద్దిరోజులు పోయాక ఎలాగూ వాళ్ళే చెపుతారు. అప్పటివరకూ వాడిని వాళ్ల దగ్గరే ఉండనివ్వండి"

"అదీ నిజమే"

ఇద్దరిమధ్యా మళ్ళీ నిశ్శబ్దం ఏర్పడింది.

'కార్తీక్ గురించి మాట్లాడడానికి ఇంకేమీ లేదు. కాని...తన గురించే మాట్లాడవలసిన అవసరం ఉంది' అనుకుందామె.

అందుకే ఆమె టాపిక్ డైవర్ట్ చేస్తూ చెప్పింది "మా అన్నయ్య మొన్నీమధ్య నా పెళ్ళి ప్రస్తావన తీసుకొచ్చారు"

ఆమె ఆ ప్రస్తావన ఎందుకు తీసుకొచ్చిందో అతడికి అర్థమయింది. అయినా నవ్వుతూనే అడిగాడు. "మరి మీరేమన్నారు? "

"ఇప్పట్లో పెళ్ళిచేసుకునే ఉద్దేశం లేదన్నాను"

"అలా ఎందుకన్నారు? "

"అలా ఎందుకన్నానో మీకు తెలుసు"

అతడు చప్పున కూర్చున్నచోటునుండి లేచాడు "మనం కిందికి వెళ్ళడం బాగుంటుందేమో"

"నాతో కాసేపు ఏకాంతంగా కూర్చునేందుకు కూడా మీకు భయమా? "

అతడు తడబడ్డాడు "అలా ఎందుకనుకుంటున్నారు? "

"మీ హడావుడి చూస్తుంటే నాకలాగే అనిపిస్తోంది" ఆమె నవ్వింది.

ఏం జవాబు చెప్పాలో తెలియనట్టు అతడు మౌనాన్ని ఆశ్రయించాడు.

ఇద్దరిమధ్యా మళ్ళీ మౌనం దట్టంగా పేరుకుపోవడం గమనించి ఆమె దీర్ఘంగా నిశ్వసించింది.

"సర్లెండి. మిమ్మల్ని ఇబ్బంది పెట్టడం ఎందుకు? ... వెళ్దాం పదండి" మౌనిక లేచింది.

ఇద్దరూ మెట్లు దిగి కిందికి వచ్చారు.

కృష్ణమోహన్, వైదేహిలు భోంచేసి వెళ్ళమని బతిమలాడినా ఉండకుండా అతడు ఆ ఇంట్లోంచి బయటపడ్డాడు.



వైదేహికి మగపిల్లాడు పుట్టాడు.

ఆ విషయం కాలేజీలో మౌనిక ద్వారా తెలిశాక నిఖిలేష్ రమేష్‌ను వెంటబెట్టుకుని హాస్పిటల్‌కి వెళ్ళాడు.

వీళ్ళు వెళ్ళేసరికి ఆఫీసునుండి కృష్ణమోహన్ కూడా వచ్చేసి ఉన్నాడు. అతడు ఊయలలోని తన బిడ్డను ఎత్తుకుని ముద్దాడుతున్నాడు.

అప్పుడే నిఖిలేష్ కళ్ళు కార్తీక్ కోసం వెతికాయి. చుట్టూ చూస్తున్న అతడి చూపులు ఒకచోట నిలిచాయి. ఆ దృశ్యం పెదవులు బిగపట్టేలా చేసింది.

గదిలో ఓ మూల నేలమీద కూర్చుని కనిపించాడు కార్తీక్. నిన్నటివరకూ ముద్దులు, మురిపాలు అందుకున్న ఆ పసివాడు, నేడు ఎవ్వరికీ ఏమీకానీ 'అనాథ'లా దిగాలుగా కూర్చుని ఉన్నాడు.

కృష్ణమోహన్ దంపతులు కనీసం వాడికేసి చూడడంలేదు. తమ రక్తం పంచుకుపు

ట్టిన బిడ్డను చూసి మురిసిపోతూ, మైమర చిపోతున్నారు.

ఆ పసివాడికి ఆ వయసులో తనకు జరి గిన అన్యాయం ఏమిటో తెలియకపోవచ్చు గానీ, తన భవిష్యత్తు గురించి ఆలోచించే జ్ఞానం లేకపోవచ్చుగానీ, ఏదో అయో మయం కనీసం ఏడుపు కూడా రాకుండా చేసినట్టుంది. ఆ కొత్త వాతావరణం, వచ్చి పోతున్న బంధుమిత్రుల సందడి అర్థంకా నట్టు ఆసక్తిగా చూస్తున్నాడు వాడు.

నిఖిలేష్‌కి గుండెకింద నరమేదో మెలివడి నట్టనిపించింది. ఆ క్షణమే కార్తీక్‌ని అక్కడ నుండి తీసుకెళ్ళిపోవాలనుకున్నాడు. అయితే చప్పున అతడికి మౌనిక మాటలు గుర్తుకొచ్చాయి. అతడు మనసులోని కోరి కను అతికష్టంమీద అణిచేసుకున్నాడు.

కాసేపు ముళ్ళమీద కూర్చున్నట్టు అక్కడ కూర్చుని వాళ్ళ దగ్గర సెలవు తీసుకుని వచ్చాడు.

ఆ తర్వాత నెలరోజులకు మౌనిక కార్తీ క్‌ను తీసుకుని నిఖిలేష్ రూమ్‌కి వచ్చింది. ఆ సమయంలో నిఖిలేష్ కాలేజీకి తయార వుతున్నాడు. అతడిని పికప్ చేసుకునేం దుకు రమేష్ కూడా వచ్చి ఉన్నాడు.

అంత ఉదయాన్నే పిల్లవాడిని తీసుకుని రూమ్‌కి వచ్చిన ఆమెను మిత్రులిద్దరూ అదోలా చూశారు. ఎందుకనో మౌనిక ముఖంలో సీరియస్‌నెస్ కనపడుతోంది.

ఏదో జరగకూడనిదేదో జరిగినట్టు ఆ మిత్రులిద్దరికీ అర్థమయిపోయింది.

ఆమె విసురుగా లోపలికి వచ్చాక కార్తీ క్‌ని నిఖిలేష్ చేతిలో పెడుతూ "మీ బిడ్డను మేము కొంతకాలం ఉంచుకున్నాం. ఇక పెంచలేక మీ బిడ్డను మీకు తిరిగి ఇచ్చే స్తున్నాం. తీసుకోండి"

అవి మౌనిక మనసులోనుండి వచ్చిన మాటలు కావని, ఆ ఇంట్లో ఏదో జరిగి ఉంటుందని నిఖిలేష్‌కి అర్థమయింది.

"ఏం జరిగింది మౌనికగారూ?" అడి గాడు అతడు.

"మా ఇంట్లో మా రక్తం పంచుకుపుట్టిన బిడ్డ ఉన్నప్పుడు, మీ వాడి ఆలనా పాలనా చూడాలంటే మాకు కష్టంగా ఉంది. ఈరోజు మా పిల్లవాడిని చూసుకుంటూ మేముంటే మీవాడు మెట్లు ఎక్కబోతూ జారిపడ్డాడు. అప్పటికీ మా వదినగారు వాడిని గట్టిగా నాలుగు దెబ్బలు వేసినా వీడు ఏడుపు ఆపలేదు. ఈమధ్య వీడి అల్లరి ఎక్కువైపోయింది. రోజూ కొడు తున్నా అల్లరి ఆపడం లేదు. అందులోనూ నడక నేర్చుకుంటున్న పిల్లవాడిని కనిపె ట్టుకు చూడడం మావల్ల కాదు కాబట్టి మీ పిల్లవాడిని మీకు అప్పగించేస్తున్నాం"

ఆ ఇంట్లో ఏం జరిగిందో తెలిసిపోయింది నిఖిలేష్‌కి. అతడు జాలిగా కార్తీక్‌కేసి చూశాడు. గత కొద్దిరోజులలోనే పసివాడు బాగా చిక్కిపోయాడు. ముఖంలో సంతోషం కన్నా, భయమే ఎక్కువ కదలా డుతోంది.

అతడు పసివాడిని రెండు చేతుల్లోకి తీసుకుని భుజంమీద వేసుకున్నాడు. 'ఓరి అనాథా! ఇలాగే ఉంటుందిరా నీ బతు కంతా బాధ! ఎవ్వరికీ ఏమీకాని నువ్వు గాలికి పెరగాలి. నీతోటి వాళ్ళు పొందే ప్రేమాభిమానాలు చూసి మనసులో వ్యథ పడాలి. నీ దురదృష్టానికి తిట్టుకుంటూ, నిన్ను ఈ భూమ్మీదకు పంపిన ఆ భగవం తుణ్ణీ, నిన్ను కనిపారేసిన తల్లిదండ్రులను కలగలిపి తిట్టుకోవాలి. అంతే! అంతకు మించి నువ్వు చేయగలిగింది మరేమీ లేదు. ఒకవేళ నీకు సమాజంమీద కోపం వస్తే చివరికి నేరాలనే నువ్వు ఆశ్రయించి కక్ష తీర్చుకోవాలి'

నిఖిలేష్ తలతిప్పి మౌనికకేసి చూసి "కూర్చోండి" అన్నాడు.

ఆమెకు ఇంకా ఇంట్లోని వ్యక్తులమీద కోపం తగ్గినట్టులేదు. "ఫర్వాలేదులెండి నేనిక వెళ్తాను" అంది.

ఆమె మూడ్ బాగోలేదని గ్రహించిన నిఖిలేష్ తలాడించాడు. "సరే మీరు ఎలాగూ కాలేజీకేగా వెళ్లేది. రమేష్ కూడా కాలేజీకే. మీరు అతడితో కలసి కారులో వెళ్ళొచ్చు"

మౌనిక కాస్త ఇబ్బందిగా ఫీలవడం ఇద్దరూ గమనించారు. "మీరూ కాలేజీకి వస్తున్నారు కదా? " అడిగిందామె నిఖిలేష్ని.

"రావట్లేదండి. పిల్లవాడిని రూమ్లో వదిలేసి రాలేనుకదా? వాడిని మళ్ళీ బేబీకేర్ సెంటర్లోనో, ఎక్కడో వదిలేశాకే మళ్ళీ కాలేజీకి రాగలను"

ఈసారి ఆమె అతడికేసి జాలిగా చూసింది. "అయితే ఈరోజు నేను కాలేజీకి వెళ్ళకుండా ఆగిపోతాను. బేబీకేర్ సెంటర్కి వెళ్ళి మాట్లాడివద్దాం"

"అయ్యో! ఇంత చిన్న విషయానికి మీరూ రావడం ఏమిటండీ? నాకోసారి అలవాటయిన విషయమే. నేను వెళ్ళగలను"

"వెళ్ళలేరని కాదు నేను రావడం. వీడి పట్ల మీకు ఎంత బాధ్యత ఉందో, నాకూ అంతే బాధ్యత ఉందని నేను ఫీలవుతున్నాను కాబట్టి"

నిఖిలేష్ చప్పున ఆమె కళ్లలోకి తదేకంగా చూశాడు. ఆమె కళ్ళు దించుకునే ప్రయత్నం చేయలేదు. అతడినే చూస్తూ నిర్మలంగా నవ్వింది.

అప్పుడే రమేష్ ఇద్దరి చూపులు గమనించాడు. ఏదో...ఏదో అనుమానం మొట్టమొదటిసారి మనసులో ప్రవేశించింది. అయితే అంతలోనే అతడు తనకు తాను సర్దిచెప్పుకుంటున్నట్టు 'నోనో! అలా జరగదుగాక జరగదు. నిఖిలేష్ అలా ఎన్నటికీ చేయడు' అనుకున్నాడు.

అప్పటికి నిఖిలేష్ చూపులు మరల్చుకుంటూ "మీ ఇష్టం" ఆమెతో చెప్పాక, రమేష్వైపు తిరిగి అడిగాడు "ఏరా! ఈరోజు నువ్వు కూడా కాలేజీ మానేస్తావా, ఏంటి? "

రమేష్ నవ్వుతూ "మానేయాలనే అనుకుంటున్నాను" అన్నాడు.

"వెరీగుడ్. అయితే కాసేపాగాక ముగ్గురం బేబీకేర్ సెంటర్కి వెళ్దాం"

"అయ్యబాబోయ్! నేను అలాంటి చోటుకు రాలేను. ఆ పిల్లలు, వాళ్ళ అరుపులు ఐ ఫీల్ బోర్ యార్. మీరిద్దరూ వెళ్ళిరండి. ఆ తర్వాత కాసేపు రూమ్లో కూర్చుని కబుర్లు చెప్పుకుందాం. ఏమంటావ్? "

"అలాగే" తలాడించాడు నిఖిలేష్.

మరికాసేపటి తర్వాత మౌనిక, నిఖిలేష్లు కార్తీక్ను తీసుకెళ్ళిపోయారు.

రమేష్ రూమ్లో కాసేపు కుర్చీలో కూర్చున్నాక ఏమీ తోచక లేచి అటూ ఇటూ తిరగసాగాడు. అప్పుడే అతడి చూపు టేబుల్ మీద ఉన్న మౌనిక పుస్తకాలమీద వాలింది.

అతడి మనసులో అదోరకమైన స్పందన. తనకు ప్రియమైన మౌనిక పుస్తకాలు తాకాలి. ఆమె అక్షరాలు స్పృశించి ఆనందించాలి.

ఆ ఆలోచనలతోనే అతడు అడుగులు ముందుకేశాడు. టేబుల్మీద ఉన్న పుస్తకాలు ఆప్యాయంగా తాకాడు. ఏదో తెలియని అనుభూతి మనసంతా కదిలించింది. అత్యంత ఆప్యాయమైన వ్యక్తుల తాలూకూ వస్తువులు కూడా మనసును కదలిస్తాయేమో! అందువల్లే అందరూ తమ వాళ్ళ జ్ఞాపకాలకోసం కొన్ని వస్తువులను ఉంచుకుంటారు. ఆ తర్వాత ఓ పుస్తకాన్ని మెల్లగా తిప్పాడు.

ఒక్కో పుస్తకాన్ని చేతిలోకి తీసుకుని తిప్పుతూ ఉండగా, కిందపడిందా ఉత్తరం.

అతడి కనుబొమ్మలు ముడివడ్డాయి. కిందికి వంగి ఆ కవరు అందుకున్నాడు.

ఆ కవరుమీద ఉన్న పేరు చూడగానే, అతడి కింది పెదవి, పైపంటి కిందచేరి నొక్కబడింది. ఏదో ఉత్సుకత... అణగారిపోయిన అనుమానం తిరిగి జీవం పోసుకుంది.

సంస్కారం కాదనిపించినా అతడు కవరు తెరిచి అందులోకి కాగితం బయటకు తీశాడు.

అతడి చూపులు అక్షరాల వెంట పరుగెత్తసాగాయి. ఒక్కో వాక్యం చదువుతున్న కొద్దీ అతడి ముఖంలో రంగులు మారసాగాయి.

అతడు పెదవులు బిగపట్టాడు.

నిలబడడం కష్టమయినట్టు పక్కనే ఉన్న కుర్చీని ఆసరాగా పట్టుకున్నాడు.

కిటికీలోనుండి దూసుకొచ్చిన గాలి తెమ్మెర అతడిని చూస్తూ అక్కడే నిలబడిపోయింది.

★ ★ ★

నిఖిలేష్‌కి తెలిసిన బేబీకేర్ సెంటర్‌వైపు ఆటో వేగంగా వెళుతోంది.

మౌనిక నిఖిలేష్ ముఖంలోకి చూసింది. యధాలాపంగా తలతిప్పినప్పుడు అతడు తనకేసి చూడడంతో చప్పున తలతిప్పుకుంది.

మరో అరనిముషం గడిచాక ఆమె మళ్ళీ నిఖిలేష్ ముఖంలోకి చూసింది. ఆమె మనసు ఆరాటపడుతోంది. 'చెప్పేయాలి... ఈరోజు ఎలాగయినా చెప్పేయాలి. తన మనసులోని మాట చెప్పేయాలి'

నిఖిలేష్‌కి మరోసారి ఏదో అనుమానం వచ్చిందేమో. చప్పున తలతిప్పి చూశాడు. ఆమె దొరికిపోయింది.

దాంతో ఆమె దొరికిన దొంగలా ఇబ్బందిగా నవ్వేసింది.

"మౌనికగారూ! ఏమిటి... ఏమిటలా నా ముఖంలోకే చూస్తున్నారు? "

అతడే అలా అడిగేయడంతో అప్పటివరకూ ఎలా మొదలుపెట్టాలో తెలియక ఇబ్బందిపడుతున్న ఆమె చెప్పదలచుకున్నది చెప్పేయదగిన అవకాశం వచ్చినట్టుగా ఫీలయింది. "అది... అది... ఈరోజు నేను మీకో విషయం చెప్పాలనుకుంటున్నాను"

నిఖిలేష్ కనుబొమలు ముడివడ్డాయి. అతడు ఆమెవైపు అదోలా చూశాడు.

"ఏ విషయం? "

"కార్తీక్ గురించి"

అతడీసారి ప్రశ్నార్థకంగా ఆమెకేసి చూశాడు.

"రాత్రంతా బాగా ఆలోచించాక, నేనో నిర్ణయానికి వచ్చాను"

"చెప్పండి"

"నేను కార్తీక్‌ని దత్తత తీసుకోవాలనుకుంటున్నాను"

ఆటో సడన్‌బ్రేక్ వేయడంతో కీచుమనే చప్పుడుతో ఆగింది. ముందుకు తూలి నిలదొక్కుకున్నప్పటికీ, రోడ్డుమీద ఏం జరిగి ఉంటుందో కూడా చూడాలనిపించడంలేదు అతనికి. ఆమెనే చూస్తూ "మీరు మీరేమంటున్నారో మీకేమయినా అర్థమవుతోందా? " ఇంచుమించు అరిచినట్టే అన్నాడు.

ఆ అరుపుకు ఆటోడ్రైవర్ కూడా వెనక్కు చూసి, అయినా తనకెందుకులే అనుకుని కాబోలు తలతిప్పుకున్నాడు.

"అర్థం కాకపోవడానికేముంది? రాత్రంతా ఆలోచించాకే ఈ నిర్ణయానికి వచ్చానని చెపుతున్నాను కదా? "

వెంటనే ఏమనాలో తోచనట్టు అతడు తలతిప్పుకున్నాడు. చూపులు రోడ్డుమీద నిలిచాయి. ముందు వెళ్తున్న కారు సడన్ బ్రేక్ వేయడంతో వెనుకనే వెళ్తున్న స్కూటర్ కారుని గుద్దింది. కారుకి చిన్న డామేజ్ అయినట్టుంది. 'నీది తప్పంటే, నీది తప్పని' స్కూటర్‌వాలా, కారు డ్రైవర్ గొడవపడుతున్నారు. దాంతో ట్రాఫిక్ నిలిచిపోయింది.

అతడు చప్పున తలతిప్పి కాస్త సీరియస్‌గానే పలికాడు. "దత్తత తీసుకోవడం అంటే, ఏదో ముద్దుకోసం మూడురోజులు ఉంచుకుని తిరిగి ఇచ్చేయడంకాదు"

"ఆ విషయం నాకూ తెలుసు. దత్తత తీసుకోవడం అంటే నేను ఈ పసివాడికి తల్లిగా మారడం. నా కడుపున పుట్టలేదన్న




మాటేకానీ, నేనే వీడికి కన్నతల్లిని. ఓ కన్న బిడ్డకు ఎలాంటి హక్కులుంటాయో, నా దగ్గర వీడికి అలాంటి హక్కులే ఉంటాయి. అంతేకదా? "

"హక్కులు, బాధ్యతల గురించి నేను మాట్లాడడంలేదు. అసలు హక్కులు, బాధ్య తలకన్నా ప్రేమాభిమానాలు పంచడమే ముఖ్యమని నా ఉద్దేశ్యం. ఈ పసివాడిపట్ల మీకు అపరిమిత ప్రేమాభిమానాలు న్నాయని నాకు తెలుసు"

"మరేమిటి మీ అనుమానం? "

ట్రాఫిక్ క్లియర్ కావడంతో ఆటో ముందుకు కదిలింది.

అతడు మాట్లాడకపోవడంతో ఆమే అడి గింది. "ఓ పెళ్ళికాని అమ్మాయి ఓ పసి వాడ్ని దత్తత తీసుకుంటే, ఆ అమ్మాయిని జనమంతా వింతగా చూస్తారు. పెళ్ళి కావడం కూడా కష్టమవుతుందని మీ భయమా? "

నిఖిలేష్ తల అడ్డంగా ఆడించాడు.

"లేదు రమేష్‌కి మీ మీద ఉన్న ప్రేమ పసివాడిని దగ్గరకు తీసుకునేలా చేస్తుంది.

రమేష్ ప్రేమమీద నాకా నమ్మకం ఉంది"

ఆమె పెదాలమీద నవ్వు చెదిరిపోలేదు. మాటమాత్రం సీరియస్‌గా వచ్చింది. "మీకో విషయం. నేను పెళ్ళంటూ చేసుకుంటే, అది మిమ్మల్నే! లేకపోతే అసలీ జన్మకు పెళ్ళి చేసుకునేదే లేదు. ఈ పసివాడిని పెంచుకుంటూ, వాడితోటే లోకంగా జీవితం గడిపేస్తాను. మీరు అంగీకరిస్తే మాత్రం మనిద్దరం వీడికి అమ్మా నాన్నా అవుదాం. ఈ విషయాలే మరింత విపులంగా ఉత్తరంలో రాశాను. రూమ్ కెళ్ళాక ఉత్తరం ఇస్తాను. చదువుకోండి. నేను మీతో చెప్పలేని చాలా విషయాలు అందులో రాశాను. చదువుకుని... నాకు జవాబు చెప్పండి"

"ఉత్తరం ఏమిటి? "

"ఈరోజు మీతో ఈ విషయం గురించి తేల్చుకోవాలనుకున్నాక, ఒకవేళ మీతో ప్రశాంతంగా మాట్లాడే అవకాశం రానట్లయితే నా మనోభావాలు మీకు అర్థమయ్యేలా ఓ ఉత్తరం రాశాను. అది మీకు అందచేయాలనుకున్నాను. ఆ ఉత్తరం నా పుస్తకాల్లో ఉంది"

అతడు సన్నగా నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నారు? "

"ఉత్తరం చదివినా, ఎదుట మాట్లాడినా నా అభిప్రాయం మారదు"

"అయితే మీరు ఎట్టి పరిస్థితుల్లోనూ నన్ను పెళ్ళిచేసుకోనంటారు? అంతేకదూ?"

"అవును"

"నేనూ నా మనసు మార్చుకోలేను కాబట్టి, ఈ పసివాడిని నాకు దత్తత ఇచ్చే విషయమైనా ఆలోచించండి. అలాగయినా మీరు నాకు ఎంతో మేలు చేసిన వారవుతారు"

అప్పటికి బేబీకేర్ సెంటర్ దగ్గర పడడంతో, డ్రైవర్‌కి ఆటో ఎక్కడ ఆపాలో చెప్పాడు నిఖిలేష్.

ఆటో ఆగాక మీటర్ చూసి డబ్బు ఇచ్చి కిందికి దిగాడు.

అతడు మౌనంగా లోపలికి నడుస్తుంటే ఆమె అడిగింది "మాట్లాడరేమిటి? "

"ఏం మాట్లాడను? "

"నేను అడిగినదానికి జవాబు చెప్పండి"

అతడు దీర్ఘంగా నిశ్వసించాక, అదోలా నవ్వాడు. ఆ నవ్వులోనే ఆమెకు జవాబు దొరికింది.

అప్పటికే ఇద్దరూ బేబీకేర్ సెంటర్ ఆఫీసురూమ్‌కి దగ్గరగా చేరుకోవడంతో ఆమె తాత్కాలికంగా మాటలు ఆపింది.

ఇద్దరూ బేబీకేర్ సెంటర్ ఆఫీసులోకెళ్లారు.



ఉత్తరం చదవడం పూర్తి చేసేసరికి రమేష్‌కి ప్రపంచమంతా తన చుట్టూ గిర్రున తిరుగుతున్నట్టనిపించింది.

అతడు ఇక నిలబడలేనట్టు కుర్చీలో కూలబడ్డాడు. మెదడు స్థంభించిపోయింది.

అలా అతడు ఎంతసేపు ఉండిపోయాడో తెలియదు.

స్థంభించిపోయిన మెదడు ఎప్పటికో పని చేయడం మొదలెట్టింది.

'ఇలా... ఇలా జరుగుతుందని తను

కలలో కూడా ఊహించలేదు. ఇది తను ఊహించని మలుపు'

'జీవితం అంటే ఊహించని మలుపులతో సాగే ప్రయాణమేనా!... మౌనికను మూగగా ఆరాధిస్తున్న తను, ఆమెతోనే జీవితం అనుకున్నాడు. ఆమె లేని జీవితం ఊహించుకోవడానికే భయమేసేది కాని ఇప్పుడు... ఇప్పుడు ఆ భయాన్ని అధిగమించాలి. వాస్తవాన్ని అర్థంచేసుకుని అడుగు ముందుకేయాలి...'

'మౌనిక నిఖిలేష్‌ను ప్రేమించింది...'

అతడు పెదవులు బిగపట్టాడు. దుఃఖాన్ని కంట్రోల్ చేసుకోవాలని ఎంత ప్రయత్నించినా లాభంలేకపోయింది. ఆగలేమంటూ అశ్రువులు బుగ్గలమీదకు జారాయి. అతడు చప్పున ముఖాన్ని రెండు చేతులమధ్య ఉంచుకుని వెక్కివెక్కి ఏడ్చాడు.

అశ్రువులు బయటపడితే తాత్కాలికంగా బాధ కొంతవరకూ ఉపశమిస్తుంది.

బాధ తగ్గిన అతడు కాసేపు ప్రశాంతంగా ఆలోచించాడు.

ఆ ఆలోచన ఆవేశంతో కూడుకున్నది కాదు. విచక్షణతోపాటు, ఆత్మపరిశీలన చేసుకుంటూ ముందుకు సాగింది.

అందువల్లే అతడికి వాళ్లిద్దరి మీదా కోపం రాలేదు. అభిమానం అలాగే మిగిలింది.

అప్పుడే అతడు ఓ నిర్ణయానికి వచ్చినట్టు లేచాడు..

పుస్తకంలోనుండి ఓ కాగితం చించి రాయడం మొదలుపెట్టాడు.

★ ★ ★

మర్నాడు ఉదయమే పసివాడిని ఆచోట వదిలి వెళ్తానని చెప్పి అడ్వాన్సుగా డబ్బు చెల్లించి ఇవతలికి వచ్చాడు నిఖిలేష్.

మౌనిక అతడు ఆటో పిలుస్తుంటే చెప్పింది. "మనం ఏదయినా రెస్టారెంట్‌లో కూర్చుని కాసేపు మాట్లాడుకుందామా? "

"అక్కడ రమేష్ మనకోసం ఎదురుచూస్తుంటాడు"

ఆమె ముఖంలో అసహనం కదలాడింది. ఇక తప్పనిసరై మౌనంగా తలాడించింది.

వాళ్ళిద్దరూ మరో ఆటో పట్టుకుని రూమ్ చేరారు.

మెట్లెక్కేముందే కింద రమేష్ కారు లేకపోవడం గమనించాడు నిఖిలేష్. పైకి వెళ్ళాక తలుపు గడియవేసి ఉండడం చూసి "ఎక్కడికెళ్ళాడబ్బా వీడు? " తనలో తాను అనుకుంటున్నట్టే పైకి అనేశాడు.

"బోర్‌గా అనిపించి, ఇంటికెళ్ళిపోయాడేమో"

"అలా వెళ్ళిపోయేరకం కాదు వాడు..." అంటూ అతడు లోపలికి అడుగుపెట్టాడు. నిద్రపోతున్న కార్తీక్‌ని బెడ్‌మీద పడుకోబెట్టాడు.

అప్పుడే అటుగా చూసిన అతడికి, ఎదురుగా టేబుల్‌మీద మడతపెట్టి ఉన్న కాగితం కనిపించింది. బహుశా మెసేజేమో అనుకుంటూ అటుగా వెళ్ళి కాగితం చేతిలోకి తీసుకుని మడత విప్పాడు.

ఆ కాగితంలో ఏం మేటర్ ఉందోగానీ, అది చదువుతున్న నిఖిలేష్ ముఖంలో కంగారు కదలాడడం గమనించిన మౌనిక అతడికి దగ్గరగా వచ్చింది. అతడి పక్కనే నిలబడి కాగితంలోకి తొంగిచూసింది.

నాలుగు వాక్యాలు చదివేసరికే ఆమెకు విషయం అర్థమయిపోయింది. ఆమె పెదవులు బిగపట్టింది.

అప్పటికి చదవడం పూర్తిచేసిన నిఖిలేష్ ఉత్తరాన్ని పక్కన పడేస్తూ మౌనికతో అన్నాడు "మనం... మనం వెంటనే రమేష్ ఇంటికి వెళ్ళాలి పదండి"

"ఎందుకు? "

"మీరూ ఉత్తరం చదివారుగా... ఒకవేళ వాడేదయినా..." ఆ తర్వాత మరేం మాట్లాడాలో తెలియనట్టు ఆగిపోయాడు.

మౌనికకు ఆ అనుమానం అప్పుడే మనసులో కదలాడడంతో, మొదట రమేష్‌పట్ల

జాలి కలిగింది. వెనువెంటనే కర్తవ్యం గుర్తు కొచ్చింది. "వెళ్దాంపదండి"

నిఖిలేష్ కార్తీక్‌ని తీసుకున్నాడు. మౌనిక ఇంటికి తాళంవేసింది.

ఇద్దరూ మెట్లు దిగి రోడ్డుమీదకు చేరుకున్నారు. అటుగా వెళ్తున్న ఆటోను ఆపి ఎక్కి కూర్చున్నారు. అతడు ఆటో డ్రైవర్‌కి అడ్రస్ చెప్పాడు. ఆటో వేగంగా ముందుకు దూసుకుపోయింది.

ఆటో ఎంత వేగంగా వెళ్తున్నా నిఖిలేష్ మనసులోని టెన్షన్ అతడిని మరింత తొందరపెడుతోంది. "డ్రైవర్! త్వరగా... కాస్త త్వరగా పోనివ్వు" ఆటో డ్రైవర్‌ని రిక్వెస్ట్ చేశాడు.

పావుగంట తర్వాత ఆటో రమేష్ ఇంటి ముందు ఆగింది.

నిఖిలేష్ ఆటో ఫేర్ కూడా చెల్లించలేదు. "మౌనికగారూ! ఆటో ఫేర్ చెల్లించి రండి" అంటూ వేగంగా ఇంట్లోకి పరుగెత్తాడు.

హాలులో చూస్తే రమేష్ లేడు.

అతడు తిన్నగా మెట్లెక్కి బెడ్‌రూమ్ చేరుకున్నాడు. ఆ రూమ్‌లో అటూ ఇటూ చూస్తే రమేష్ అక్కడ కూడా లేడు. మరెక్కడికి వెళ్ళాడు?

"రమేష్... రమేష్" నిఖిలేష్ పెద్దగా అరుస్తూ ఒక్కోగది వెతుకుతుంటే, అక్కడ తిరుగుతున్న పనివాళ్ళు అతడెందుకు కంగారుపడుతున్నాడో అర్థంకానట్టు వింతగా చూడసాగారు.

నిఖిలేష్ ఓ పనివాడిని అడిగాడు "రమేష్ వచ్చాడా? "

"ఇప్పుడే కారు రావడం చూశాను సార్! ఏ గదిలో ఉన్నారో... ఏమో" వాడి జవాబు.

అతడు అన్నిగదులూ వెతుక్కుంటూ ఆ గదిలోకి తొంగిచూసి, అక్కడ రమేష్ ఉండడం చూసి సంతృప్తిగా లోపలికి అడుగుపెట్టబోయి ఆగిపోయాడు.

రమేష్ స్టాండుముందు నిలబడి ఏకాగ్రతగా ఓ చిత్రం గీస్తున్నాడు. అది ఓ పసివాడి బొమ్మ.

ప్రతి కళాకారుడూ తన కళనే తన బాధకు అవుట్ లెట్‌గా మార్చుకుంటాడేమో!

అప్పటికి మౌనిక కూడా కార్తీక్‌ను తీసుకుని వచ్చి నిఖిలేష్ పక్కనే చేరింది. ఇద్దరూ కాసేపు తదేకంగా రమేష్‌నీ, అతడు గీస్తున్న చిత్రాన్ని చూశారు. అతడు ఇప్పట్లో ఈ లోకంలోకి వచ్చేలా లేడని అర్థమయింది.

అందుకే నిఖిలేష్ నెమ్మదిగా "రమేష్" అన్నాడు.

రమేష్ తల కూడా తిప్పలేదు. అసలు నిఖిలేష్ మాటలు అతడికి వినిపించలేదేమో!

"రమేష్" ఈసారి శబ్దం హెచ్చింది.

అయినా అతడిలో కదలికలేదు.

నిఖిలేష్ లోపలికి నడిచి, అతడి పక్కనే నిలబడి భుజంమీద చెయ్యేసి "రమేష్" అన్నాడు.

అప్పుడు... అప్పుడు అతడు ఈ లోకంలోకి వచ్చి మొదట నిఖిలేష్‌ని చూశాడు.

"నువ్వు... నువ్వెప్పుడొచ్చావ్‌రా? "

"ఇప్పుడే"

యధాలాపంగా తలతిప్పి మౌనికను చూసిన రమేష్ ముఖంలో ఆశ్చర్యం కదలాడింది. అదే సమయంలో మరచిపోవాలనుకుంటున్న బాధ కూడా మనసుని పిడికిట పట్టి బిగించినట్టనిపించిందేమో. అదీ కొద్ది సెకనులే!

అతడు వెంటనే తననుతాను కంట్రోల్ చేసుకుంటూ "వాటే సర్‌ప్రయిజ్!... మౌనికగారూ!... మీరు... మీరు మా ఇంటికి రావడమా? ...కమాన్...కమాన్..." ఉత్సాహం తెచ్చుకుని స్వాగతించాడు.

మౌనిక నెమ్మదిగా గదిలోకి నడిచింది. అతడు చూపించిన సోఫాలో కూర్చుంది.

అప్పటికి మనసు కాస్త కుదుటపడగా, వ్యవహారం ముగ్గురికీ తెలిసినదే కాబట్టి

నిఖిలేష్ మౌనికముందే రమేష్ అడిగాడు. "రమ్మీ... ఏమిట్రా... ఏమిట్రా ఆ ఉత్తరం? "

రమేష్ నవ్వాడు. "నేనందులో తప్పేం రాయలేదే"

"కానీ..."

నిఖిలేష్ మరేదో చెప్పబోతుంటే, రమేష్ అతడిని ఆగమన్నట్టు సైగచేశాడు. "దయ చేసి నువ్వింకేం మాట్లాడొద్దురా. ఎందు కంటే అనుకోకుండా మౌనికగారి మనసు లోని భావాలు చదివాక, నేనెంత తప్పుగా ఆలోచిస్తున్నానో నా కర్థమయింది. మీ ఇద్దరి మహోన్నత ఆదర్శాల ముందు నా స్వార్థం ఎంత అల్పమయిందో నాకు తెలిసి పోయింది. ప్రేమ గొప్పదే. అయితే ప్రేమ పథంలో త్యాగం, మానవత, సేవా దృక్పథం ముడివడిఉంటే ఆ ప్రేమ మరింత గొప్పదవుతుంది. పువ్వుకు తావి అబ్బిన ట్లుంటుంది. ఒక డాక్టర్‌గా మారాక తన పల్లెకు వెళ్ళి పేదలకు ఉచిత వైద్యం అంద జేస్తూ నిస్వార్థంగా బతకాలన్న ఆదర్శం మౌనిక గారిది. నీ ఆదర్శమూ అదే. ఆమె మదిలో ఎలా కలిగిందో నీ మీద ప్రేమ కలిగింది. ముఖ్యంగా ఓ పసివాడు అనాథ కాకూడదని నువ్వు పడే తపన ఆమెను కది లించింది. నువ్వు ఇష్టపడితే ఆ బిడ్డకు మీరి ద్దరూ అమ్మా నాన్న కావాలన్న కోరిక ఆమె మనసులో కలిగింది. ఎంత మంచి మనసు ఆమెది? ఆలోచిస్తే మీ ఇద్దరి ప్రేమలో ఎంత త్యాగం ఇమిడి ఉందో నాకర్థమ యింది. రేయ్! నిఖిల్! నా ప్రేమలో గొప్ప తనం ఏముందిరా? కుర్రాళ్ళందరిలానే నేనూ ఓ అందమైన అమ్మాయిని ప్రేమిం చాను. దేరీజ్ నథింగ్ స్పెషల్. అంతే కాదు, ఆ ప్రేమ విఫలమయితే నాలుగురో జులు బాధపడతాను. అంతే, ఆ తర్వాత మరో అమ్మాయిని చూసి పెళ్ళిచేసుకుని తొలిప్రేమను మర్చిపోతాను. దట్సాల్! అందుకే నేను ఆ నిర్ణయానికి వచ్చాను. నాలో సహజంగా సేవాగుణంలేదు. సేవా గుణం లేని నేను పరిమళించే మానవ త్వంతో ముందుకు వెళుతున్న మౌనికగారికి తగిన జోడీ కాదు. పసివాడి విషయంలో తపనపడుతున్న నీకే ఆమె పక్కన నిలబడ గలిగే హక్కు ఉంది. మానవత్వం, సేవాగు ణంతో కూడుకున్న మీ 'ప్రేమపథం' ఆచర ణీయం, హర్షణీయం. ఆ మార్గానికి అడ్డురా వడం నా కిష్టంలేదు. అందుకే... మరేం మాట్లాడకు. నా మాట కాదనకు"

రమేష్ మౌనికవైపు చూసి, "ఇలా రండి" అంటూ పిలిచాడు.

అప్పటివరకూ అతడి మాటలే శ్రద్ధగా మైమరచి వింటున్న ఆమె, తేరుకుని నెమ్మ దిగా పైకిలేచి వారిద్దరికీ దగ్గరగా వెళ్ళింది.

రమేష్ ఓ చేత్తో ఆమె చెయ్యిపట్టుకుని, మరో చేత్తో నిఖిలేష్ చెయ్యి తీసుకొచ్చి వారి ద్దరి చేతులు కలిపాడు.

"... ఈరోజునుండి మీరు పవిత్ర ప్రేమ పథంలో పయనించే ప్రేమికులు. ఈ ప్రపం చంలో ఎవ్వరూ మిమ్మల్ని విడదీయలేరు. అది నిజం" అన్నాడు.

నిఖిలేష్, మౌనికలు ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూసుకున్నారు.

ప్రేమలో విజయం సాధించిన మౌనికను అభినందిస్తున్నట్టు నిఖిలేష్ తన చేతిలో ఉన్న ఆమె చేతిని గట్టిగా నొక్కాడు.

ఆనందంతోపాటు, సిగ్గూ ముంచుకురాగా తలొంచుకుంది మౌనిక. అప్పటివరకూ సోఫాలో మౌనంగా పడుకుని ఉన్న కార్తీక్ అప్పుడే ఏడవడం మొదలుపెట్టాడు.

వాడి ఏడుపు వినిపించడంతోనే నిఖిలేష్, మౌనికలిద్దరూ ఒకేసారి అటుగా అడుగులే శారు.

వారి ఆతృతను చూసిన రమేష్‌కి ప్రేమ భావంకన్నా మరెంతో అపురూపమైన మరేదో భావం మనసులో నిండిపోయి సంతృప్తిని కలిగించింది. ◆

# చతుర కతలు

## వచనభారతం

**ఓ**వ్యాపకం అంటూ లేకుండా నిన్నటిదాకా అల్లరిచిల్లరిగా తిరిగిన మురళి ఒక్కసారిగా 'ఇన్‌ష్యూరెన్స్ ఏజెంట్' అవతారం ఎత్తాడంటే ఆశ్చర్యపోయాను. మురళి నాకు దూరపు బంధువు. చాలామంది బంధువులు, మిత్రులు, హితైషులు అందరూ మురళి ఇన్‌ష్యూరెన్స్ ఫీల్డ్‌లో రాణించలేడనే అనుకున్నారు. అందుకు భిన్నంగా మురళి మిత్రుల్నీ, వ్యాపారస్థుల్నీ, ఉద్యోగస్థుల్నీ అందరినీ సమీపించి, వాళ్ళని ఒప్పించి ఓ సంవత్సరం తిరిగేసరికి 'బిజినెస్' బాగా చేసి తోటి ఏజంట్స్‌కి పోటీగా నిల్చాడు.

అందర్నీ కన్విన్స్‌చేసి పాలసీలు అంటగట్టిన మురళి నన్ను అప్రోచ్ కాలేదేంటబ్బా అనుకుంటూ ఉండగా ఓ రోజు మా ఇంట్లో



ఫోన్ మోగింది!

ఫోన్ ఎత్తగానే 'నమస్తే మావయ్యా!' అన్న మురళి కంఠం వినిపించింది.

"నమస్సులకేం గాని నువు బిజినెస్ బాగా డెవలప్ చేశావుటగా. టాప్ టెన్ ఏజంట్స్ లిస్ట్‌లో నీ పేరు కనిపిస్తోందిట. విన్నాంలే ఆనోటా ఆనోటా నీ రెప్యుటేషన్ గురించి"

"ఏదో స్లోగా పికప్ అవుతున్నాను" అ

న్నాడు

"బాగా మాటలు నేర్చావ్! స్లోగా అనక ఫాస్ట్‌గా పికప్ అవుతున్నామంటారటోయ్ నీలాంటివాళ్ళు? ఏదో టార్గెట్ పెట్టుకున్నావట?" అని అడిగాను క్యూరియస్‌గా.

"అలాంటివేవో ఉంటాయిలెండి మావయ్యా. మీకు తెలీన్దేముంది? అదలా ఉంచండి. మిమ్మల్ని ఓ మాటు కలుద్దామనుకుంటున్నాను" అన్నాడు.

"తప్పకుండా రావోయ్ అల్లుడూ" ఆహ్వానించాను.

"రేపే వచ్చి కలుస్తాను" అన్నాడు.

"యూ ఆర్ మోస్ట్ వెల్‌కం. కాని నీ నుంచి..."

"చెప్పండి మావయ్యా! నా తరపునుంచి మీకేం కావాలన్నా చెయ్యటానికి..." అనబోయేంతలో.

"ఎప్పుడూ నువ్వు వెనుకాడవ్. నాకు తెల్సుగా. విషయం ఏవిటంటే మా మిత్రుడొకాయన మహాభారతం వచనంలో రాశాడు. అది రెండు భాగాలుగా అచ్చయింది. ఒక్కొక్క సెట్ వెల వెయ్యి రూపాయలు. నీకు చాలా పలుకుబడి ఉందిగా. నువ్వేమైనా ఓ పదిపదిహేను సెట్స్ సేల్ చేసి పెట్టగలవేమోనని..."

"అదెంత పని మామయ్యా! రేపు మీవద్దకి వస్తాగా. అప్పుడన్నీ వివరంగా మాట్లాడుకుందాం" అంటూ ఫోన్ పెట్టేశాడు మురళి! తర్వాత నెల గడిచినా మనిషీ రాలేదు. ఫోనూ చెయ్యలేదు.

ఓరోజు బజార్లో పిల్లలకోసం బండెడు నోట్ బుక్స్ కొని ఆ ప్యాకెట్ మోస్తూ వెళుతోంటే మురళి కనిపించాడు. కేక పెట్టి పిల్చాను బిగ్గరగా. నా పిలుపు వినబడనట్లే మురళి తన మోటర్ బైక్ స్టార్ట్ చేసుకుని అదే పోత పోయాడు.

నేను పట్టుకుని ఉన్న ప్యాకెట్ చూసి, ఆ 'వచన భారతం' తనకి అంటగడతానన్న భయంతో మురళి అలా పారిపోయాడని తర్వాత అర్థంచేసుకున్నాను. నిజానికి పాపం, నా వద్ద వచన భారతమూ లేదు, దాని కాపీలంతకంటే లేవని తెలీదుగదా అతనికి.

ఈ కథంతా వాళ్ళక్క చెబితే విన్న మా బావమరిది "అతనికన్నా తెలివైనవారు మీరు బావగారూ! ఉత్తుత్తి వచన భారతం పేరు చెప్పి మురళి మీకో పాలసీ అంటకట్టకుండా భలేగా తప్పించుకున్నారులెండి". అని ప్రశంశిస్తుంటే మా ఆవిడతో పాటు నేనూ నవ్వాను.

–అంపేరాయని వెంకట చంద్రశేఖరరావు

---

## అనువుగానిచోట...

సెకండ్ 'షో' సినిమా చూసి ఇంటికి వెళ్తున్నాడు ప్రభాకరం. స్వతహాగా ప్రభాకరంలో కాస్త ఆవేశం పాలు అధికం. దానికితోడు చూసిన సినిమా భారతీయుడు కావటంతో అన్యాయాన్ని ఎదిరించే భారతీయుని క్యారక్టర్ ప్రభాకరాన్ని ఎంతగానో ఆకట్టుకుంది.

ఎవరికివారే ఎవరి పరిధిలో వాళ్ళు అన్యాయాన్ని ఎదిరించగలిగితే ఈ సమాజమింత .దుస్థితిలో వుండేది కాదనిపించింది. ఏవేవో ఆలోచనలతో రోడ్డు వెంబడి నడుస్తున్న ప్రభాకరం రైల్వేగేటు దగ్గరకు వచ్చి పక్కనే వున్న గూడ్స్ షెడ్ రోడ్‌వైపు దారిమళ్ళాడు. వాళ్ళ ఇంటికి వెళ్ళడానికి అది దగ్గరిదారి. ఆ రోడ్డంతా చీకటి గుండంగా వుంది. అయినా అది అలవాటైన దారి కావటంతో అతనికేమీ ఇబ్బందిగా లేదు.

నడుస్తున్న ప్రభాకరం ఒక్కసారిగా ఆగాడు. గూడ్స్ పెట్టెల దగ్గర చీకట్లో ముగ్గురు వ్యక్తులు నిలబడివున్నారు. ప్రభాకర్‌కు ఏదో అనుమానం కలిగింది. వాళ్ళ కంటపడకుండా కాసేపు పక్కగా నిలబడి



వాళ్ళను గమనించసాగాడు. సమయం గడుస్తోంది కాని వాళ్ళు అక్కడనుండి కదలటం లేదు.

సందేహం లేదు. వాళ్ళు దొంగలే అయివుంటారనిపించింది. గత కొద్దిరోజులుగా రాత్రివేళల్లో పోలీసువారు చేస్తున్న హెచ్చరిక 'నగరంలో దొంగల ముఠాలు ప్రవేశించాయని వర్తమానం అందింది. కొత్త వ్యక్తులుగాని, అనుమానించదగినట్టుగా వున్న వ్యక్తులుగాని, కనిపించిన యెడల పట్టి పోలీసువారికి అప్పగించటంగాని, సమాచారం అందించటంగాని చేయవలసినదిగా పౌరులకు విజ్ఞప్తి' అనే మైక్ ఎనౌన్స్‌మెంట్ గుర్తుకొచ్చింది. అంతకు ముందే చూసిన భారతీయుడు సినిమా కళ్ళ ముందు కదలాడింది. ఒంట్లోని ఆవేశం ఆగ్రహంగా మారింది.

ఓ పౌరునిగా తన కర్తవ్యం నెరవేర్చాలనే నిర్ణయంతో ధైర్యంగా వాళ్ళ దగ్గరకు వెళ్ళాడు.

"ఏయ్! మిస్టర్! ఎవరు మీరు? అర్ధరాత్రి వేళ మీరిక్కడేం చేస్తున్నారు? " అన్నాడు సీరియస్‌గా.

"సాలే! ఏందిబే" అన్నాడు ముగ్గురిలో ఒకడు. అప్పటికే వాళ్ళు మద్యం సేవించివున్నారు.

వాళ్ళ మాట తీరు, ఉచ్ఛారణను బట్టి వాళ్ళు ఈ ప్రాంతంవాళ్ళు కాదనే నిర్ణయానికి వచ్చి గొంతు పెంచి మళ్ళీ రెట్టించి అడిగాడు. ఒక్కసారిగా వాళ్ళు ముగ్గురూ 'ఎలర్ట్' అయ్యారు.

★ ★ ★

తెలతెలవారుతుండగా- ఒళ్ళంతా గాయాలతో కాలూ, చేయి ఫ్రాక్చర్ అయి స్పృహలేని స్థితిలో వున్న ప్రభాకరం రైల్వేపోలీసుల కంటబడ్డాడు.

"మీకెందుకొచ్చిన పనులండీ ఇవి" అంటూ రోజూ ముక్కు చీదుతూనే వుంది ప్రభాకరం భార్య. దెబ్బల బాధ ఒకపక్క, పెళ్ళాం మాటల బాధ మరోపక్క వీటికితోడు చూడటానికి హాస్పటల్‌కు వచ్చిన వాళ్ళు అసలేం జరిగిందని అడిగితే ఏమని చెప్పాలో అర్థంగాక అదోరకం బాధ. ఇన్నిరకాల బాధల మధ్య సగం చచ్చి నెలరోజుల తరువాత పెళ్ళాం మెళ్ళో పుస్తెలతోసహా తాకట్టు పెట్టి డాక్టరు బిల్లు చెల్లించి బతుకుజీవుడా అనుకుంటూ బయటపడ్డాడు.

ప్రభాకరాన్ని చితగ్గొట్టిన ఆ దొంగలకోసం పోలీసులు శాయశక్తులా ప్రయత్నిస్తూనే వున్నారు.

– హైమవతీ సత్య

---

## గురువు

**రా**మశాస్త్రి ఒక ఆడపిల్ల తండ్రి. తగిన వరుడికోసం బంధువుల్ని, స్నేహితుల్ని, తెలిసున్నవారిని కలిసి 'మంచి సంబంధం వుంటే చెప్పి పుణ్యం కట్టుకోండి' అని బతిమలాడుతున్నాడు. ఈ తిరుగులాటలో ఎంతోమంది పెళ్ళిళ్ల పేరయ్యలని కలిశాడు. వాళ్ళవృత్తి రామశాస్త్రిని ఎంతగానో ఆకర్షించింది. తన పిల్ల పెళ్ళిమాట ఎలావున్న తానూ ఓ 'పెళ్ళిళ్ల పేరయ్య' కంపెనీ తెరవాలని కోరిక కలిగింది.

దానికోసం వాకబు చేయగా తన కూతురికి సంబంధం చెప్పడమే కాకుండా, ఈ వృత్తిలో పైకి రావాలంటే ప్రస్తుతం దశదిశలా అదరగొడుతున్న బ్రహ్మయ్యే రామశాస్త్రికి తగిన గురువని అడగని వాళ్ళుకూడా సలహాలిచ్చి పారేశారు.

బ్రహ్మయ్య రామశాస్త్రి కళ్ళెదుట అంచెలంచెలుగా ఎదిగిపోయాడు. అతడిదే ఊరో, ఏ ప్రాంతమో, ఎందరు పిల్లలో ఎవరికీ తెలీదు. ఈ చిన్నపట్టణానికెలా వచ్చాడో అంతకన్నా తెలీదు. ఎవరూ ఆరా తీయలేదు.

బ్రహ్మయ్య ఏ నక్కని తొక్కొచ్చాడోగానీ పట్టిందల్లా బంగారమైనట్టు అచిరకాలంలో కొంప-గోడూ, డబ్బు-దస్కం, పేరు-ప్రతిష్టలు ఆర్జించాడు. అంతేకాదు తనతో మరొకరు పోటీపడకుండా జాగ్రత్త పడ్డాడంటారుగానీ అది కల్ల.

కొంతమంది డాక్టర్లని వారి హస్తవాసి అందలమెక్కించినట్టు బ్రహ్మయ్య మాటతీరు, ప్రవర్తన భేషుగ్గా ఉంటాయి. ఆ కారణంగా ఉభయులూ సుముఖులు కావడం, తర్వాత ముహూర్తం, పెళ్ళి, శోభనం నిర్విఘ్నంగా జరగడమేకాదు ఆ దంపతులు పిల్లాపాపల్తో హాయిగా ఉంటారు. ఉన్నారు కూడా.

ఆ విధంగా బ్రహ్మయ్య పెళ్ళిళ్ళ పేరయ్య. వృత్తికి గౌరవమర్యాదలు కల్పించిన ఘనుడు. అందుకే బ్రహ్మయ్య దర్శనం సులభంకాదు. అతడు ఇంట్లో ఉండేది బహుతక్కువ. రాత్రి పగలూ ముఖ్యంగా ఆడపిల్లల తల్లిదండ్రులు పిల్లలకి సంబంధాలకోసం ఎంతో ఆత్రంగా తిరుగుతారు. నేర్పుగా, మంచిగా మగ, ఆడ పెళ్ళివారిని ప్రోత్సహించి కలుపుతాడు. తన సమక్షంలో పెళ్ళిచూపులు జరిపించి కట్నకానుకలు భారం కాకుండా తెగ్గొట్టి సంబంధం ఖాయపరుస్తాడు. తదుపరి ఒక మంచి ముహూర్తంలో వివాహం జరిగిపోతుంది. నవదంపతుల్ని వారి పెద్దలకిమించి ఆశీర్వదిస్తాడు.

ఇచ్చింది తీసుకుంటాడు, డిమాండుందని ముక్కుపిండడు. అందుకే బ్రహ్మయ్యనెవరూ పెళ్ళిళ్ళ పేరయ్యగా కాక కష్టం, సుఖం తెల్సిన మనిషిగా గౌరవించి ఆదరిస్తారు. నిజం చెప్పాలంటే బ్రహ్మయ్యవల్లే ఆ వృత్తి మంచిపేరు గడించింది. వృత్తివల్ల బ్రహ్మయ్య బతకడం లేదు, బ్రహ్మయ్యవల్ల వృత్తి వెలుగుచూసింది.

రామశాస్త్రి కూడా అదే అంటాడు, కానీ బ్రహ్మయ్య వద్ద శిష్యరికం చెయ్యడానికి ఎందుకో రామశాస్త్రి ఇష్టపడడం లేదు. కారణం అడిగితే, "గురు కృపవల్ల ప్రతీవిద్యా బాగా అబ్బు

తుంది. తర్వాత శిష్యుడు రాణిస్తాడు. ఇంతి దిగా బ్రహ్మయ్యను అందలమెక్కించిన బ్రహ్మయ్య గురువువద్ద శిష్యరికం చేస్తే స్వల్ప కాలంలో బ్రహ్మయ్యని మించొచ్చని నా ఆశ. అది దురాశకాదు. మరియు బ్రహ్మయ్యను అణగదొక్కాలనీకాదు. అందుకే బ్రహ్మయ్య గురువుగారికోసం అన్వేషించాను. కానీ వివ రాలు లభించలేదు. అయినా విరమించను. నేరుగా బ్రహ్మయ్యనడిగి తెల్సుకుంటాను. ఏ



శిష్యుడూ తన గురువును దాచిపెట్టరు. అడ గ్గానే బైట పెడతారు. బ్రహ్మయ్య ఇంటివద్ద ఉన్నాడుట...” అంటూ శాస్త్రి వెళ్ళాడు.

★ ★ ★

బ్రహ్మయ్య, రామశాస్త్రి ఎదురెదురు కూర్చు న్నారు. శాస్త్రి తన పరిచయమయ్యాక, “మీ గురువెవరు? వారి ఊరూపేరూ దయుంచి చెప్పండి” అని అడిగాడు.

విన్న బ్రహ్మయ్య కళ్ళుమూస్తూ చిరుదర హాసం చేశాడు తప్ప నోరు మెదపలేదు. కొద్ది క్షణాలు వేచి చూసిన శాస్త్రి విరామం భరిం చలేక రెట్టించాడు.

అప్పుడు బ్రహ్మయ్య కళ్ళుతెరిచి, “నాకు గురువంటూ ఎవరూలేరు. లేని గురువు గు రించి ఏమని చెప్పను” అన్నాడు. వెంటనే రామశాస్త్రి అనుమానంతో వీక్షించాడు. మరు క్షణం శాస్త్రి మనోగతం అర్థమై బ్రహ్మయ్య గట్టిగా నవ్వేసి, “నువ్వు నమ్ము నమ్మకపో... నాకు నేనే గురువును, అన్నీనూ” అనేసరికి రామశాస్త్రి అనుమానం బలపడింది తప్ప నమ్మలేదు. అందుకే గుడ్లప్పగించి చూశాడు.

“నేను ఆరుగురు ఆడపిల్లల తండ్రిని. వాళ్ళ వివాహాలు చేసేసరికి చాలా చెప్పులు అరి గాయి. కొన్ని గొడుగులు చిరిగాయి. ఉన్న కాస్త ఆస్తీ కరిగిపోయింది. తర్వాత పన్నెండు

పురుళ్ళు పోసి, సారె, చీర పెట్టి సాగనంపడానికి ఇల్లు చెల్లిపోయింది. ఆ అపారమైన అనుభవం గురువుగా నన్నాదుకుంది. 'స్వీయానుభవం' మనిషికి మాతృమూర్తికంటే ఉత్తమగురువు. పువ్వులమ్మినచోట కట్టెలమ్మలేక కాకతాళీయంగా ఇక్కడికొచ్చి ఈ వృత్తి చేపట్టింది సిరిసంపదలకోసం కాదు. నావంటి ఆడపిల్లలు గల తల్లిదండ్రులకి సహకరించాలన్న ఆశయంతో జీవిస్తున్నాను" అని నిశ్చలంగా, ఉల్లాసంగా ముగించాడు.

అప్పుడు రామశాస్త్రి హృదయపూర్వకంగా రెండుచేతులూ జోడించాడు బ్రహ్మయ్యకి మీరే నా గురువు అంటూ.

– ఎం. కృష్ణ

---

## దాటదు

బంగార్రావు... ఉరఫ్ బంగారం... పెళ్లి కోసం కనే కలలు ఇన్నీ అన్నీ కావు. పెళ్లి వయసొచ్చి ఏళ్ళు గడిచిపోతున్నా కొడుక్కి పెళ్ళి చెయ్యాలన్న ఆలోచన రాని తల్లిదండ్రులమీద పీకలదాకా కోపం పెరిగిపోతున్నా ఏమీ చెయ్యలేని నిస్సహాయత. 'పాపం వాళ్ళు మాత్రం ఏం చెయ్యగలరు' అని అప్పుడప్పుడు జాలి కూడా పడుతూ వుంటాడు. అందుకు కారణం లేకపోలేదు. బంగార్రావు తర్వాత ఏణ్ణర్థానికి పుట్టుకొచ్చిన ఆడపిల్ల! గుండెలమీద కుంపటిలా పెళ్ళికెదిగిన ఆడపిల్లను ఇంట్లో పెట్టుకొని ఏ తల్లిదండ్రులు మాత్రం ముందుగా కొడుక్కి పెళ్ళి చేయాలనుకుంటారు?

చదువు సంధ్యలూ... పనీపాట్లు... అన్నీ ఉన్న ఆడపిల్ల. కట్నకానుకలకు ఏ లోటూ చెయ్యని శక్తిసామర్థ్యాలున్న తల్లిదండ్రులే. అయినా బంగారంలాంటి చెల్లెలికి పెళ్ళి సంబంధాలు ఎందుకు రావడంలేదో బంగారానికి ఎంత బుర్రబద్దలు కొట్టుకుంటున్నా అర్థం కావడంలేదు. 'పెళ్లికి వయసు రావడం మాత్రమే కాదు. టైము కూడా రావడం ముఖ్యం కాబోలు' అనుకున్నాడు.

అరుగుమీద పడకకుర్చీలో కూర్చుని ఆలోచనల్లో మునిగి తేలుతున్న బంగారం రాంబాబు రాకతో ఈ లోకంలోకి వచ్చాడు.

"ఒరేయ్ బంగారం... మనం అర్జంటుగా బయటకెళ్ళాలిరా" అన్నాడు రాంబాబు.

"ఏమిట్రా... హడావిడి. ఇంతకీ ఎక్కడికెళ్ళాలి?" అడిగాడు బంగారం.

"అదేరా... సుందరరామయ్యగారు లేరూ... వాళ్ళింటికి ఎవరో గొప్ప జ్యోతిష్యులు వచ్చారట. ఒక్కసారి వెళ్ళి నీ చెయ్యి చూపిద్దాం. జరిగినవి, జరిగేవి అన్నీ చెప్పేస్తున్నారట. నీ పెళ్ళి విషయం అడుగుదాం" అంటూ విషయం చెప్పాడు రాంబాబు.

మిత్రులిద్దరూ సుందరరామయ్యగారింటికి బయల్దేరారు.

మిత్రులు వెళ్ళేసరికి ఎవరికో చెయ్యి చూస్తున్నాడు జ్యోతిష్యుడు. ఆయన చెప్పిన వాటికన్నిటికీ తల ఊపుతున్నాడు అతను నిజమేనన్నట్టు. ఆ తర్వాత మరో ఇద్దరయిన పిదప బంగారం వంతు వచ్చింది. తమకన్న ముందు చెప్పించుకున్న వాళ్ళందరూ చెప్పినవి చెప్పినట్టుగా, జరిగినట్టుగా ఒప్పుకోవడంతో మరింత నమ్మకం ఏర్పడింది బంగారానికి.

బంగారం ముందుకు చాపిన చేతివంక పట్టి పట్టి చూశాడు జోస్యుడు. పక్కనే పెట్టి వున్న భూతద్దాన్ని చేతిలోకి తీసుకొని మరీ పరిశీలించాడు రేఖల్ని. ఆ తర్వాత చేతిలో వున్న సన్నపాటి పుల్లతో రేఖల్ని తాకించి తాకించి గాఢంగా ఓ నిట్టూర్పు వదిలాడు ఆయన.

అంతసేపు ఆలోచించడంతో ఏం చెప్తాడా... అన్న ఆత్రుతతో ఊపిరి బిగబట్టి మరీ కూర్చున్నాడు బంగారం. "అబ్బాయ్... నీ చెయ్యి చూస్తుంటే చదువు గురించో... ఉద్యోగం గురించో వచ్చినట్టుగా లేదు. ఎందుకంటే అవి రెండూ నీకు ఉండనే వున్నాయి"



అన్నాడు బంగారం ముఖంలోకి చూస్తూ ఆయన. ఒక్కసారిగా వెలిగిపోయింది బంగారం ముఖం. "అవును స్వామీ" అన్నాడు.

"మరి దేని గురించి వచ్చినట్టు. పెళ్ళి గురించా..." అన్నాడు ఆయన సన్నగా నవ్వుతూ. అవునంటున్నట్టు తలూపాడు సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ బంగారం. "మార్చి దాటదు.. ఫో!" అంటూనే చెయ్యి వదిలేశాడు ఆయన.

'ఇంకెంత, మరో రెండు నెల్లేగా...' అనుకుంటూ ఇంటిముఖం పట్టారు మిత్రులిద్దరూ.

★ ★ ★

బంగారం పెళ్లి గురించిన బంగారుకలల్లో ఉండగానే మార్చి నెల కాస్తా చక్కా పోయింది. కానీ బంగారం పెళ్లిమాట కాదు కదా. చెల్లెలి పెళ్లికి కూడా ఏమాటా జరగలేదు. 'భూతకాలం బాగానే చెప్పి... భవిష్యత్తు తప్పాడేమిటా...' అనుకుంటూ సుందరరామయ్యగారి దగ్గర అడ్రసు తీసుకొని జోస్యులవారికి ఉత్తరం రాశాడు. 'స్వామీ.. మీరు చెప్పిన మార్చి నెల జారిపోయింది. మీ మాట మాత్రం జరగలేదు' అంటూ.

నాలుగోనాటికల్లా జోస్యుల వారి దగ్గర నుండి ఉత్తరం వచ్చింది. త్వరత్వరగా విప్పాడు ఆ కవర్ని. అందులో ఇలా వుంది. 'నాయనా! నా మాట తప్పదుగాక తప్పదు. నేనేమన్నాను. మార్చి దాటదు అనికదా... ఏ సంవత్సరమో చెప్పలేదుగా!'

– సూరిపండు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060. Cuddapah: 70011; Tadepalligudem:28881; Warangal: 59933

